## శ్రీ ఆండే నారాయణస్వామిగారి ఇతర రచనలు:

- వ్యాఖ్యాసాలు
- స్నేహితుడు
- ఉపాసనాబలం
- కారుణ్యం

# కష్టసుఖాలు

## ౧

జ్ఞానికమ్మ తన ఇద్దరు పిల్లలతో లోపలకు కాలు పెట్టేసరికి వసారాలో గోడకు వున్న మంచానికి చేరగిల పడ్డ అవ్వ "అమ్మాయ్ చుట్టాలొచ్చారేవ్" అని కేక వెయ్యగా ఇంట్లో యేదో పనిలోవున్న రాజమ్మ బయటకు వచ్చి "యీ బండికి

"అత్తయ్యా ఎప్పుడు వచ్చింది?" అని జానికమ్మ అవ్వను ఉద్దేశించి అడగ్గా "వచ్చి నెల రోజులవుతుంది." అని బదులు చెప్పింది రాజమ్మ.

"ఎట్లావుండేది మనిషి ఎట్లా అయిపోయింది! చప్పున గుర్తుపట్టలేక పోయ్యానంటే నమ్ము" అన్నది అవ్వ.

"పచ్చగా పచ్చి పసుపు కొమ్ములాగా ఎట్లావుండేది! నల్లబడి పోయింది" అని రాజమ్మ అనగా—

"అయిదోతనం పోతే ఏముంటది నా తల్లీ! ఆయువు పోయినట్లే. నువ్వు మట్టుకు నీ మానానికి వెనక యెట్లావుండేదానివి" అన్నది అవ్వ.

జానికమ్మ కాళ్ళు కడుక్కొని రాజమ్మ గోడకు పెట్టివున్న మంచం వాల్చగా కూర్చున్నది. భర్త వుండగా దంపతులిద్దరూ కళకళ్ళాడుతూ ఎంతో సంతోషంతో గడిపిన ఈ యింటికి తానీ స్థితిలో వచ్చినందుకు జానికమ్మ కళ్ళవెంట బొటబొటమని నీళ్ళు కారినవి.

పిల్లలిద్దరూ తాతగారింటికి వచ్చిన సంతో

అవి మూడుగదుల పెంకుటిల్లు. ఉత్తరంవైపు గొడ్లపాక, యింటి వెనకా ముందు ఖాళీస్థలం వున్నది. పిల్లలిద్దరు గొడ్లపాకాలో మేతకని తెచ్చి పడవేసిన మొక్కజొన్నచొప్ప చిల్లాకారం చేస్తూ నంబుల్ని యెక్కడైనావున్న మొక్కజొన్న బొండ్లను విరుస్తున్నారు.

రాజమ్మ లోపలకువెళ్ళి చేతిలోవున్న పనిముగించుకుని వచ్చి జానికమ్మ సరసన మంచంమీద కూర్చుని "యేదో వాకీ రావాలంటివి అమ్మాయ్-వచ్చిందా ?" అని అడిగింది.

"రాలేదు వదినే. ఆడదానికి నాకెవరిస్తారు ? నోటా, పాటా" అన్నది జానికమ్మ.

"నీ పరిస్థితి ఎట్లా మారిపోయింది, తమ్ముడు ఎంత మంచివాడు! ఆయన ప్రాణానికి ఆ పాపిష్టిముండ ఎక్కడ దాపరించిందో!" అని నిట్టూర్పు విడిచింది రాజమ్మ.

"ఏదివచ్చినా ఆడదానివల్లనేకాదూ! భూమ్మీద ఎటువంటి వాళ్లున్నారనుకున్నావు! అందుకనే కాలం యిట్లా తగలడ్డది" అని అంటుకున్నది అవ్వ.

"తమ్ముడు ఎంత మంచివాడు 'అక్కయ్యా' అని నోరారా పిల్చేవాడు. పండగలకు వచ్చినప్పుడు నేనుచేసిన వంట యెంతోబాగుందని మెచ్చుకునేవాడు. 'వంకాయకూర నువ్వు చేస్తేనే తినాలి అక్కయ్యా' అనేవాడు" అని రాజమ్మ అనగా,

"నన్ను ఎంతో బాగాచూసేవారు వదినే. ఆయనతోపాటు దేనిలోనన్నా కళ్ళుమూసుకుందామంటే పిల్లల్ని నా మెడకుకట్టి వెళ్ళాడు" అని దుఃఖపడ్డది జానికమ్మ.

"అట్లా అనుకుంటే యెట్లా అమ్మాయ్! పోయినవాళ్ళతో పోతామా? మీ అన్నయ్య పోతే నేనేంచేశాను ?" అన్నది రాజమ్మ.

"అయినా మీకేదో కొద్దో, గొప్పో పొలంవున్నది. నా కేమన్నా ఆధరువు వున్నదా వదినా" అన్నది జానికమ్మ.

"వెనక మీది యెటువంటి సంసారం! నీ పెళ్ళికి ఎంత పొలంవుండేది!" అని విచారపడ్డది రాజమ్మ.

"అదంతా నా దురదృష్టం. ఆస్తి పోతేపోయింది. వీరెందుకు పోవాలి?" అని వాపోయింది జానకమ్మ.

"ఏంచేస్తాం అమ్మాయ్? సంసారం నిలబెట్టుకోవాలి. పిల్లవాడు పెద్ద వాడైందాకా నీకొంతకాలం కష్టం. తర్వాత నీఅన్నం యెవరు తినను? యిప్పుడు మాకున్నది రెండెకరాలేగా! అది యేమూలి? గేదెలనుపెట్టుకుని పాలూ, పెరుగూ అమ్ముకుని పిల్లల్ని పోషించుకుంటూ వస్తున్నాను" అని రాజమ్మ అనగా ఇక అవ్వ అందుకున్నది.

"అట్లా బెంబేలుపడితే యెట్లాగమ్మాయ్! పిల్లల్ని పెద్దవాళ్ళను చేసి సంసారం నిలబెట్టుకోవాలి. మా రాజమ్మతల్లిని చూడరాదు? పిల్లలు చిన్న వాళ్ళయినా యెట్లా సంసారం నెట్టుకొస్తుందో. వేకువఝామున లేస్తుంది. ఇల్లూ వాకిలి చిమ్ముకుని, తర్వాత గేదెలపాలు పితుక్కొని వచ్చేవాళ్ళకు పాలూపెరుగూ పోస్తూ వూపిరాడకుండా పనిచేస్తుంది. నా మూనానికి నేనుపుట్టుకు ముసలాయన యెప్పుడు పోయ్యాడో, అప్పటినుంచే సంసారం నెట్టుకొచ్చాను; యిప్పుడు కోడలు మొగుణ్ణి గుప్పెట్లో పెట్టుకుని 'నువ్వెనంగా యెంత?' అంటుంది. అవిశౌక రాణి. పొద్దు పొడిస్తేనేగాని నిద్రలేవదు. ఇంట్లో అడ్డమైన చాకిరీ నేనేచెయ్యాలి. అవతల పుల్ల యివతల పెట్టదు." అన్నది అవ్వ.

అవ్వ రాజమ్మ తల్లి. ఆమెపేరు కనకమ్మ? వాళ్ళది నర్సరావుపేట. ఆమెకు ఒక కొడుకూ, ఇద్దరు కూతుళ్ళూ. ఆమెకు ఏమాట దగ్గరా కోడల్ని ఆడిపోసుకోవడం పరిపాటి. ఈ ముప్పైఆరుకోట్ల జనాభాలోను చెడ్డవాళ్ళు తన కొడుకూ కోడలూను. వాళ్ళమీద తగవులాడినప్పుడల్లా ఆమె ఏ కూతురి ఇంటికో చేరుతుంది.

అవ్వ ఇట్లా చెప్పుకెళ్ళుతూవుండగా రాజమ్మ అడ్డువచ్చి "కష్టాలు వచ్చినప్పుడే ధైర్యంగా ఉండాలమ్మాయ్! నీకేమంత ఇబ్బంది వున్నది. ఇద్దరు పిల్లలు! మొగపిల్లవాడు సరేసరి, నాలుగేళ్ళుపోతే సంపాయించుకొస్తాడు. ఆడ పిల్లంటావా పెద్దదానినిచేసి ఒక అయ్యచేతిలోపెడితే ఆదేపోతుంది. అంతటితో నీ బెడద వదిలిపోతుంది." అని క్షణం ఆగి "ఐతే అమ్మాయ్, ఘోషణం జాడ ఏమన్నా తెలిసిందా?" అని అడిగింది రాజమ్మ.

"ఏమీ తెలీలేదు వదినా ఏమయ్యాడో? ఏమిటో! వాడున్నావుంటే ఖాపు కాస్త అండగా వుండేవాడు" అన్నది జానికమ్మ.

"ఆమధ్య పోలీసులు 'భూషణం వున్నాడా?' అని రెండు మూడుసార్లు మా ఇంటికీ వచ్చారు. లేడని చెప్పాను. ఆ పాపిష్టిముండ వాళ్ళ ప్రాణాలకు మిత్తవలాగా దాపరించింది. పాపం ఎక్కడున్నాడో? ఏమిటో?" అన్నది రాజమ్మ.

ఇంతలో ఎక్కడనించో రాజమ్మ ఇద్దరు పిల్లలూ వచ్చారు. వచ్చి గొడ్ల పాకలో మొక్కజొన్న కండెలు విరుచుకుంటున్న జీతగాళ్ళనుచూసి వాళ్ళ దగ్గరికి పరుగుపెట్టారు. "అవేంబాగుంటై మేం మొన్న పొలంనుంచి పెద్దపెద్ద కండెలు తెచ్చుకున్నాం" అని పూరిస్తూ అన్నది రాజమ్మ చిన్నపిల్ల సీత.

"కాల్చుకుంటే ఇవికూడా బాగానేవుంటై" అంది జానకమ్మకూతురు శశి.

"దానికి ఇవ్వలేవని అంటున్నదిలేవె" అన్నాడు జానికమ్మ కొడుకు రాధాకృష్ణ.

"ఆ కండె నాకివ్వవుట్రా?" అన్నది రాజమ్మ పెద్దపిల్ల లక్ష్మి.

"అమ్మా ఎంతఆశ- పెద్దకండె కాజేద్దామనే" అన్నాడు రాధాకృష్ణ.

"అసలు మావికావేంటి? ఎందుకివ్వవు?" అని నిలదీసి అడిగింది లక్ష్మి.

"మీవైతే ముందు నువ్వు విరుచుకోలేక పోయ్యావు" అన్నాడు రాధాకృష్ణ.

"అనిక్కి అమ్మ పొలాన్నించి టాటికాయలు తెస్తుందిగా" అన్నది సీత.

"తెస్తే పరవాలేదులే" అన్నది శశి.

నాకండె అది తీసుకుందనీ, నాది వాడు తీసుకున్నాడనీ ఒకళ్ళ చేతిలో కండెలు ఒకళ్ళు లాక్కుంటూ నలుగురు పిల్లలూ అయిల్లాసు ఓ యుద్ధభూమిలా మార్చారు. ఆ గల్లంతుకు ఇంటి పెంకులు లేచిపోయినయ్.

కాసేపటికి కెవ్వుమని శశి కేక వినపడగా జానికమ్మ గదిలోకి వెళ్ళింది. పొయ్యిదగ్గర పిల్లలంతా కూడారు. "అన్నయ్య నా చెయ్యి కాల్చా"డంటూ శశి ఏడుస్తూ తల్లికి ఫిర్యాదు చేసింది.

"నేను కొట్టలేదమ్మా. పొయ్యిలో కండె తీసుకుంటూవుంటే అదే చెయ్యి పెట్టింది. నిప్పురవ్వ చేతిమీద పడ్డది" అని సంజాయిషీ యిచ్చాడు రాధాకృష్ణ.

"నాకండె తీసుకోబోతే చేతిమీద నిప్పు వెయ్యలేదయ్యా?" అని వాదించింది శశి, ఏడుస్తూనే.

"రాధాకృష్ణ నిజంగానే నిప్పు వేశాడత్తయ్యా" అని సాక్ష్యమిచ్చింది లక్ష్మి.

తల్లి ఇద్దర్నీ కూకలేసి శశిని పెరట్లోఉన్న నీటిగాబు దగ్గరకు తీసుకెళ్ళి ఇంత బురదతీసి కాలినచోట రాసింది.

గుంటూరునించి రైలుకూత వినపడగా రాజమ్మ "పన్నెండు గంటలయింది అమ్మాయి, భోజనానికి రా అమ్మా" అని పిలవటంవల్ల జానకమ్మ, పిల్లలూ భోజనం చేశారు. జానకమ్మ భోజనంచేసి పడుకుని లేచేటప్పటికి దాదాపు సాయంత్రం నాలుగయింది. అవ్వతో కాసేపు పిచ్చాపాటి మాట్లాడి అట్లా వీధి వాకిట్లోకి వెళ్ళి నిలుచుంది. వాళ్ళ యింటికి ఎదురుగా కొత్తగా దాబా కడుతున్నారు. పాలూ, పెరుగూ అమ్ముకునే కోటమ్మ ఆ దాబా కట్టిస్తున్నది. పగంబడ లేచింది. ఆమెను అంతా పాలకోటమ్మ అంటారు. కొరిటిపాడంటే ఆ చుట్టుపక్క పాలకూ పెరుగుకూ ప్రసిద్ధి. గుంటూరు పట్టణానికి మూడు వంతులు పాలూ పెరుగూ సప్లయి అయ్యేది ఆ గ్రామంనుంచే.

తాను పైఎత్తున వచ్చినదానికంటే గ్రామం ఎంతో మార్పుచెందింది. తాను యిందాక బజారునే వస్తూవుంటే పూరి ఇళ్ళస్థానే ఎన్నో పెంకుటిళ్ళు, దాబాలు వెలిసినవి. గ్రామం వెనకటికీ ఇప్పటికీ అసలు పోలికేలేదు. తన చిన్నతనంలో తన తండ్రిగారిఇల్లే గ్రామానికి చివర. ఇప్పుడు గ్రామం మధ్య అయింది. ఊరు ఎంతో పెరిగిపోయింది.

గంపనిండా తాటిపళ్ళువేసుకుని వీధినే వెళ్ళుతున్న ఎవరో ముసలాయన "ఎప్పుడొచ్చావమ్మాయ్?" అంటూ రెండు తాటిపండ్లు జానకమ్మకిచ్చి వెళ్ళిపోయాడు. చేతిలో రావిఆకుచుట్ట పెట్టుకుని ఎవరో బుడ్డోడు పొలంనుంచి వీధినే గేదెలు తోలుకెళ్ళాడు.

అది శ్రావణమాసం. మబ్బుపట్టడంవల్ల ఆకాశం నీళ్ళకుండలా నల్లగా ఉన్నది. సూర్యరశ్మి కనపడటంలేదు.

రెండో సూర్యుడు ఉదయించినట్లు రూపాయి వెడల్పున కుంకుంబొట్టు పెట్టుకుని ప్రక్కయింటి రంగమ్మ "ఎప్పుడొచ్చావమ్మాయ్!" అంటూ వచ్చింది. "పొద్దునొచ్చాను పిన్నీ" అన్నది జానికమ్మ. ఇద్దరూ కలసి లోనికి వచ్చి వసారాలో కూర్చున్నారు. తల్లి చేతిలోవున్న రాటిపంప్లు చూసి పరుగెత్తుకుంటూ వచ్చి యిద్దరు పిల్లలూ చెరోపండూ పట్టుకెళ్ళారు.

"అయ్యో పాపం! దేవుడు అప్పుడే నీ కీ రాత రాశాడమ్మాయ్! నిన్ను గురించే అప్పుడప్పుడూ అనుకుంటూవుంటాను. అయితే మీ ఆడబిడ్డకు అదేం మాయరోగం? మీఆయనావాళ్లు ఎంత మంచివాళ్లూ ఎటువంటి సాంప్రదీకులూ! వంశానికి అపకీర్తి తెచ్చేందుకే ఇటువంటివాళ్ళు పుట్టటం" అన్నది రంగమ్మ.

"ఎవరి రాత ఎట్లా వున్నదో అట్లా తెల్లవారుతుంది. ఎవరేం చేస్తారు పిన్నీ?" అన్నది జానికమ్మ.

"అంతే తల్లీ అంతే. బంగారంలాంటి నీ సంసారం యిట్లా అవుతుందని ఎవరనుకున్నారు? ఎట్లా కావాలని రాసుందో అట్లా జరుగుతుంది!" అన్నది రంగమ్మ.

"అయితే, మీ కనకదుర్గ ఏ వూళ్ళో వుంటున్నది పిన్నీ?" అని అడిగింది జానికమ్మ.

"మా కనకదుర్గా? నోట్లో ఆడుతున్నది. తూర్పున అదేదో ఊళ్ళో వున్నారమ్మా—అక్కడకు బదిలీ అయింది. మొన్న పండక్కు వచ్చినప్పుడు నీసంగతి అడిగి తెలుసుకుని చాలా విచారపడ్డది. దానికో మొగపిల్లవాడూ, ఆడపిల్లా. మళ్ళా యిప్పుడు నీళ్ళు పోసుకుంది. వాళ్ళ భార్యాభర్తలు చిలకా గోరంకల్లాగా ఎంత బాగావుంటారనుకున్నావు అమ్మాయ్! అతనికి రెండు వందలు జీతం. మొన్న వచ్చినప్పుడు కనకదుర్గ చంద్రహారం చేయించుకున్నది. మనిషిదగ్గర ఎంత శాంతం, ఎంత నేర్పు! సంసారం ఎంత పొదుపుగా జరుపుకుంటుందనుకున్నావు అమ్మాయ్! చెప్పవలసివస్తే దాన్నే చెప్పాలి. ఇక మా కోడళ్ళు వున్నారు. మా పెద్దకోడలు కొంచెం ఫరవాలేదు గానీ, చిన్నది వున్నదే-దుబారా మనిషి. నా మాటంటే దానికి లెఖ్కలేదు. నువ్వనంగా ఎంత అంటుంది. మా కాలంలో అత్తకింద ఎంత భయభక్తులతో చేశామో వీళ్ళ

క్షేమన్నా తెలుసా ?........" అని రంగమ్మ చెపుతూవుంటే యిటువంటి మహ దివకాశంకోసం వెయ్యి కళ్ళతో యెదురుచూస్తూన్న కనకమ్మ చెవులకు 'కోడలు' అన్న బీజాక్షరాలు సోకగానే చప్పున అందుకుని "యీ కాలపు వాళ్ళకు పెద్దా చిన్నా అంటే ఏమన్నా గౌరవంవుందా ? మా కోడల్లాంటి మనిషి యెక్కడాలేదు. నోటివెంట మాట వచ్చిందంటే గజ్జెలగుఱ్ఱంలా ఆడు తుంది........" అని ఏదో చెప్పుకెళ్ళుతున్నది.

చినుకులు పడటం ప్రారంభమైంది. రంగమ్మ లేచి "వాన వస్తున్నది. ఇంటిదగ్గర గడ్డి గోదాం ఎక్కడివి అక్కడ బయటనే వున్నవి. తడిచిపోతై. నే వెళ్ళి సర్దేవరకూ అవి అట్లా వుండవలసిందే—ఏ కోడలికీ పట్టదు" అంటూ గబగబా వెళ్ళిపోయింది.

మర్నాడు తెల్లవారింది. రాజమ్మ చీకటితో లేచి ఇల్లూ వాకిలీ చిమ్ముకుని నాలుగు గేదెల పాలు పితికింది. రాత్రి కురిసిన వర్షానికి ఇంటిముందు నేలంతా తేమగా వున్నది. పెరట్లో వేసవిలో ఎండిపోయిన పూలమొక్కలు చిగురులు వేసి పూస్తున్నవి. నలుగురు పిల్లల్లోనూ ముందుగా నిద్రలేచిన లక్ష్మీ శశీ పూలన్నీ కోసుకుని తల్లోపెట్టుకున్నారు. పాలమనిషి కావిడి వేసుకుని వచ్చాడు. నేలంతా తేమగా వున్నందున కావిడి వసారాలోపెట్టుకుని కూర్చున్నాడు. అతడు యిల్లిల్లూ తిరిగి ప్రతిరోజూ వాడుకగా పాలు పోయించుకుని గుంటూరు తీసుకెళతాడు. అతడు గొడ్ల పాకవైపుచూసి "కొత్తగేదెను ఎప్పుడు కొన్నావు రాజమ్మా ?" అని అడిగాడు.

"నాలుగు రోజులయిందన్నా కొని" అని బదులు చెప్పింది, పాకలో ఏదో పనిచేస్తున్న రాజమ్మ.

"ఎంతకు కొన్నావు ?" అని అడిగాడతడు.

"రెండు వందలకు కొన్నాను" అన్నది రాజమ్మ.

"పొడుగూ అదీ బాగానేవున్నది. ఏమన్నా ఇచ్చేదేనా ?" అని మళ్ళా అడిగాడు అతడు.

"ఈని పదిరోజులే అయింది, ఇంకా దారిలో పడలేదన్నా: పిండి అదీ తినిపిస్తున్నాం" అన్నది రాజమ్మ.

"దొంగగొడ్లు అమ్మవస్తున్నై జాగ్రత్త. మొన్న అవతల బజార్లో ఎవరో అమ్మవస్తే గేదెనుకొన్నారు. తర్వాత అసలువాళ్ళు వచ్చి మాదని పట్టుకున్నారు. పెద్ద గందరగోళం అయింది" అన్నాడు అతను.

"ఇది అటువంటిది కాదులే అన్నా. స్వయంగావెళ్ళి కొన్నాం" అన్నది రాజమ్మ.

ఇంట్లోవున్న కనకమ్మ కూతుర్ని లోనికిపిలిచి "కలిపేవా ?" అని మెల్లిగా అడిగింది. రాజమ్మ "ఆ" అనగా కనకమ్మ పాలమనిషి అనుమాన పడకుండా అతనికి వినపడేలా బిగ్గరగా "కొలపాత్ర ఎక్కడ పెట్టేవే నాతల్లీ. ఇందాకటినుంచి వెతుకుతున్నాను" అని కమ్మేసింది, కొల పాత్రను చేత్తో పుచ్చుకునే.

వీళ్ళు నీళ్లు కలపడమే కాకుండా ఎన్ని చేతులైతే మారతాయో అంతా కక్కుర్తి పడవలసిందే. ఇక బస్తీలో హోటలువాడు సరేసరి. బిందెకు నాలుగు బిందెలు తీర్థం కలుపుతాడు. తీరా ఆ పాలు త్రాగేవాళ్ళ నోటిదగ్గిరికి వెళ్ళేసరికి అన్నీ నీళ్ళే. కనకమ్మ కూతుర్ని అడిగి తెలుసుకుని పాలగుండిగ తీసుకువచ్చి అతనికి పాలు కొలిచి పొయ్యగా అతడు వెళ్ళిపోయ్యాడు.

రాజమ్మ మినపప్పు నానపోసి అపూట గారెలు చేసింది. పిల్లలూ జానికమ్మా భోజనాలయ్యాక పడుకుని లేచేసరికి మూడు దాటింది. వసారాలో వాల్చిన మంచంమీద కూర్చుంది. ఇంతలో ప్రక్కయింటి నాగయ్య వచ్చాడు. వయస్సు యాభై ఏళ్ళు పైబడి వుంటవి. అతడు వస్తూ గుమ్మంలోనుంచే "రాజమ్మా, మాపిటికి ఓ శేరు పాలు కావాలమ్మా. చుట్టాలొచ్చారు; గేదేమో యెండిపోయింది. పాలూ పెరుగూ కొనలేక చస్తున్నాం. రేపో మాపో ఓ పాడి గేదెను కొనాలి." అంటూ వసారాలోనికివచ్చి అక్కడ మంచంమీద కూర్చున్న జానికమ్మను చూసి:

"ఎప్పుడొచ్చావు జానికమ్మా ? యిట్లా మారిపోయావు పాపం ! ఛప్పున గుర్తు పట్టలేక పొయ్యానంటే నమ్మ" అన్నాడు.

"నిన్న వచ్చాను పెద్దయ్యా" అంది జానికమ్మ.

రాజమ్మ "కూర్చో మావా!" అంటూ వసారాలో మంచం వాల్చగా నాగయ్య కూర్చుని "ఇప్పుడు నీకు జరుగుబాటు యట్లా జానికమ్మా? కొద్దో, గొప్పో ఆస్తి యేమైనా మిగిలిందా?" అని అడిగాడు.

"యేమీ లేదు పెద్దయ్యా! ఆఖరకు వుండడానికి యిల్లుగూడా లేకుండా పోయింది" అంది జానికమ్మ.

"అయ్యో పాపం, అట్లాగా అమ్మా! మీ మామగారు వుండగా ఎటువంటి సంసారం మీది! ఆయన ఎంత పలుకుబడి కలవాడు! మీవూళ్ళో ఆయన ఎదటికి వచ్చి మాట్లాడేవాడున్నాడా? ఎంత ఆస్తి! నిలబెట్టుకుంటే పిల్లపిల్ల తరానా తిన్నా తరగని ఆస్తి. కొడుకు హయాములో అంతా పాడుచేశాడు. ఇప్పటివరకు వుంచే ఆ పొలం ఇప్పటి కిమ్మతు ప్రకారం యెంత ఆస్తి అయ్యేది!" అన్నాడు నాగయ్య.

"అయ్యో పెద్దయ్యా! బాకీవాళ్ళు నిలవనిస్తేనా? పెద్దమొత్తం బాకీ ఒక్కళ్ళకే వుంది. తతిమ్మా బాకీలు కొద్ది. ఆ పెద్దబాకీవాళ్ళకు పొలంమీద కన్ను పడ్డది. వాళ్ళది మా ప్రక్కగ్రామమే. వాళ్లు నీళ్లుత్రాగనిస్తేనా? 'మీరెందుకు తొందరపడతారు? కావలసినంత ఆస్థివుందే; యేటావచ్చే ఫలసాయంతో విదానంగా మీబాకీలు తీర్చుకుంటాను.' అని వారు వాళ్ళకు యెంత నచ్చచెప్పినా వాళ్లు వింటేనా? రిజిష్టరు నోటీసులిచ్చి దావాచేస్తామని హంగామాచేసి వాళ్ళకయితే పొలం యిస్తామో, లేదో అని వాళ్ళ చుట్టాల్లో ఒకళ్ళని మధ్య అడ్డం పెట్టి నాటకమాడి వాళ్ళద్వారా నలభై యకరాలూ యకరం వెయ్యిరూపాయిలు చొప్పున కాజేశారు" అంది జానికమ్మ.

"అయ్యో! ఎంత చవకలో పోయిందమ్మా, బంగారంవంటి పొలం! ఇప్పుడు నాలుగువేల కిమ్మత్తులో వున్నది. నలభై యకరాలు! లక్షన్నర పైచిలుకు ఆస్తి" అన్నాడు.

"తినేవాళ్ళ గీత మంచిది కావద్దూ పెద్దయ్యా! ఒకరినని ఏంలాభం? ఆస్తి పోతే పోయింది. వారెందుకు పోవాలి? అదంతా నా దురదృష్టం" అని వాపోయింది జానికమ్మ.

"ఆస్తి పోయింది మీ కుర్రవాడు పుట్టాకే కదూ?" అని అడిగాడు నాగయ్య.

"మొన్ననేగా పెద్దయ్యా ఆస్తి పోయింది. ఇప్పటికి అయిదా రేళ్ళవుతుందేమో. మా రాధాకృష్ణకి యిప్పుడు పదకొండేళ్లు. అంటే, ఆస్తి పొయ్యే నాటికి ఆరేళ్ళవాడు" అంది జానికమ్మ.

"అట్లయితే మీ ఆస్తి మీకు మళ్ళా వస్తుందమ్మా" అన్నాడు నాగయ్య.

"ఎలావస్తుంది పెద్దయ్యా ? " అని అడిగింది జానికమ్మ.

"ఎలా వస్తుందేమిటి ? తాత సంపాదించిన ఆస్తి మనమడికేగాని, కొడుక్కి అమ్మేటందుకు హక్కులేదు. మీ పుత్రవాడికి మైనరు వెళ్ళిన వెంటనే వాళ్ళమీద దావా పడవేస్తే, లక్షన్నర విలువచేసే ఆస్తి గిర్రుని చక్కావస్తుంది" అని చెప్పాడు నాగయ్య.

"అదెక్కడ మాటలే పెద్దయ్యా! పోయిన ఆస్తిమళ్ళా యెలావస్తుంది?" అంది జానికమ్మ.

"అట్లంటా వేమిటమ్మా, పిచ్చిదాన! కోర్టువిషయాలు ఆడదానికి నీకేం తెలుసు ? నేను చెప్పినట్టు చెయ్యండి. ఆస్తి మళ్ళా రాకపోతే నాపేరు మారు పేరు పెట్టండి. యిట్లాగే మా తోడల్లుడు రెండేళ్ళ క్రిందట యకరం పదిహేను వందలు పెట్టి రెండెకరాలు రేగడ కొంటే, దానికి మైనరు వ్యాజ్యం పడ్డది. దానితో తల్లక్రిందులై చస్తున్నాడు. యకరం పొలం యిస్తాం రాజీపడండని వాళ్ళకు రాయబారం పంపుతుంటే వాళ్లు ససేమిరా అంటున్నారు. ఆఖరుకు యిట్లా తగలడుతుందో యేమిటో! ఇది డబ్బమ్మా తల్లీ డబ్బు! కాస్తా కూస్తా? లక్షన్నర విలవచేసే ఆస్తి. జాకీవాళ్ళతో నిదానంగా తీర్చుకుంటాం లొందరపడ వద్దని మీరు యెంత మొరపెట్టుకున్నా వినక మీగొంతుమీద కూర్చుని కుతంత్రం చేసి భూమిని కాజెయ్యలా! వాళ్ళు చేసిన మోసానికి మీరు చెయ్య వలసిన పని యిదే" అన్నాడు నాగయ్య.

"ఎప్పటి మాటోగా పెద్దయ్యా! అప్పటికి రాజెవరో? రెడ్డెవరో? ఎవరు చూశారు?" అంది జానికమ్మ.

"ఏదో భర్తపోయిన చింతతో నీ విట్లా వైరాగ్యంగా మాట్లాడుతున్నావు గాని, తర్వాతనైనా నీకు తెలిసిరాదటలే. అయినా నువ్వూరుకున్నా రేపు నీ కొడుకు వూరుకుంటాడా? పెద్దవాడయ్యాక వాళ్ళ చెవులు మెలేసి పిండడూ!

వస్తానమ్మా ! గుంటూరుపెళ్ళి కూరలు పట్టావాలి" అంటూ నాగయ్య వెళ్ళి పొయ్యాడు.

జానకమ్మ తాను వెంటతెచ్చుకున్న రామాయణం వచనగ్రంథాన్ని తీసి చదువుకుంటూ వుంటే ఇంతలో పొరుగింటి రంగమ్మా వాళ్ళూ వచ్చి పొద్దుకూకే వరకూ చదివించుకుని విన్నారు.

జానికమ్మవచ్చి అప్పటికే పదిరోజులయింది. ఆవాళ మధ్యాహ్నం జాని కమ్మ భోజనం చేసి లోపల పడుకున్నది. జానికమ్మ నిద్రపోతున్నదని యెంచి కనకమ్మ బయట వసారాలో కూతురితో అంటున్నది-"మీ ఆడబడుచు యింకా యెన్నాళ్ళుంటుందేమిటి? ఇట్లా సంసారం వచ్చి పైనబడితే ఎవరైనా ఎన్నాళ్ళు భరిస్తారు"? అని.

"అదంతా ఆమెకు తెలియాలి. మనమేమంటాం?"అంటున్నది రాజమ్మ. "అట్లాగే కళ్ళుమూసుకో. ఉన్నదికాస్తా అయిపోయిందంటే రేపు నీపనీ అంతే అవుతుంది." అని రుంజుకున్నది కనకమ్మ.

వాళ్ళనుకునే మాటలన్నీ జానికమ్మ విన్నది. విని చాలా బాధ పడ్డది. ఆమెది ఒకళ్ళకు చెయ్యిచాచకుండా గుట్టూ చప్పుడు కాకుండా జరుపుకెళుతున్న సంసారమే. వాళ్ళది కొల్లిపర. భర్త ఓ షావుకారుదగ్గర గుమాస్తాగిరి చేసి పందరూపాయలు తెచ్చేవాడు.

జానికమ్మ మామగారు వుండగా వాళ్ళది మంచి సంసారం. జానికమ్మ మామ కామయ్యగారు మోతుబరి. గ్రామంలో మంచి పలుకుబడి గలవాడు. గ్రామంలో యే పని వచ్చినా ఆయనలేంది జరిగేదికాదు. ఆయన పోయిన తర్వాత జానికమ్మ భర్త హయాములో మామగారు సంపాయించి యిచ్చివెళ్ళిన నలభై యాభై ఎకరాల భూమీ హరించిపోయింది. జానికమ్మ భర్త నరసింహా రావు తెలిసీ తెలియని వ్యాపారాలు బెట్టి తండ్రి సంపాయించి యిచ్చివెళ్ళిన ఆస్తంతా యిల్లుతోసహా అప్పులపాలు చేశాడు. ఆస్తి పోయిన తర్వాత అతడు గుమాస్తాగిరి చేసి సంసారం గడుపుతున్నాడు. అయితే ఆరుమాసాల క్రితం ఓ దుర్ఘటన జరిగింది. జానికమ్మ ఆడపడుచు లేచిపోయింది.

గౌరిని మంచి సంబంధమే చూసి యిచ్చారు. అత్తవారు సాంప్రదాయికులూ ఆస్తిపరులూ. వాళ్ళది ఆ గ్రామమే. వరుడు చదువుకున్నాడు. స్కూలు ఫైనలు వరకూ చదివి తండ్రికి చేదోడు వాదోడుగా వ్యవసాయంలో ప్రవేశించాడు. అతడు మితభాషి. నిరాడంబరుడు. నీరుకావిబట్టలు వేసుకుంటాడు. తనపనేమిటో వేరే గొడవలు అతనికి పట్టవు. తప్పనిసరిగా దినపత్రిక మాత్రం చూస్తాడు. తతిమ్మాకాలమంతా వ్యవసాయానికే వినియోగిస్తాడు

గౌరి కాపరాని కెళ్ళిన కొద్దిరోజులకు ప్రక్కఇంటి చలపతి పట్టణంలో చదువు ముగించి యింటికి వచ్చాడు. చలపతికీ, గౌరి భర్తకూ వున్న స్నేహరీత్యా చలపతి వీళ్ళ యింటికి వస్తూ పోతూ వుండేవాడు. చలపతి తెల్లటి యిస్త్రీబట్టలు వేస్తాడు, తల చెరగనివ్వడు. గడ్డం మాయనివ్వడు. అతను కదిలితే సెంటువాసనలు గుప్పుమంటవి.

అతడు గౌరిని ఆకర్షించాడు. ఇక మగవాడి మనసేముంది? పగ్గాలు తెగిన గుర్రం. ఒక జవ్వని తనమీద కటాక్ష వీక్షణాలు బరుపుతూ వుందంటే అంతకంటే తనకింకేం గావాలి?

యేదో పండగకు గౌరి పుట్టింటికి వెళ్ళింది. పండగ వెళ్ళిన మర్నాడు మధ్యాహ్నం గౌరి వంటరిగా ఇంటివసారాలో కూర్చున్నది. జానకమ్మ పెరట్లో యేదో పనిలో వున్నది. గౌరి అన్న నరసింహారావు భోజనంచేసి పడుకున్నాడు. ఇంతలో ఎవరో కుర్రవాడు గౌరికి ఒక చీటీ యిచ్చి వెళ్ళిపొయ్యాడు. గౌరి ఆ చీటీని అతిభద్రంగా లోనికి తీసికెళ్ళి అన్న నిద్రపోతున్నాడని యెంచి చీటీ విప్పి చదువుకుని మళ్ళా ఆ చీటీని తనపెట్టెలో భద్రపరచి బైటికెళ్ళింది. అప్పుడే మెలకువ వచ్చి నరసింహారావు - గౌరి చీటీ చదువుకోవడం, దాన్ని పెట్టెలో పెట్టి బైటికి వెళ్ళడం - అంతా చూస్తూనే వున్నాడు. గౌరి బైటికి వెళ్ళగానే నరసింహారావు 'అది యేమిటా?' అని పెట్టె తెరచి చదువుకుని వుగ్రుడై పొయ్యాడు. అది ఒక ప్రేమలేఖ. అప్పుడే చెల్లెల్ని లోనికి పిలిచి "యీ వుత్తరం యేమిటి? ఇది ఎవడు రాశాడు? నీభర్తకనక యీవుత్తరం చూస్తే యింకేమయినా వుందా? యింతవరకూ ఒకళ్ళచేత వేలుపెట్టి చూపించుకుని యెరగం. పెద్దమాటలు వచ్చిన తరువాత బ్రతికితేనేం, చస్తేనేం? జాగ్రత్తగా మసులుకో" అని కేకలు వేశాడు.

గౌరి యిక అక్కడ వుండకుండా ఆ సాయంత్రమే అత్తగారింటికి వెళ్ళిపోయింది.

ఆ తరువాత కొద్దిరోజులకే గౌరీ, చలపతి లేచిపొయ్యారని వూరంతా అట్టుడికినట్టు ఉడికిపోయింది. చలపతి గౌరిని ఆ గ్రామంలోనే వుంచాడని కొందరూ, యిద్దరూ పట్టణంలో మకాం పెట్టారని కొందరూ- యిట్లా వదంతులు బయలుదేరినవి.

ఆ వార్త నరసింహారావు విని అవమానంతో క్రుంగిపొయ్యాడు. వాళ్ళది పరువు, మర్యాదలు గల కుటుంబం. మాట అనిపించుకొని ఎరగరు. బాకీదార్లు స్థానానికి ఎక్కడ మాట అని పోరాదో అని వాళ్ళ యింటిముందుకు రాగానే నరసింహారావు రెండోమాట చెప్పకుండా ఆస్తి కట్టివేశాడు. అంత ఆస్తి పోయినా అతడేమీ విచారపడలేదుగాని చెల్లెలు లేచిపొయ్యేసరికి కృంగిపొయ్యాడు. గ్రామంలో తల యెత్తుకోలేకపొయ్యాడు. అది అతనికో గొడ్డలిపెట్టయింది. ప్రతిపూటా కంచందగ్గర కూర్చుని లేచిపోతున్నాడు. తిండి సహించడంలేదు. యెప్పుడూ యేదో పరధ్యానంగా వుంటున్నాడు. పగలు బయట మొఖం చూపించకుండా, పొద్దు కూకగానే కత్తి బొడ్లో పెట్టుకుని తిరుగుతున్నాడు. అతని వాలకం చూస్తే కొట్లాటలు జరుగుతయ్యని జానికమ్మ భయపడసాగింది. యెదిరిపక్షంవాళ్లు చూస్తె అన్నలూ, తమ్ముళ్ళూ బలగం కల వాళ్లు. అందులో వాళ్ల కొట్లాటలంటే వెనకాడేరకం కాదు. ఇటుచూస్తే తన భర్త వక్కడు. జానికమ్మ భయపడి తనతమ్ముడు భూషణాన్ని నాలుగురోజులు వుంచి వెళ్ళతాడని ఆదరాగా పిలిపించుకుంది. తమ్ముణ్ణి పిలిపించుకున్నా జానికమ్మ తలచినట్టు యేమీ జరగలేదు. అందుకు భిన్నంగా జరిగింది. తన బావమరది రావడం నరసింహారావుకు ధైర్యం యినుమడించింది. ఉద్రేకం గట్లు తెంచుకుంది. చిలికిచిలికి గాలివానగా మారింది. లేచిపోయిన యిద్దరూ యెక్కడున్నదీ తెలియదు గాని అటువైపు బంధువులకూ, యిటువైపు బంధువులకూ కొట్లాట జరిగింది. ఆ కొట్లాటలో జానికమ్మభర్తకు బలమైన గాయాలు తగిలినవి. భూషణానికి గూడా కొన్ని దెబ్బలు తగిలినవి. భూషణం తనబావగారికి తగిలిన దెబ్బలు చూసి ఉద్రేకంతో గునపం తీసుకుని అవతల ఒకడిమీద వెయ్యగా వాడు ఆ వేటుతోనే చచ్చిపొయ్యాడు. తర్వాత జానికమ్మభర్త అను

పత్రిలో చనిపోయ్యాడు. దానినిగురించి పెద్దకేసయింది భూషణం అవతల వాడు చావటంతోనే పరారీ అయ్యాడు.

జానికమ్మకు ఆధారం యేమీలేదు. తన వంటిమీద కాస్తో కూస్తో ఉన్న బంగారంకూడా అమ్ముకుని ఈ ఆరుమాసాలనుంచి తిన్నారు. భర్తవుండగా తాను అప్పుడప్పుడు కూడబెట్టుకున్న తాలూకు పందరూపాయలు ఎవరికో యిస్తే భర్త పోవడంతో అవికాస్తా ఎగనాం చేశారు. పిల్లలకు చదువూ సంధ్యా చెప్పించుకోవాలి. రాధాకృష్ణకు పదకొండేళ్లు, శశికి యెనిమిదేళ్లు. రాధాకృష్ణ సెకండుఫారమూ, శశి రెండో తరగతీ చదువుతూ వుండగా వాళ్ళచదువులు ఆగి పోయినవి. చూద్దామా తనభర్త తరపున తనను ఆదరించేవాళ్లెవరూ లేరు. జగన్నాధపురంలో తన పిన్ని వున్నది. ఆమె స్థితిపరురాలు. ఆమెకు ఒక్కడే కుమారుడు. ఆమెకు తానంటే ఎంతో ప్రేమ. తన పెళ్ళయిన తర్వాత తన అత్తవారింటికిగూడా యెన్నోసార్లు వచ్చింది. అక్కడకు వెళ్ళితే ఆమె ఆదరించకపోదని నిశ్చయించింది.

ఇంతలో శశి వచ్చి 'మట్టితో తిరగలి చేసుకుంటే అన్నయ్య తీసుకున్నాడు. యిప్పిద్దువుగాని రమ్మ'ని మంచంమీద పడుకుని ఆలోచిస్తున్న జానికమ్మను చెయ్యిపట్టుకుని నిలవనివ్వకుండా బయటికి లాక్కొచ్చింది.

జానికమ్మ ఆ మర్నాడు బయలుదేరదా మనుకుంటే వాన పట్టుకుంది. చెవులు గింగిర్లెత్తేటట్టు వురుములు, మెరుపులతో కుండపోతగా వాన కురవడం ప్రారంభించింది. ఆ కురవడం కురవడం రెండోరోజు సాయంత్రానికిగాని తెరిపికాలేదు. వర్షాకాలం ప్రవేశించిన దగ్గరనించి ఇంత వాన ఎప్పుడూ పడ లేదు. వర్షానికి నాని మట్టిగోడలన్నీ పడిపోయినవి. గ్రామం చివర వున్న గుడిశలన్నీ నీటిమయమైనవి. చుట్టుపట్ల చెరువులన్నీ దిబ్బాతీర్థంగా నిండి పోయినవి. కూలీ నాలీ చేసుకునే పాటకజనానికి యీ రెండురోజులూ నిజంగా దుర్దినాలే అయినవి. పక్షులుసైతం ఆహారాన్ని సేకరించుకోకుండా తమ గూళ్ళల్లోనె కాళ్లు కడుపులో పెట్టుకుని ముడుచుక్కూర్చున్నవి.

ఆ మూడవరోజు ఆకాశం నిర్మలంగా వున్నది. సూర్యోదయమై ఎండ బాగా వచ్చింది. వర్షానికి మురిగి తపిస్తున్న జనానికి లేకలేక వచ్చిన ఆ ఎండ

మంచి ఆహ్లాదాన్ని కలిగించింది. ఎవరి పనుల్లోకి వాళ్లు వెళ్ళడం మొదలు పెట్టారు.

జానకమ్మ భోజనంచేసి వదినకూ, కనకమ్మకూ చెప్పి ఇద్దరుపిల్లల్నీ తీసుకుని బయలుదేరింది. తనకు అత్తగారి తరఫున ఆదరువు ఏమీలేదని ఎది [illegible] తను వెళతానని చెపితే 'పోనీ, ఎక్కడకు వెళతావు? పిల్లలతో నీకు ఆధారం ఏమిటి?' అని మాటమాత్రమైనా అననందుకు జాని [illegible] బాధపడ్డది.

౨

జానకమ్మా, పిల్లలూ నడుస్తున్నారు. ఆమెచేతిలో గుడ్డసంచీమాత్రం వున్నది. అందులో తనవీ, పిల్లలవీ బట్టలు, ఒకటో రెండో పుస్తకాలు, చెంబు ఒకటిమాత్రం వున్నవి. తాను యిక్కడకు వచ్చేటప్పుడు తెచ్చుకున్నతాలూకు పదిహేనురూపాయలు వుండగా అవి రైలుఖర్చులకని భద్రపర్చుకున్నది. అక్కడికి గుంటూరు రెండుమైళ్లమాత్రమే దూరం. గుంటూరు, కొరిటిపాడు యించు మించు కలిసిపోయినవనే చెప్పవచ్చు. దారిపొడుగునా అన్నీ యిళ్లుపడినవి. పిల్లలూ, తల్లీ గ్రామందాటి రోడ్డునేపడి నడుస్తున్నారు. రోడ్డుప్రక్కల పల్లాల్లో అక్కడక్కడా వర్షపునీరు నిల్చింది. ఎవరో సైకిలు తొక్కుకుంటూ వాళ్ళను దాటి వెళ్ళిపోయ్యాడు. జానకమ్మ నడుస్తున్న దన్నమాటే కాని ఆమె మన స్సంతా జగన్నాథపురంలో వున్న తన పిన్నివైపు లగ్నమై వున్నది. పిన్ని యిల్లు, ఆ పరిసరాలూ అన్నీ ఆమెకళ్ళకు కట్టినట్లు కనిపించసాగినవి. తాను పిన్నిగారింటికి రెండుమూడుసార్లు వెళ్ళింది. పిన్నిది డాబాయిల్లు. ఆ వీధిలో అన్నీ డాబాలూ, పెంకుటి భంతులూ! పిన్నిగారి యిల్లు గదులుగదులుగా ఎంతో బాపుంటుంది. ప్రత్యేకంగా దేవుడుగది వున్నది. అందులో తనపిన్ని రామే శ్వరంనుంచి తెచ్చిన పటాలు, బొమ్మలు, పెద్ద శంఖం వున్నవి. వాళ్ళ పెరట్లో సీతాఫలంచెట్టు ఒకటి, నిమ్మచెట్లు రెండు వున్నవి. తాను అక్కడ వున్న న్నాళ్ళూ ప్రక్కయింటివారి అమ్మాయికీ, తనకూ స్నేహమైంది. ఇద్దరూ ఆ చెట్లదగ్గర కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ తలలు దువ్వుకునేవాళ్లు. తాను వెళ్ళి

గుమ్మంలో అడుగుపెట్టగానే చెవులకు దిద్దులు, మెళ్ళో నాను, చేతుల మురుగులూ, పాలచెంగావి చీరెతో పిన్ని తననుచూసి, 'అయ్యో యిట్లా అయి పోయ్యావేమిటి? నీ పరిస్థితి యిట్లా మారిపోయిందా?' అని జాలిపడి, తనను ఎంతో ఆదరిస్తుంది. పిన్ని తన అమ్మ వున్నంతవరకు యిక్కడకు వస్తూ వుండేది. తర్వాత రాకపోకలు తక్కువైనవి.

కారుహారన్ వినపడటంవల్ల ఆమె బాహ్యప్రపంచంలోకి వచ్చి అవత లకు తొలిగింది. మరికొంతదూరం నడిచిన తర్వాత రెండెద్దులబండి ఎదురు వచ్చింది. ఆబండికి జల్లవేసి సవారి అమర్చబడి ఉన్నది. జల్లలోంచి ఆడవాళ్లు పిల్లలూ ఎక్కారు. మగమనిషి తలగుడ్డ చుట్టుకుని తొట్లో కూర్చుని బండి తోలుతున్నాడు. రోడ్డునే వెళ్లుతున్న ఎవరిచేతిలోనో గొడుగుచూసి గిత్తలు బెదరినవి. జానికమ్మా, పిల్లలూ తమమీదకి ఎక్కడ వచ్చి పడతయ్యోనన్న కంగారుతో ఆదరాబాదరా రోడ్డుప్రక్కకు తప్పుకున్నారు. అప్పుడు బండిమనిషి తొట్లోనించి కిందకు దూకి గిత్తల పగ్గాలు పట్టుకుని నడిపించుకుని వెళ్లుతూ వుంటే జానికమ్మా, పిల్లలూ రోడ్డు ఎక్కి నడిచి పోసాగారు. శశి నడవలేక పోతే తల్లి మెల్లిగా నడిపించుకుంటూ గుంటూరు రైలుస్టేషను చేరేటప్పటికి మధ్యాహ్నం రెండుగంటలయింది.

స్టేషనంతా ప్రయాణీకులతో అలజడిగా వున్నది. బండికి ఇంకా వ్యవధి వుండటంవల్ల జానికమ్మా, పిల్లలూ పండ్లు, మిఠాయి అమ్మే దుకాణందగ్గరగా కూర్చున్నారు. బెంచీలమీదా, కిందా రకరకాల ప్రయాణీకులు కూర్చున్నారు. వంటినిండా నగలుపెట్టుకుని సిల్కుచీరలు కట్టుకున్నవాళ్ళు. మెళ్ళో మంగళ సూత్రంతో, చాలీచాలని జీర్ణవస్త్రం కట్టుకుని ఒకమూల వదిగి కూర్చున్న అభా గినులు, పర్సునిండా నోట్లు కుక్కుకుని షికార్లకు బయలుదేరే ధనవంతులు, జరుగుబాటు లేక కడుపు చేత్తో పట్టుకుని బ్రతుకుతెరువుకోసం బయలుదేరే కుటుంబీకులు, ధాన్యంధర పెరుగుతుందని ముందుగానే ఖరీదుచేసి నిల్వచెయ్యా లని పరిగెత్తే వ్యాపారస్తులు, నెత్తిన బరువుతో మైళ్ళకొలది నడిచివచ్చి నక నకలాడే కడుపులతో వరినాట్ల నిమిత్తం వెళ్ళుతూవున్న పాటకజనం. వీళ్ళంతా బండికోసం నిరీక్షిస్తున్నారు. జానికమ్మ దగ్గరగావున్న బెంచీమీద లేత్రాయంలో

పుస్తు ఓ అమ్మాయి, నడికారు దాటిన ఓ పురుషుడు కూర్చున్నారు. పురుషుడి తలంతా ముగ్గుబుట్టలా నెరిసింది. ఇద్దరూ పంచి బట్టలు వేసుకున్నారు. చూసినవాళ్ళు ఆ అమ్మాయి అతనికి కూతురో, ఏమో అవుతుం దనుకున్నారు గాని వాళ్ళ సంభాషణనుబట్టి వాళ్ళిద్దరూ భార్యా భర్తలని తేలింది. ముసలాయన వెళ్ళి పువ్వులు పట్టుకొచ్చాడు. ఆమె ఏదో చెప్పింది. అతడు కుర్రవాడులా దయ్యాన వెళ్ళి తినడానికి ఏవో పొట్లం, కాఫీ పట్టుకొచ్చాడు. మళ్ళా ఆవిడ ఏదో, ఆజ్ఞాపించగా పరిగెత్తుకుంటూవెళ్లి మరొకపొట్లం పట్టుకొచ్చాడు. అవన్నీ తిన్నాక ఆవిడ మళ్ళా ఏదోచెప్పింది. మాట పెదాలమీద ఉండగానే అతడు రెక్కలు కట్టుకుని ఎగిరివెళ్ళి క్షణంలో హిగిన్‌బాథమ్స్‌లో వారపత్రిక కొనుక్కొచ్చాడు. ఆవిడను సంతోషపెట్టటానికి ముసలాయన హైరానా పడుతున్నాడు. దగ్గరగా కూర్చున్నవాళ్ళంతా వాళ్ళిద్దర్నే చూస్తున్నారు

పిల్లలు ఏడిపించగా జానికమ్మ అణా అరటిపళ్ళు కొని వాళ్ళకు యిచ్చింది. ఇంతలో బండికి గంట కొట్టగా జానికమ్మ ఎవరిచేతికో డబ్బిచ్చి టిక్కెట్టు తెప్పించుకున్నది. టిక్కెట్లు కొనుక్కున్నవాళ్ళంతా పెట్టే బేడావట్టుకుని బ్రిడ్జి ఎక్కి అవతలవైపుకు వెళ్ళుతున్నారు. జానికమ్మకూడా పిల్లల్ని తీసుకుని పంచి చేత్తోపుచ్చుకుని బ్రిడ్జిమీదుగా అవతలకువెళ్ళి నిలుచుంది. కాసేపటికి గుప్పుగుప్పున పొగలు చిమ్ముకుంటూ రైలు వచ్చింది. జనమంతా కోలాహలంగా దిగేవాళ్ళు దిగుతూవుంటే ఎక్కేవాళ్ళు ఎక్కుతున్నారు. జానికమ్మ ఎక్కడానికి వీలుకాలేదు. జనం నెట్టుకుంటున్నారు. వత్తిడి తగ్గిన తర్వాత ఆడవాళ్ళ పెట్టెలో యెక్కింది. పిల్లలిద్దరూ వంతులువడి కిటికీదగ్గరకూర్చున్నారు. జానికమ్మ చోటుచేసుకుని వాళ్ళప్రక్కన కూర్చున్నది. పండ్లు అమ్మేవాళ్ళూ చుట్టా బీడీ సిగరెట్ అమ్మేవాళ్ళూ కేకలువేసుకుంటూ బండివెంట తిరుగుతున్నారు, బండి కదలడానికి గంట మోగింది. ఇంతలో ఆదరాబాదరా నలుగురు స్త్రీలు ఆపెట్టెలో ఎక్కేరు. కూర్చునేటందుకు ఎక్కడా ఖాళీలేదు. ఇద్దరు స్త్రీలు చొరవచేసుకుని జనాన్నిసర్ది చోటుచేసుకుని కూర్చున్నారు. మిగతా యిద్దరూ నిలుచున్నారు. ఇద్దరిలో ఒకామె గర్భిణి. పైగా చంకలో పిల్ల ఒకటి మోతబరువు. ఆమె అట్లా నిలబడడంచూసి జానికమ్మ కళని వళ్ళోకూర్చో

బెట్టుకుని ఆమెకు స్థలం యిచ్చింది. గార్డు విజిల్ వూదేడు. కూతవేసి బండి కదిలింది. దూరాన్నించి కనిపిస్తున్న పట్టణంలోని మేడలూ, యిళ్ళూ అంత ర్ధాన మవుతున్నవి. తల్లి వడిలో కూర్చున్న శశి దిగి నిలబడి ఎట్లయినా సందు చేసుకుని కిటికీలోనించి చూస్తున్నది. బండి వేగం హెచ్చింది. అది పట్టణం చివరి గ్రామం. అన్నీ తాటాకుగుడిసెలు. రైలుకట్ట ప్రక్కగా మేత మేస్తున్న నాలుగైదు గేదెలు రైలుమోతకు బెదిరి గుడిసెలవైపుకు పరుగుపెట్టినవి. ఓ గుడిసెముందు స్త్రీ రోట్లో గింజలుకొమాలు దంచుతున్నది. రోటికిందపడ్డ గింజలను కోడిపిల్లలు యేరుకుతింటున్నవి. గుడిసెల అవతలతట్టు రోడ్డు మీదుగా గొర్రెలమంద తోలుకెళ్ళుతున్నారు. రైలు పట్టణం పరిసరాలు దాటింది. అన్నీ పచ్చని పొలాలు. వరిచేలలో స్త్రీలు కలుపు తీస్తున్నారు. పిల్లలు పొలం గట్టుమీద నిలుచుని రైల్లో జనంవైపు చేతులు చూపున్నారు.

బండి నంబూరుస్టేషను చేరింది. స్టేషనుప్రక్కగావున్న నూలుమిల్లు అప్పుడే వదిలినట్టుంది-కార్మికులంతా-స్త్రీలు, పురుషులు జట్లు జట్లుగా- రోడ్డునే వెళ్ళిపోతున్నారు. ఆ స్టేషనులో అట్టే యెక్కినవాళ్ళుగాని దిగినవాళ్ళుగాని లేరు. కూతవేసి బండి కదిలింది. స్టేషనుదాటి వెళ్ళుతూ వున్నది. పచ్చగా అన్నీ వేరుశనగ పొలాలు. రైలుకట్ట ప్రక్కగా ఎవరో కోడెదూడను పలుపు పట్టుకుని తీసుకెళ్ళుతూవుండగా రైలునుచూచి బెదిరి అది ఎగేసుకుని వెళ్ళడంవల్ల అతడుగూడా దానివెంటబడి పరుగెత్తుతున్నాడు.

రైలు వేగంగా వెళుతున్నది. రైలుకట్టదాపులో పొలం గట్టుమీది తుమ్మచెట్టునిండా గిజిగాడిగూళ్ళు వేళ్లాడుతున్నవి. శశిచూసి "అవిగో సంచులు! చెట్టుకి ఎలావచ్చినియ్యే అమ్మా ఆ సంచులు?" అని అడిగింది.

"అవి సంచులా? తెలివి! గూళ్లైతే!" అన్నాడు రాధాకృష్ణ.

"ఏమే అమ్మా?" అని అడిగింది తల్లిని శశి.

"అవునమ్మా! అన్నయ్య చెప్పినట్టు అవి గూళ్ళే. గిజిగాడు అనేపిట్ట అల్లింది" అని జానికమ్మ చెప్పగా తనమాట నెగ్గినందుకు రాధాకృష్ణ పొంగి పోతూ "ఇంకా అడుగు అమ్మని. 'మాపాఠంలో వస్తేను!" అన్నాడు.

బండి మంగళగిరి స్టేషనులో ఆగింది. స్టేషన్నుంచీ వూళ్ళోకి వెళ్ళే రోడ్డు అవతలి పక్కగా సున్నంబట్టీలు, ఇవతలిపక్క మామిడితోపు, దూరాన్నించి లక్ష్మీనృసింహస్వామి ఆలయ గాలిగోపురం, కొండమీద పానకాల స్వామి గుడీ కనిపిస్తున్నవి. ఆకాశాన్నంటె కనిపిస్తున్న స్వామి గోపురానికి సాయంకాలపు లేతయెండ బంగారపు పూత పెడుతున్నది. మంగళగిరి చరిత్ర ప్రసిద్ధమైన క్షేత్రం. దూరస్థలాలనుండి ప్రతిరోజూ స్వామి దర్శనార్థం యాత్రికులు వస్తూవుంటారు. జానికమ్మ భర్తవుండగా ఇద్దరూ ఒకతూరి స్వామిదర్శనార్థం మంగళగిరి వచ్చారు. వెనకటి స్మృతులు గుర్తుకురాగా జానికమ్మ కళ్ళవెంట అప్రయత్నంగా రెండు కన్నీటిబిందువులు రాలినవి. జానికమ్మ బండిలోవుండె స్వామికి నమస్కారంపెట్టి ఇద్దరు పిల్లలచేత కూడా నమస్కారం పెట్టించింది.

ఎవరో ఓవ్యక్తి, నలభై యేళ్లుంటవి-నల్లద్దాల కళ్లజోడు పెట్టుకున్నాడు. ఆడవాళ్ల పెట్టెదగ్గర జానికమ్మకేసి ఒకకన్నుపెట్టి అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. ఆ వ్యక్తి గుంటూరునించి బండి కదిలిన లగాయితు ప్రతిస్టేషను లోనూ ఇల్లాగే ఆడవాళ్ళ పెట్టెదగ్గర తారట్లాడుతున్నాడు. అందులోవున్న స్త్రీలు వాళ్ళతాలూకు ఆడవాళ్ళు యెవరో వున్నారని యెవరికివాళ్ళు భావించారు. ఆ పెట్టెలోనుంచి కొంతమంది స్త్రీలు దిగిపొయ్యారు. మళ్లా కొంతమందిస్త్రీలు ఎక్కారు. ఆ యెక్కిన స్త్రీలలో ఓయువతిని జానికమ్మ గుర్తుపట్టింది. ఎర్రటి శరీరచ్ఛాయ, తలనిండా పువ్వులు చెవులకు లోలకులు, ఖరీదైన చీరె. కాళ్లకు స్లిప్పర్లు, చేతిలో లెదరు సూటుకేసు. ఈ నవీనపద్ధతులతో వున్న ఆ యువతిని తన ఆడపడుచు గౌరిగా గుర్తించి జానికమ్మ 'అన్నను మింగి యెన్ని వేషాలు వేస్తున్నావే' అని మనసులో అనుకుని ముఖం అటువైపు తిప్పుకున్నది. "అత్తయ్య అదిగోనే అమ్మా." అని శశి అనగా జానికమ్మ శశి నోరుమూసింది. అంతా చూస్తున్న పక్కన కూర్చున్న ఆడవాళ్ళు వాళ్ళకూ వీళ్లకూ విరోధం కామాలు, అనుకున్నారు. జానికమ్మను ఆ యువతి చూచిందో లేదోగాని దూరంగా వాకిలి దగ్గర బల్లమీద కూర్చున్నది.

గార్డు విజిల్ యివ్వగా బండి కదిలింది. తాడేపల్లిస్టేషను తర్వాత కాలవ దాటి కృష్ణా బ్రిడ్జిమీదగా పరిగెత్తుతున్నది. ఆనకట్ట తలుపులమీదుగా కృష్ణా

నది నిండుగా ప్రవహిస్తున్నది. బెస్తలు చిన్న చిన్న డింగీలు వేసుకుని చేపలు పడుతున్నారు. జానికమ్మా పిల్లలూ కిటికీలోనించి చూస్తున్నారు. నది అవతలి ఒడ్డున ఇంద్రకీలాద్రి పర్వతమూ, పర్వతం దిగువ బెజవాడ పట్టణమూ కనిపిస్తున్నవి. ఆ పర్వతంమీదనే కనకదుర్గ ఆలయం. జానికమ్మ కనకదుర్గను దర్శించాలని ఎన్నాళ్ళనించో అనుకుంటుంది. బెజవాడ స్టేషనులో తాను వెళ్ళవలసిన జగన్నాధపురానికి బండి మారవలసి వున్నది. పూళ్ళోకివెళ్ళి కనకదుర్గను దర్శించుకుని వచ్చే వ్యవధి వుంటేసరే లేసిమెడల యివాళ్ళ యిక్కడ వుండి యిద్దరుపిల్లల్నీ ఆ జగన్మాత పాదాలమీద పడవేసి రక్షించమని వేడుకుని బయలుదేరాలని నిశ్చయించుకున్నది.

బండి కృష్ణానది దాటింది. నది కట్టఇవతలవున్న గుడిసెలన్నీ వరద నీటిలో మునిగినవి. బండి బెజవాడస్టేషను చేరింది. ప్లాటుఫారంనిండా జనం కిటకిట లాడుతున్నారు. బండిలోనించి దిగేవాళ్ళను దిగనివ్వకుండా ఎక్కేవాళ్ళు యెక్కుతున్నారు. జానికమ్మా పిల్లలూ బండిదిగి యెక్కేవాళ్లను తప్పుకుంటూ ప్లాటుఫారంమీద నడుస్తున్నారు. నల్లద్దాల కళ్ళజోడు వ్యక్తికూడా ఆ స్టేషనులోనే దిగాడు. జానికమ్మ ప్లాటుఫారందాటి జగన్నాధపురంవెళ్ళే బండి యెప్పుడని భోగట్టా చెయ్యగా వర్షాలవల్ల అటువైపున యెక్కడో లైను చెడిపోయిందని, యివాళ్ళకు బళ్ళు వెళ్ళవనీ తెలిసింది. తాను బెజవాడవరకే టిక్కెట్టు తీసుకున్నందున గేటువగ్గర టిక్కెట్టు యిచ్చి రైల్వేవంతెన దాటింది. బండి దిగినజనం జట్కాలమీదా, రిక్షాలమీదా వెళ్ళిపోతున్నారు. కొందరు నడిచేవాళ్ళు నడిచిపోతున్నారు. జానికమ్మ పిల్లల్ని తీసుకుని పూళ్ళోకి వెళ్ళసాగింది. రోడ్డుమీద వచ్చే జట్కాలకు, పొయ్యేజట్కాలకు, రిక్షాలకూ విసుగూ, విరామంలేదు. జానికమ్మ రోడ్డుప్రక్కగా పిల్లల్ని నడిపించుకుని వెళ్ళుతున్నది. స్టేషన్నుంచి గావును రెండుబళ్లనిండా అరటి గెలలు వేసుకుని పూళ్ళోకి తోలుకెళ్లుతున్నారు.

జానికమ్మ కొండనుసమీపించి అక్కడవున్న దుకాణంలో టెంకాయ కర్పూరం కొనుక్కుని మెల్లిగా పిల్లల్ని నడిపించుకుంటూ కొండ ఎక్కుతున్నది. నాలుగైదుమెట్లు ఎక్కారో లేదో ఎవరోసాధు తలనిండా జడలూ మెళ్ళో రుద్రాక్షలూ కాషాయగుడ్డలతో ఉన్నాడు. పైనించి దిగుతూ

వున్నాడు. జానికమ్మ కుర్రవానిచేత ఆసాధు పాదాలకు నమస్కారం చేయించింది, ఆ సాధు రాధాకృష్ణను ఆశీర్వదించి "యివి మీకు చెడ్డరోజులమ్మా కనకదుర్గను ప్రతి శుక్రవారం పూజచేసుకోండి. మీకు మేలు కలుగుతుంది." అని చెప్పాడు. జానికమ్మ ఆసాధుకు అర్ధణా యివ్వబోయింది. సాధు పుచ్చుకోలేదు. తనచేత్తో రాధాకృష్ణవీపు నిమిరి వెళ్లి పొయ్యాడు.

జానికమ్మ కొండఎక్కి అమ్మవారిని దర్శించుకుని నేరుగా రైలుస్టేషను దగ్గరవున్న రామగోపాల సత్రానికి వచ్చేస్తున్నది. సత్రం దాపులోకి వచ్చాక ఆడవాళ్ల పెట్టిదగ్గర తారట్లాడిన నల్లద్దాల కళ్లజోడువ్యక్తి ఆమె వెనకాల వస్తున్నాడు. ఆవ్యక్తి తనను వెంబడిస్తున్నాడని ఆమెకేం తెలుసు ? జానికమ్మ సత్రం చేరుకునేసరికి సందెపడింది. దీపాలు పెట్టేటందుకు ఎంతో వ్యవధి లేదు. చెట్లమీది పక్షులు కోలహలంగా అరుస్తున్నవి. సత్రం విశాలంగా వున్నది. చుట్టూ నాలుగువైపులా గదులూ, మధ్య గచ్చుచేయబడిన పెద్ద వరండా, ప్రక్కన బావి, బావిదగ్గరగా రావిచెట్టు, వరండామధ్య చిన్న గుడి వున్నవి. చాలామంది యాత్రికులు మూటాముల్లె ప్రక్కన పెట్టుకుని వంట చేసుకుంటున్నారు. జానికమ్మదగ్గర పాత్రసామాను యేమీ లేదుగనక ప్రయాణీకుల్లో ఒకళ్ళను పాత్రసామాను అడిగి తీసుకుని వంటచేసి పిల్లలకు పెట్టి తాను తినేసరికి దాదాపు ఎనిమిదిగంటలైంది. రాధాకృష్ణ అన్నంతిని అట్లా వీధిలోకి వెళ్ళాడు, వెళ్ళుతూవుంటే తల్లి ఎక్కడికీ వెళ్ళబోకునాయనా కార్లూ అవి తిరుగుతూ వుంటవి" అని హెచ్చరించింది సత్రం యెదురుగా అరటిపళ్ళు పంచదార తౌనలు మొదలైనవి అమ్మేదుకాణం, రెండు మూడు చిల్లరకొట్లూ వున్నవి. ఆ బజార్లోకల్లా అవే కొట్లు.

వీధిలోకి వెళ్లిన రాధాకృష్ణ ఎంతసేపటికీ రాకపొయ్యేసరికి తల్లి వీధిలోకి వెళ్లి చూచింది. కనపడలేదు. పైనించి వస్తున్నాడేమోనని అటూఇటూ పార చూసింది. కనిపించలేదు. "మాకుర్రవాడు పదేళ్ళవాడు ఎటువెళ్ళాడు నాయనా" అని అరటిపళ్ల కొట్టువాణ్ణి అడగ్గా అతడు 'నేను చూడలేద'ని చెప్పాడు. "ఎక్కడికి వెళ్ళేడు అసలే బస్తీ" అనుకుంటూ లోనికివెళ్లి కాసేపు చూసింది. ఇంకా రాలేదు అప్పటికి దాదాపు రాత్రి పదిగంట లవుతుంది ఇంకారాలేదు. ఆమెకు ఆందోళన అధికమైంది. ఇందాక కనకదుర్గ గుడినించి వచ్చేటప్పుడు

రోడ్డు మలుపుదగ్గర కాశీరత్నం పెట్టెను పిల్లలంతా చూస్తూవుండగా తాను గూడా చూస్తానంటే వద్దని లాక్కొచ్చింది. వాడినగ్గర అర్ధణాగూడావున్నది. బహుశః అక్కడకు వెళ్లివుంటా డనుకుని శశిని అక్కడున్న ప్రయాణీకుల్లో ఓ అవ్వను చూస్తూవుండమని అప్పగించి తాను ఇందాకటి స్థలందగ్గరికి వెళ్ళి చూడగా అక్కడ ఎవరూ లేరు. జనంతో కిటకిటలాడే ఆరోడ్డు జనసంచారం తగ్గిపోయి ఒకళ్ళు, అరా నడుస్తున్నారు. ఆమెకు గాభరా అధికమైంది. ఆ వేళప్పుడు అంత పట్నంలో ఎక్కడున్నాడని వెతుకుతుంది? తిరిగివచ్చి సత్రానికి దాపులోవున్న రైలుస్టేషనులోకి వెళ్ళింది. అప్పుడే ఏదోబండి వచ్చింది. జనమంతా దిగి వెళుతున్నారు. ఆ యీడుగల పిల్లలు చాలామంది కనిపించారుగానీ రాధాకృష్ణ కనిపించలేదు. స్టేషనంతా పారచూసింది. ఎక్కడా లేడు. తిరిగి సత్రంలోకివచ్చింది. ఆమె చింతకు మేరలేదు. ఆమె మనస్సు పరిపరివిధాల పోసాగింది. అసలే బస్తీ. వచ్చేపోయే కార్లకు విసుగూ, విరామం వుండదు, వీడు వెళుతూ ఉంటే ఏమైనా ప్రమాదము జరగలేదుగద? పట్టిది. ఎంతచెడు అభిప్రాయపడ్డాను. అటువంటి దేమైనాజరిగితే గుప్పునగోలపుట్టదూ! ఒకవేళ రైలుస్టేషనులోకివెళ్ళి కుర్రతనాన ఏదైనా రైలెక్కి కూర్చుంటే అదికదిలి పోయిందిమో! లేక కృష్ణానది దగ్గరకు గాని వెళ్ళేడేమో, అసలే నది ప్రవాహంగా ఉన్నది. నది ఇక్కడకు చాలా దూరం. ఈ రాత్రిపూట అక్కడికి వెళ్ళడు. కనకదుర్గతల్లీ! నీ పాదాలమీద పడ వేళాను. వాడికి ఏ ఆపదారాకుండా కాపాడి యిల్లుచేర్చుతల్లీ" అని చేతులుజోడించి దేవుని వేడుకుంటూఉంటే తూర్పున తళుక్కుమని ఓ మెరుపు మెరిసి ఆకాశం వురిమింది. ఆ తెల్లవార్లూ ఆమెకు నిద్రపట్టలేదు. గంటలు లెక్కపెడుతూ వున్నది. తెల్లవారుఝామున కోడికూత వినిపించింది. ఆమెకు కన్ను మలిగింది. కుర్రవాడు వచ్చి అమ్మా అని పిలిచినట్లై ఆమె దిగ్గునలేచి కూచుంది. ఎవరూ కనుపించలేదు. ఇకఆమెకు కునుకుపట్టలేదు. అట్లానే కూర్చున్నది.

తెల్లవారింది. కుర్రవాడు రాలేదు. వీధిలోకి వచ్చి కాసేపు నిలుచుని దారులుచూచి బయలుదేరి రైలుస్టేషనుదాటి నడుస్తున్నది. రైలుదిగి పాల కావిళ్ళు, పెరుగుతట్టలు, కూరగాయలగంపలు వూళ్ళోకి వెళుతున్నవి. ఆమె

వెళ్ళి సత్రాలు, దేవాలయాలు, మార్కెట్లు అన్నీ వెదికింది. ఎక్కడా కుర్రవాడు కనిపించలేదు. తిరుగా ఆమె సత్రం జేరుకునేసరికి మధ్యాహ్నం పన్నెండు గంటలైంది. అప్పటికి వంటావార్పు ఏమీలేదు. శశికి అవ్వ అన్నంపెట్టింది. జానికమ్మ కూర్చుని కంటతడి పెట్టుకుంటూఉంటే శశి తల్లి దగ్గరచేరి ఏడవడం మొదలు పెట్టింది. అప్పుడు అక్కడవున్న ఆడవాళ్ళు నలుగురూ వాళ్ళదగ్గర చేరారు. అవ్వ "కుర్రవాడిదగ్గర ఏమన్నా వస్తువులు ఉన్నయ్యా అమ్మాయి?" అని అడిగింది. జానకమ్మ 'లేవని' చెప్పగా "వస్తువులు లేకపోతే ఎక్కడికి వెళ్ళతాడమ్మాయీ? వస్తువులుఉంటే భయపడవచ్చు. అయినా పదేళ్ళ కుర్రవాడు ఎక్కడ మారుపడతాడు? నువ్వేమీ విచారపడవద్దు. తప్పక ఇంటికి తిరిగి వస్తాడు. మా మనవడు మీ అబ్బాయికంటే లొజ్జగానే ఉంటాడు. చెప్పకుండా వెళ్ళి నెలరోజులకు అక్కడక్కడా తిరిగి మాసిన గుడ్డలతో ఇంటికి చక్కా వచ్చాడు." అని వోదార్చింది. అవ్వ వోదార్చడమేకాకుండా అక్కడచేరిన ఆడ వాళ్ళుకూడా ఆమెను వోదార్చారు.

జానికమ్మకు రాత్రి నిద్రలేకపోగా తిండీతిప్పలూ లేవు. అందులో తిరిగి తిరిగి అలసివుండడంలో కళ్ళు మూతలు పడుతూఉంటే వమిటచెంగు పరుచుకుని వసారాలో పడుకుంది.

కృష్ణానది నిండుగా ప్రవహిస్తున్నది. రాధాకృష్ణ ఇంకా ఎవరో కుర్ర వాడు ఇద్దరూ కలిసి నదిఒడ్డున నిలుచుని నదిలోకి రాళ్ళు విసురుతున్నారు. అట్లావాళ్ళు కాసేపు రాళ్ళు విసిరినమీదట రాధాకృష్ణ ఒక్కడూనదిలో దిగి నీళ్ళు తాగుతున్నాడు. అట్లానీళ్ళు తాగుతున్న రాధాకృష్ణ "నా కాలు పట్టుకుని ఏదో లాక్కెలుతున్నదం"టూ గట్టిగా ఏడవడం మొదలుపెట్టాడు.

జానికమ్మకు గప్పున మెళుకువ వచ్చింది. ఆమె భయకంపితురాలై లేచి కూర్చుంది. గుండెలు వెగంగా కొట్టుకోసాగినవి. ఇక అక్కడ నిలవ లేదు. కృష్ణానదికి బయలుదేరి వెళ్ళింది. అక్కడ ఏమీలేదు. యధాప్రకారం పడవలు నడుస్తున్నవి. కొందరు చేపలు పడుతున్నారు. నదిఒడ్డున ఎవరో బాటసారులు బట్టలు వుతుక్కుంటున్నారు. మనిషిపడ్డ అలజడి ఏమీ కనిపించ లేదు. జానికమ్మ మనసు పట్టలేక ఒకరిద్దర్ని అడిగింది. వాళ్ళు ఏ ప్రమాదం

జరగలేదని చెప్పారు. అప్పుడు జానికమ్మ తిరిగి సత్రం చేరుకుంది. అక్కడ వున్న యాత్రికుల్లో రైలుబండ్లు సరిగా లేక నిలవవున్నవాళ్ళు గూడా వున్నారు. అందులో అవ్వ కుటుంబంకూడా ఒకటి. జానికమ్మ ఆ రాత్రి గూడా వంటచేసుకోకుండా కుప్పకూలి కూర్చుంటే అవ్వ బ్రతిమలాడి జానికమ్మకూ శశికీ అన్నంపెట్టింది. జానికమ్మ ఆ మర్నాడు గూడా అక్కడే వున్నది. కుర్ర వాడి జాడలేదు. కుర్రవాడిదగ్గర వస్తువులేమీ లేవుగదా. వాణ్ణి ఎవరేం చేస్తా రని కాసేపు ధైర్యము తెచ్చుకుంటుంది. మళ్ళీ అంతలో ధైర్యంచెడి ఏమి ప్రమాదం జరిగిందోనని దుఃఖపడుతుంది.

తానీ స్థితిలో ఎక్కడికి వెళ్ళేటట్టు? తిరిగి ఇంటికి వెళదామా అక్కడ తనను ఆదరించే వాళ్ళెవరున్నారు? తన పిన్నిదగ్గరికి గనక వెళ్ళితే కుర్రవాడు పరారి అయ్యాడన్న సంగతి విని వెంటనే వెదకటానికి మనుషులను పంపు తుంది. అక్కడికే వెళ్ళాలని నిశ్చయించి సత్రం మేనేజరు దగ్గరకు వెళ్ళి తన కుర్రవాడు ఇట్లు పరారి అయ్యాడని గుర్తులుచెప్పి "వాడుగనుక ఇక్కడికివస్తే తెలియజేయవలసిం"దని బ్రతిమలాడి, మరీ మరీ చెప్పి తన పిన్నిఅడ్రసు ఇచ్చి, అవ్వ వాళ్ళకుటుంబం రాజమండ్రి బండికి వెళ్ళడానికి ఉదయానే మూటా ముల్లే సర్దుకుంటూ వుండగా, జానికమ్మ వెళ్ళేదిగూడా ఆ బండికెగనక వాళ్ళతో పాటు తోడుగా శశిని తీసుకుని బయలుదేరింది.

## 3

ఆవాళ ఎండరాలేదు. మబ్బుపట్టి బయట సన్నతుప్పర పడుతూవుంది. జానికమ్మ వాళ్ళు రైలుస్టేషనుకువచ్చి టిక్కెట్లు కొనుక్కుని బండిఎక్కారు. ముందుగా ఎక్కడంవల్ల బండంతా కాళీగానే ఉన్నది. జానికమ్మ ఎక్కడున్నా ఆమెకళ్ళు కుర్రవాణ్ణే వెదుకుతున్నవి. ప్రయాణీకులతో కిటకిటలాడిపోతున్న ఆ స్టేషనులో ఎంతచూసినా ఆ ఈడుగల పిల్లలు చాలామంది కనిపిస్తున్నారు గాని తన కుర్రవాడు మాత్రం కనిపించడు. వాళ్ళకు ఎదురు ప్లాట్‌ఫారంప్రక్క మరోబండి ఏ వూరు వెళ్ళడానికో లైనుమీద సిద్ధంగా వున్నది. జనం ఆ బండిలోగూడా ఎక్కుతున్నారు. బండి చివరపెట్టెలో ఒక కుర్రవాడు అంతా తనకొడుకులాగానే వున్నాడు. ఎవరితోనో బండి ఎక్కుతున్నాడు. ఆమె

ప్రాణం లేచివచ్చింది. గబగబా బండిదిగి ఒక్క అడుగులో అక్కడికివెళ్ళి చూచింది. తనకుర్రవాడుకాదు, ఎవరో కుర్రవాడు. మళ్ళా తనపెట్టెలోకి వచ్చి ఎక్కింది. మొన్న కనకదుర్గ కొండమెట్లు ఎక్కుతూవుండగా సాధువు కనపడి "మీకివి చెడ్డరోజులు. కనకదుర్గను ప్రతి శుక్రవారం పూజించుకో"మని చెప్పిన మాటలు గుర్తుకు వచ్చినవి. అప్పుడు తన బిడ్డను కాపాడమని కనకదుర్గను మనస్సులో ప్రార్థించుకుంది.

బండి కదలడానికి గంటమోగింది. గార్డు విజిల్ ఇచ్చాడు. ముందుగా వాళ్ళు ఎక్కినబండే కదిలింది. బండి వేగంహెచ్చి పొగలుగ్రక్కుతూ,గ్రామాలుదాటు కుంటూవెళ్ళుతున్నది. బండిజగన్నాధపురంచేరేటప్పటికి మధ్యాహ్నంపన్నెండు గంటలయింది. జానికమ్మ అవ్వకూ వాళ్ళకూ చెప్పి ఈ నాలుగురోజులు ఇట్టే తనను ఎంతో ఆదరించిన ఆ కుటుంబాన్ని విడువలేక బండిదిగింది. టిక్కెట్టు గేటుదగ్గర యిచ్చి వూళ్ళోకి బయలుదేరింది. శశి 'అన్నం' అని ఏడిపిస్తూ వుంటే "పిన్నిగారింటికి వెళ్ళగానే తిందువుగాని. వచ్చేశాంగా" అని వూరడిం చింది తల్లి. ఆ రోడ్డు మలుపు తిరిగి ఓ వీధిలో నడుస్తున్నది. అప్పుడే భోజ నాలు చేసిన గృహస్థులు విస్తరాకులు బయట డబ్బాల్లో పడవేస్తుంటే వాటికి కుక్కలు ఎగబడుతున్నవి. తనపిన్ని ఇంటికి ఇంకా రెండుబజార్లు దాటాలి. ఆ వీధి దాటి పెద్దబజారునే నడుస్తున్నది. అటూ ఇటూ రెండుప్రక్కలా అన్నీ షాపులు. జనం వత్తిడిగా వున్నారు. జానికమ్మ జనాన్ని తప్పుకుంటూ శశిని మెల్లిగా నడిపించుకుని వెళ్ళుతున్నది. ఆమె మనస్సు అక్కడలేదు. తనపిన్ని ఇప్పుడు ఇంట్లో ఏం చేస్తుంటుంది? భోజనంచేసి విశ్రాంతిగా వాకిటిముందు బల్లమీద కూర్చుని వుంటుంది. తననుచూసీ చూడడంతోనే "పిల్లనే తీసు కొస్తున్నావు, కుర్రవాడేడి?" అని అడిగి తెలుసుకుని తన అజాగ్రత్తకు కోప్పడు తుంది. జానికమ్మ ఇట్లా ఆలోచిస్తూ బజారు మలుపుతిరిగింది. అదే తనపిన్ని గారి బజారు. వెనక తానువచ్చినప్పటికంటే ఆ బజారు ఎంతో మారిపోయింది. కొన్ని పెంకుటిళ్ల స్థానే డాబాలు పడినవి. తనపిన్ని యిల్లు దాపులోకి వస్తూ వుంది. ఇంకా అయిదారు యిళ్ళు మాత్రమే దాటాలి. దగ్గరవుతున్నకొద్దీ ఆమె మనస్సు వుద్వేగంతో గుబగుబలాడిపోతున్నది.

తీరా పిన్ని ఇల్లు సమీపించి చూచేసరికి ఇంటికి తాళం వేసివున్నది. వూళ్ళో ఎక్కడికైనా వెళ్ళేరేమో అని ఇంటిముందు వసారాలో కూర్చుంది. గంటసేపు చూచింది. ఇంకా రాలేదు. అప్పుడామె ప్రక్కయింట్లోకి వెళ్ళి 'మా వాళ్ళు ఎక్కడికి వెళ్ళారు?' అని అడగ్గా 'కుటుంబసహితంగా యాత్రకు వెళ్ళార'ని చెప్పింది ఇంటామె. ఆ మాట వినేసరికి జానికమ్మకు మిన్ను విరిగి మీదపడ్డట్లయింది. ఒళ్ళంతా చిరుచెమట్లు పట్టినవి. "ఎప్పుడు వెళ్ళారు?" అని అడిగింది.

"వెళ్ళి పదిహేను రోజులయింది. పూర్ణయాత్రా స్పెషల్ ట్రయినులో వెళ్ళారు. రెండు మాసాలకుగాని రామని చెప్పారు" అన్నది ఇంటామె.

జానికమ్మ నిర్ఘాంతపోయి అట్లానే నిలబడిపోయింది. తాను ఇంటికి వెళదామన్నా తనదగ్గర డబ్బులేదు. తెచ్చుకున్న తాలూకు తనదగ్గర చిల్లరమాత్రం మిగిలిఉన్నది. ఇప్పుడు తాను ఏంచెయ్యాలి? దారీతెన్నూ తెలియడంలేదు. నడిసముద్రంలో వున్నట్లున్నదామెకు. ఇంటామెను మంచినీళ్ళు అడిగి తీసుకుని తాను కాసినితాగి శశికి కాసినియిచ్చి, అక్కడనుండి బయలుదేరి వీధినే నడవ సాగింది. తాను ఇప్పుడెక్కడికి వెళ్ళేటట్లు? ఈ వూళ్ళో ఎరిగున్నవాళ్ళు ఎవరున్నారు? వెదుక్కుంటూవెళ్ళి సత్రం చేరింది. శశి 'అన్నం' అని ఏడుస్తూ ఉంటే దారిలో బేడపెట్టి నాన్‌రొట్టె కొనిపెట్టింది.

సత్రంలో ముందుభాగాన రెండు గదులున్నవి. ఒక గదిలో ఎవరో వున్నారు. మరిఒక గదికి తాళం వేసిఉన్నది. వెనకగదుల్లో ఎవరో ఉన్నారు. ప్రక్కపంచలో అభ్యాగతులు చాలామంది ఉన్నారు. ఎవరో తాంబూర మీటుకుంటూ తత్త్వాలు పాడుతున్నారు. అప్పుడే వూళ్ళో తిరిగి ముష్టెత్తుకుని తెచ్చుకున్న గింజలుతో కొందరు వసారాకిరింద నేలమీద పొయ్యిలు పెట్టుకుని అన్నంవండుకుంటున్నారు. అవతలపంచలో కుంటీ గుడ్డీ వికలాంగులు; వేళకు తిండి అమరక బక్కచిక్కి రోగాలతో మూలిగే అభాగ్యులు.

జానికమ్మ సత్రం ముందువైపు వసారాలో గోడకు ఆనుకుని చేతిలో సంచి దగ్గర పెట్టుకుని కూర్చుంది. పక్కగది దగ్గర ఇద్దరు అమ్మాయిలు కూచుని గిల్లాలు ఆడుకుంటూ ఉండగా శశిచూచి వాళ్ళదగ్గరకు వెళ్ళి కూచుంది.

ముగ్గురు మనసులూ అంతలో కలిసిపోయినవి. ముగ్గురూ కలిసి గిల్లాలు ఆడు కోవడం మొదలు పెట్టారు. ఇంతలో ఓ వ్యక్తివచ్చి జానికమ్మ ఎదురుగా వసారా స్తంభందగ్గర నిలబడి "ఏవూరు బుల్లెమ్మా మీది ?" అని అడిగాడు. రాబందులకు దూరపు దృష్టి జాస్తి. ఎంత దూరంలో ఉన్న వస్తువులనైనా అంతలో పసి పట్టగలవు. అతని వయస్సు నలభై యేళ్ళ పైబడి ఉంటుంది. తలంతా అంటకత్తిరించుకుని మాడుమీద బెత్తెడువెడల్పున నున్నగా చేయించు కున్నాడు. పంచెకట్టు, బనీను తొడుక్కుని, కండవా మెడకు చుట్టుకుని చివర్లు వేళాడ వేశాడు.

అతడు అడగిన మాటకు బదులు చెప్పింది జానికమ్మ. "అయితే ఈ వూళ్ళో చుట్టాలెవరూ లేరా బుల్లెమ్మా ?" అనిమళ్ళా అడిగాడతడు. అతడు ప్రతిమాటా దీర్ఘంతీస్తూ చేతులు తిప్పుతూ మాట్లాడుతున్నాడు. ఆ ప్రశ్నకు జానికమ్మ 'చుట్టాలు ఉన్నారని, అయితే గ్రామంలోలేరని, యాత్రకు వెళ్ళా రనీ' చెప్పింది.

"యాత్రలకు యెల్లినవాళ్ళు యిప్పుడు వస్తారా బుల్లెమ్మా ! అయితే నువ్వేట్లా పాపం ?" అని జాలిగా అడిగాడతడు.

తిరిగీ ఇంటికి వెళ్ళాలంటే తనదగ్గర డబ్బు అయిపోయిందని చెప్పింది జానకమ్మ.

"అయ్యోపాపం! చాలాదూరం యెల్లాలి. నీకిక్కడ యెవరున్నారు. అన్నమన్నా తిన్నావా బుల్లెమ్మా ?" అని అడిగాడతడు.

తినలేదని చెప్పింది జానికమ్మ.

"నిన్నుచూస్తే చానా జాలేస్తుంది బుల్లెమ్మా. పాపం యిక్కడ చిక్కడి పోయ్యావు. నీకోఉపాయం చెపుతాను. యీ వూళ్ళో వకాయనఉన్నాడు. ఆయన మంచి ధర్మాత్ముడు. పేదా సాదా బీదా బిక్కీ అంటే ఆయనకి చాలాజాలి. యెప్పుడూ ధర్మం చేస్తాఉంటాడు. ఆయనదగ్గర కావలసినంత డబ్బు మూలుగు తున్నది. అడిగినవాళ్ళకు లేదనేమాటలేదు. నీకుమల్లే ఇబ్బందిలోఉన్న వాళ్ళను సూస్తే వదిలిపెట్టడు. వాళ్ళ బార్యాభర్తలు యెంతమంచోళ్ళకున్నావు బుల్లెమ్మా! నిన్నుసూస్తే నా మనసంతా నీరైపోయింది. పాడుపానం రేపు యెట్లాపోగో

గాని, నీకెందుకు? నే వస్తా రా బుల్లెమ్మా. నువ్వువచ్చి అక్కడ నిలబడితేచాలు. అంతానేనుచెప్పి నీకు సాయంచేస్తాను" అని అతడు చెప్పగా, జానికమ్మ సందేహిస్తూఉంటే మళ్ళా అతడు ఇలా అన్నాడు:

"ఏమిట్రా ఇతడు యిట్లా సెపుతున్నాడని ఆలోసిస్తున్నావా బుల్లెమ్మా? నా పానంపోయినా ఆబద్ధం సెప్పను. నిప్పులాంటోణ్ణి ఫలానసీతయ్య ఎటువంటివాడు అని ఎవరనన్నా అడుగు సెపుతాడు. నీకంత పూరికనే ఎలాతీసుకోవాలని సందేహంగా వుంటే, రేపు నువ్వు యింటికి యల్లగానే ఆయనకి మన్నియాడ్డరుకట్టు. ఎవరు కాదన్నారు? ముందు యిప్పుడు నువ్వు యిల్లుసేరతావు కదా !" అని చెపుతూవుంటే జానికమ్మకూ అతడు అమాయకుడిలా మంచివాడుగా కనిపించడంవల్ల వేరే గత్యంతరంలేక చేతినంచి కళ్ళదగ్గరపెట్టి, ఇప్పుడే వస్తాను యిక్కడే వుండమని చెప్పి అతనివెంటబయలుదేరింది.

అతను కొన్నిబజార్లు తిప్పుకుంటూ ఓ యిరుకుసందులోకి తీసుకువెళ్ళి ఓ యింటిముందు నిలబడ్డాడు. అదిఒక తాటాకుల యిల్లు. యింటిబైట చక్రాలు లేని బండిచట్రం ఒకటి పడవేసి వున్నది. ఆయింటికి ప్రహరీగోడలాగా వీధివైపున చిల్లకంప నాటబడి లోనికి వెళ్ళేటందుకు మధ్యదారి చేయబడివున్నది. అతడు ఆ యింటిముందు నిలబడి "యిదే మాయిల్లు బుల్లెమ్మా. మనం ఈగల్లీ తిరిగిపోవాలి. కాసిని మంచినీళ్ళు తాగివెళ్ళదాం రమ్మ"ని జానికమ్మని ఇంట్లోకి తీసుకెళ్ళాడు. లోపలఇంటిముందు ఖాళీస్థలంలో ఏవోరెండు చెట్లపాదులున్నవి. ఆచెట్లపాదుల కుదుళ్ళకాళ్ళతో చిమ్మి,కోళ్ళు పురుగులను ఏరుకునితింటున్నవి. జానికమ్మ ఆ ఇంటిముందు నిలబడ్డది. ప్రక్కపంచలో ఎవరో నలుగురు చీట్లాడుతున్నారు. అతడు వాళ్ళతో "సరిగా కోసు డబ్బులు తీస్తున్నారా ?" అని అడిగి "నిలబడ్డావు. ఆఅరుగుమీద కూర్చో బుల్లెమ్మా" అంటూ అతడు లోనికి వెళ్ళాడు. జానికమ్మ కూర్చోలేదు. నిలబడే వున్నది.

అతడు లోనికి వెళ్ళగానే లోపల ఏదో పనిచేస్తున్న అతని భార్యో ఎవరో మరి, అతన్నిచూసి "యిల్లు కనపడ్డదా సచ్చినోడా? రూపాయి తీసుకుని పొద్దునసంగా ఎల్లియిప్పుడా యింటికి రావడం. యచ్చాలెయ్యి? రూపాయి ఏంసేశావో ముందుసెప్పు" అని గలగల లేచింది.

అతడు పిల్లిలా "తిరిగి తిరిగి కాల్లు పీక్కెల్లతావుంటే ఖర్చుపెట్టు కున్నానే! ఇదిగో పావలా మిగిలింది" అంటూ జేబులోనించి పావలా తీసి ఇవ్వబోయాడు.

ఆవిడ అతనిచేతిలోనించి పావలా విసురుగా లాక్కుని "తాగినావా సచ్చి నోడా! యచ్చాలు తెమ్మని డబ్బులిత్తే నీపొట్ట పగలకొట్టుకున్నావా? మాయ దారి సచ్చినోడా! బయట కాలుపెడితే యిల్లు మరిసిపోతావు. నీయసుమంటి ముదనష్టపు సచ్చినోణ్ణి పెట్టుకొని కాపురం పెయ్యటం మాకట్టం" అని మండి పడ్డది.

అతడు ముసిముసి నవ్వులునవ్వుతూ "మనిషిని పట్టుకొచ్చానే. యియ్యాల మనకి బత్తాలుపడతై. పంతులుచూస్తే సస్తేవదులుతాడా? వూరికే తిరుగుతున్నా ననుకున్నావా ఏంటి?" అన్నాడతడు.

"వరిగిందిలే. మనిషిని పట్టుకొచ్చాడింట మనిషిని" అన్నదావిడ రుస రుస లాడుతూ.

"యంత సంపాయించుకొస్తున్నా మనిషిని గౌరంగా సూడవుగందా నీ పుటకేందో" అన్నాడతడు.

"గౌరంగాకాదు నీ ముకాన నిప్పులు బోత్త. ఈ ఆడంగిరేకుల సచ్చి నోడికి గౌరం కావాలంట గౌరం. వచ్చిన డబ్బంతా తాగి పాడుచేత్తావుండి" అన్నదావిడ.

"పిల్లరగూడా కర్చు పెట్టుకోగూడదా యేంటి? అంత తేలిగ్గా పడిఉన్నా ననుకున్నావా? మొన్నటినగలు అమ్మితే యెన్నిరూపాయలొ_స్తయ్యో తెలుసా!" అన్నాడు.

భార్య మెల్లిగా "అట్టా అరవమాకు, ముదనట్టపు సచ్చినోడా. తాగొచ్చి మాట్టాడుతున్నావు. గోడకి సెవులుంటై" అందావిడ.

"సరే. అదిపోనిలే వచ్చేటప్పుడుచూస్తే పంతులు సాపులోలేడు. యింకా ఆ అమ్మి అన్నమన్నా తినలేదు" అంటూ అతదేదో చెప్పుకేళ్ళుతూ ఉండగా ఆవిడ అడ్డువచ్చి "అన్నం గిన్నం ఇక్కడ వల్లకాదు. ఎవడు వండిపెడ తాడు?" అన్నది.

అసలు ఆ అమ్మ మనయింటో తింటదో తినదోలే. మాటసామితి సెప్పు తున్నా".... అని యిద్దరూ మాట్లాడుకుంటున్నారు.

ఇక బయట నిలబడివున్న జానికమ్మను చూసి వసారాలో చీట్లు ఆడు తున్నవాళ్ళు ఎకసక్కెంగా మాట్లాడుకుంటున్నారు. వాళ్ళలో ఒకడు ఎత్తు కొప్పుతో లావుగా రుబ్బుడుపత్రింలా వున్నాడు. వాడు జానికమ్మకేసి అదో విధంగా చూస్తున్నాడు.

లోపలవాళ్ళు అనుకునేమాటలు బైటవున్న జానికమ్మకు కొన్ని విన పడ్డవి, కొన్ని వినపడుటలేదు. ఇంకా అతడు బైటికి రాడేమిటి అనుకుంటు న్నది.

ఇంతలో పోలీసువ్యాను వీధివాకిట్లోకి వచ్చి నిలబడ్డది. అందులోనుంచి పోలీసులు దిగి యిల్లు చుట్టవేశారు. వాళ్ళనుచూసి అక్కడ చీట్లాడేవాళ్ళు కంగా రుగా గోడదూకి వుడాయించారు.

పోలీసులను చూసి జానికమ్మ జంకుతూ యిక్కడకు యెందుకొచ్చానా- అనుకుంటూ బైటికి వెళ్ళబోయింది. "ఎక్కడకువెళతావు? వెళ్ళేటందుకు వీల్లేదు; నిలబడు" అని పోలీసులు గద్దించారు. జానికమ్మ 'యిదేమిటిరా భగవంతుడా!" అని పులిబోనులో చిక్కిన మేకపిల్లలా హడలిపోయింది.

జానికమ్మను వెంటపెట్టుకు వచ్చిన సీతయ్య పాతనేరస్థుడు. లోగడ రెండుమూడు చోరీ కేసుల్లో జైలుకు వెళ్ళివున్నాడు. వారం పదిరోజుల కిందట ఆ గ్రామంలో ఒక ఖూనీ జరిగింది, రైలుస్టేషనుకి కొంచెందూరంలో. ఎవరో స్త్రీ అర్ధరాత్రి రైలుదిగి వెళుతుంటే ఆవిడదగ్గర నగలు తీసుకుని గొంతునులిమి తాళ్ళతోపు దగ్గర పారేశారు. ఆ చంపింది ఎవరో ఋజువు తియ్యడానికి పోలీసు అధికారి విశ్వప్రయత్నం చేస్తున్నాడు.

వచ్చిన పోలీసులు కొందరు లోపల జొరబడ్డారు- కొందరు బైటవుండి ఎవర్నీ బయటికి వెళ్ళనివ్వకుండా కావలా వున్నారు.

పోలీసులు లోనికివెళ్ళి సోదాచెయ్యగా కొన్ని నగలు దొరకటంవల్ల పోలీసు అధికారి తన శ్రమ ఫలించినందుకు సంతోషిస్తూ సీతయ్యకు బేడీలు వేసి సీతయ్య భార్యనూ, జానికమ్మనుకూడా కష్టడీలోకి తీసుకున్నారు. జానికమ్మ మాది పొరుగూరని ఎంత మొరపెట్టుకున్నా వినలేదు పోలీసు అధికారి. 'ఈ కేసులో యిద్దరు స్త్రీలుగూడా వున్నట్టు రిపోర్టుకూడా వచ్చింది. లాకప్

చెయ్య'మనగా పోలీసులు జానికమ్మసహా ముగ్గుర్నీ పోలీసు స్టేషనుకు తీసుకెళ్ళారు.

పోలీసు అధికారి జానికమ్మను ఆఫీసుగదిలోకి తీసుకెళ్ళి ప్రశ్నలు వేయడం మొదలుపెట్టాడు.

"ఇదుగో అమ్మాయ్ నీ పేరేమిటి ?"

జానికమ్మ చెప్పింది:

"మీది ఈవూరేనా ?"

"కాదు, కొల్లిపర."

"నిజం చెప్పు. అబద్ధాలుచెప్పి తప్పించుకు పోవాలని చూస్తున్నావా ?" అధికారి గర్జిస్తూ గుడ్లురిమాడు.

జానికమ్మ వణుకుతూ "నిజంగా కొల్లిపరేనండి" అంది.

"మీది కొల్లిపరయితే ఈ సీతయ్యకు నీకు ఏమిటి సంబంధం ?"

గతిలేక యిట్లా వచ్చాననీ, పత్రంలోవున్న తనను ఖర్చులకు డబ్బు ఇప్పిస్తానని సీతయ్య తీసుకొచ్చాడనీ చెప్పింది.

"అయితే సీతయ్య ఇల్లు యిదివరకు ఎప్పుడైనా చూశావా ?"

"చూడలేదు"

"సీతయ్య భార్యా నువ్వూ పరిచయంగా వుంటారుకదూ ?"

"ఆవిడ ఎవరో నాకసలు తెలియదు."

"పోయిన బుధవారం రోజున నువ్వు ఈ గ్రామంలోనే వున్నావుకదూ?"

"లేను, మా గ్రామంలోనే వున్నాను."

అధికారి ఒక ఫోటో జానికమ్మకు చూపిస్తూ "ఈమెను ఎప్పుడైనా చూశావా ?" అని అడిగాడు.

"చూడలేదు."

అధికారి స్టేటుమెంటు రాసుకోవడం పూర్తికాగా పోలీసులు జానికమ్మను అవతలికి తీసుకెళ్ళి లాకప్‌లో వుంచారు. అక్కడ యినుపవూచలమధ్య ఖైదీలు చాలామంది వున్నారు. జానికమ్మకు ఆ వాతావరణం అంతా యమలోకంలాగా కనుపించింది. ఆమె దుఃఖానికి మేరలేదు. 'భర్తపోయి యేదో బ్రతుకు తెరువుకోసం బయలుదేరితే ఇవేమి సంకటాలు. దారిలో కుర్రవాడు

తప్పిపోయి చింతతో కృశిస్తుంటే మళ్ళా యిదేమి ప్రారబ్ధం భగవానుడా! నామీద యింత నిర్దయ పూనావా?' అని వాపోవసాగింది.

దీపాలు పెట్టారు. పిల్ల సత్రంలో దిగుబడిపోయింది. తాను యిక్కడ చిక్కుపడ్డది. పిల్లగతి యేం కాను? అని జానికమ్మ కుమిలిపోసాగింది. యింతలో అధికారివచ్చి "యిదిగో అమ్మాయ్! నువ్వు మంచిదానివిలాగానే కనపడుతున్నావు: పాపం యీ దుండగుల సాహచర్యం నీకు ఎలాకుదిరిందో గాని. అవును, చెడ్డవాళ్ళ సహవాసంవల్ల మంచివాళ్ళ బుద్ధులుకూడా మారి పోతవి. నేనొక మాట చెపుతా విను. యీ కేసులో యింకా ఎవరెవరు వున్నారో వాళ్ళ పేర్లన్నీ చెప్పు. కేసంతా వాళ్ళమీద మోపి నిన్ను వదిలిపెట్టివేస్తాం." అని యెంతో నేర్పుగా ఎంతో లాలనగా చెప్పాడు.

అప్పుడు జానికమ్మ కళ్ళనీళ్ళతో "నాకేమీ తెలియదు నాయనా. నేనొక పేదరాలను. భర్తపోయి బ్రతుకుతెరువుకోసం యిట్లా బయలుదేరాం నాయనా. నా కూతురు యెనిమిదేళ్ళపిల్ల సత్రంలో దిగుబడి పోయింది. నాకోసం అది యెంత అలమటించి పోతున్నదో?" అని మొదలైన విషయాలన్నీ చెప్పుకుని వాపోయింది.

అధికారి జానికమ్మ నిర్దోషి అని తెలుసుకుని వదిలిపెట్టేసరికి వారం రోజులు పట్టింది. జానికమ్మ బ్రతుకు జీవుడా అని బయటపడ్డది.

బిడ్డ యేమైపోయిందో, ఈ నాలుగు రోజులబట్టి ఎక్కడ అన్నం తిన్నదో అనుకుంటూ సత్రం చేరుకుంది. అక్కడ చూసేసరికి మొన్న తాను కూర్చున్న సత్రంముందు వసారాలో ఎవరూ లేరు. సత్రం అంతా చూసింది. శశి కనపడలేదు. "ఎక్కడికి వెళ్ళిందా?" అని విచారపడుతూ సత్రంముందు వసారాలోకి వచ్చింది. ఆ వసారాలో ఒకగదికి అదివరకే తాళం వేయబడి వున్నది. రెండోగదిలో వున్నవాళ్ళను శశినిగురించి అడుగుదామంటే ఆ గదిలో ఎవరో కొత్తవాళ్ళున్నారు. అడిగితే మాకు తెలియదన్నారు. అప్పుడు సాయంత్రం నాలుగు గంటలవుతుంది. అప్పటికి భిక్షాటన నిమిత్తం వూళ్ళోకి వెళ్ళగా మిగిలిన భిక్షగాళ్ళను అడగ్గా మాకు తెలియదన్నారు. సత్రం వెనుక గదుల్లో వున్నవాళ్ళను అడిగింది. వాళ్ళూ మేము చూడలేదన్నారు. తాను కనపడకపొయ్యేసరికి తన పిన్నిగారి యిళ్ళవైపు యేమన్నా వెళ్ళిందేమో,

ఒహంశా తన పిన్నిగారి యాత్రనుండి తిరిగివస్తే పిల్ల అక్కడే వుండి పోయిందేమో అనుకుంటూ తన పిన్నిగారి యిల్లవైపు వెళ్లింది. వాళ్ళ ఇంటికి వేసిన తాళాలు వేసినట్టేవున్నవి. శశి మరి యెక్కడికెళ్లినట్టు? ఆమె ఆందోళన పడజొచ్చింది. కనపడ్డవాళ్ళనల్లా అడుగుతూ వీధులన్నీ తిరగసాగింది. రాత్రి పదిగంటలేసేపరకు తిరిగింది. శశి జాడలేదు. తిరిగి సత్రంకువచ్చి ముందు వసారాలో కూలబడ్డది. ఆమెకు అంతా అయోమయంగా వున్నది. ఎవరయినా ఏ అఘాయిత్యమయినా చేశారనుకుంటే పిల్లదగ్గర నగలేమీ లేవు. తను నాలుగురోజులు కనపడక పొయ్యేసరికి యింటికి వెళ్ళాననుకుని ఒకవేళ స్టేషనుకువెళ్లి రైలెక్కి వుంటుందా? అంతధైర్యం పిల్లదగ్గరలేదు. నాకోసం ఏడుస్తూ వీధులవెంట తిరుగుతుంటే ఎవరైనా సంగతులు అడిగి జాలిపడి దగ్గరకు తీశారేమో. తెల్లవారాక మిగిలిన బజార్లు భోగట్టా చెయ్యాలనుకుంది. అప్పుడు రాత్రి పన్నెండుగంటలవుతుంది. జానికమ్మకు కునుకుపట్టింది.

శశి కళ్లవాచేటట్లు ఏడుస్తూ వీధులవెంట తిరుగుతున్నది. కారు డ్రైవరు పైనించి హారను మోగించుకుంటూ వస్తున్నా శశి ఏడుస్తూ తప్పుకోలేదు. ఆ వీధినే వచ్చే పొయ్యే జనం 'కారుకింద పిల్లపడ్డది, కారుకింద పిల్లపడ్డద'ని హాహాకారాలుచేస్తూ చుట్టూమూగారు. జానికమ్మకు గుప్పున మెలకువ వచ్చింది. 'అరె! ఇదేమి పీడకల' అనుకుని రామనామస్మరణ చేసుకుంటూ మళ్ళా పడుకుంది. కానీ కంటిమీద కునుకుపట్టలేదు.

కొంచెం చీకటి వుండగానే లేచి గ్రామంలోకి బయలుదేరి వెదకటం మొదలుపెట్టింది. చీకటిపడి వూరు మాటుమణిగేవరకూ అన్నం నీళ్ళు లేకుండా శశిని వెతుకుతూనే వున్నది. ఇక వీధుల్లో జనసంచారం తగ్గింది. గృహస్థులు తలుపులు బిగించుకుంటున్నారు. బజార్లలో షాపులకు తాళాలువేసి యజమానులు ఇళ్ళకు వెళ్లిపోతున్నారు. శశి జాడలేదు. జానికమ్మకు విన్నటినించీ తిండిలేదు. విన్నటినుంచేమిటి; కుర్రవాడు పరారీ అయిన దగ్గరనుంచే సరిగా తిండిలేదు. కళ్ళు తిరుగుతున్నవి. ఇక తిరిగేటందుకు ఓపికకూడా లేదు. జానికమ్మ సత్రానికి వచ్చేసింది, సత్రం వసారాలో దీపంలేదు. వసారాలో అవతలప్రక్క ఎవరో బాటసారులు పడుకున్నారు. ఆమె వసారాలో కూలబడ్డది. ఆమె దుఃఖానికి మేరలేదు.

కుర్రవాడు పరారీ అయినందునే చింతపడుతూవుంటే మళ్ళా యిదేమిటి? భగవంతుడు తనమీద పగబూనాడు. తానిక యెవర్ని చూసుకుని బ్రతకాలి? భర్త పోయినా యెవరిమీదనయితే ఆశలన్నీ పెట్టుకుని జీవిస్తుందో వాళ్ళు తనకు దూరమైపొయ్యారు. తాను బ్రతికి యిక ఏమిబావుకోవాలి? పిన్నని గంపెడాశ పెట్టుకునివస్తే ఇటా జరగటం యేమిటి? తాను ఎవర్ని అభివృద్ధిలోకి తీసుకు రావాలని బయలు దేరిందో వాళ్ళే తనకు దూరమయ్యారు. దరిద్రులకు ఆపదలు జాస్తి, తన చేతులో డబ్బు లేకపోబట్టేగా ఇన్ని కష్టాలకు గురికావటం! తన చేతిలో డబ్బుంటే ఇల్లు కదలవలసిన పనేమిటి? ఇదంతా తన ప్రారబ్ధం. వున్న ఆస్థి పోయింది; తనను పోషించే భర్తా పొయ్యాడు, తనకు ప్రాణప్రదమైన పిల్లలా యిట్లా అయ్యారు. విషంతిని చచ్చిపోదామన్నా చేతిలో కానీలేదు. అంతా నిరాధారం. ఇక తాను బ్రతికేటందుకు ఆస్కారం ఏది? ఆమెకు జీవితంమీద విరక్తి పుట్టింది. లేచి సత్రం గేటుదగ్గరకు వచ్చి గేటు తీసుకుని బయటకువచ్చి నడవసాగింది. అప్పుడు రెండు ఝాములవుతుంది. అంతా నిర్మానుష్యం. రైలుకువెళ్ళే జట్కాబళ్ళ మోతమాత్రం వినిపిస్తున్నది. మబ్బుపట్టి సన్న తుప్పర పడుతున్నది. అప్పుడప్పుడు మెరుస్తూ మెరుపులతో పాటు వురుముతున్నది. అంతా కటికచీకటి. రోడ్లమీద దీపాలుమాత్రం అక్కడక్కడ వెలుగుతున్నవి. ఆమె వూరుదాటి రోడ్డుకడ్డంగా డొంకనేవడి నడవసాగింది. అన్నీపొలాలు, ఏవోపైర్లు వేసివున్నవి. అంతా గాఢాంధకారం. కీచురాళ్ళధ్వని. తోటారవ్వల్లాగా మిణుగురు పురుగులు మెరుస్తున్నవి. దయ్యాలు కబుర్లాడుకుంటున్నట్టు ఆకాశంలో మేఘాలు గర్జిస్తున్నవి. పిట్టమెదలని ఆ నిశీధిని ఆమె ఒంటరిగా అట్లా వెళ్ళిపోతున్నది. మెరుపులు ఆమెకు దోవ చూపుతున్నవి. ఆమె తలంచినట్టు భావిగాని, చెరువుగాని ఆమెకు తగల్లేదు. అది ఆమెకు కొత్తప్రదేశం కావడంవల్ల ఏది ఎక్కడ వుండేదీ తెలియదు. అట్లాగే నడిచిపోతున్నది. ఒక పొలంప్రక్క జలాశయంలా కనిపించగా అక్కడికివెళ్ళి అందులో దిగింది. అది వర్షపు నీరు. మోకాళ్ళుగూడా మునగ లేదు. ఆమె మళ్ళా డొంకనేవడి నడవసాగింది. ఆమె అట్లా నడుస్తూవుండగా కాలుకు ఏదో చుట్టుకోగా కాలు విదిలించింది. అది అంతదూరాన తపక్కుమని పడటంవల్ల శబ్దాన్నిబట్టి పామని తేలింది. కరిస్తే ఎంతబాగుందేది? దానికిగూడా

వెక్కి-వెక్కి పొయ్యాను గామాలు, అనుకుని అట్లాగేనడవసాగింది. ఆవుద్వేగంలో ఎంతదూరం నడిచిందో తనకే తెలియదు. పోనీ వుర్రైనా వేసుకుందామంటే చెట్టయినా కనిపించదు, అని ఆమె అనుకుంటూ వుండగా తళుక్కు-న మెరుపు మెరిసింది. ఆ వెలుతురులో డొంకకు కొంతదూరంలో తాటాకుల పాక ఒకటి కనిపించింది. అక్క-డికి ఏదో గ్రామం సమీపంలోవున్నట్టు ఛాయలు పొడ కట్టినవి. ఎవరిదో గొడ్లపాక అయివుండవచ్చుననుకుని అందులోకివెళ్ళి పమిట చెంగుతో వుర్రైనా వేసుకుందామని తలచి ఆ పాకను సమీపించింది. ప్రపంచానికీ తనకూ యిక ఇవ్వాళతో రుణం తీరిపోతున్నది. ఎవరి పంచలోనో పడుకుని శశి నిద్రలో అమ్మా అమ్మా అని పలవరిస్తున్నది. రాధాకృష్ణ మాసిన బట్టలతో చిక్కి-పోయి ఎవరి అరుగుమీదనో కూర్చుని అమ్మా అమ్మా అని ఏడుస్తున్నాడు. ఇవన్నీ తోసివేసి గుండె రాయిచేసుకుని పాకలో అడుగు పెట్టింది. అతి విచిత్రం. అందులో సన్నదీపం వెలుగుతున్నది. దీపందగ్గర ముగ్గురు దృఢకాయులు కూర్చుని వున్నారు. వాళ్ళముందు పెద్దసీసా, ఓగ్లాసూ వున్నవి. వాళ్ళకు ప్రక్క-గా మెడకోసివేసిన కోడి పడివున్నది. ఆ దృశ్యాన్ని చూసి ఆమె వణికిపోయింది. సాక్షాత్తు యమధర్మరాజు కనిపించినా సంతోషించి స్వాగతం యిచ్చివుండేది. వాళ్లను చూసేసరికి ఆమె భయకంపితురాలయి పోయింది. తిరిగి వెళ్లిపోవటానికి వుద్యుక్తురాలవుతూండగా "అక్క-డ నిలు. కదిలావంటే నీ మర్యాద దక్క-దు" అని అవతలనించి గర్జన వినపడ్డది. ఆమె పులిబోనులో చిక్కి-న మేకపిల్లలా వణికిపోసాగింది.

"భలే! ఇవ్వాల జలసాకు అక్క-ర కొస్తుందిలే" అని ఒక డనగా "నీ జలసా అట్లావుంచవోయ్, మన గుట్టూ మట్టూ తెలుసుకోడానికి ఎవరైనా పంపేరేమో ముందు ఆరా తియ్యాలి" అన్నాడు మరిఒకడు.

"ఏ సి. ఐ. డి. గాడన్నా మన గుట్టు తెలుసుకోడానికి ఆడవేషం వేసుకు రాలేదుగదా!" అన్నాడు ఇంకొకడు.

వాళ్లల్లో ఇద్దరులేచి అక్క-డ వెలుగుతున్న దీపంబుడ్డి తీసుకుని ఆమె దగ్గరకు వచ్చి "ఎవరునువ్వు? ఇక్క-డికి ఎందుకొచ్చావ్?" అని అడిగాడు అందులో ఒకడు.

"నేనొక దీనురాలను నాయనా" అని కంపిత కంఠంతో చెప్పుకున్న దామె.

"ఈ వేషాలన్నీ యిక్కడ పనికిరావు. నిన్ను ఎవరు పంపించారో నిజం చెప్పు ?" అన్నాడతడు.

"నన్ను ఎవరూ పంపలేదు నాయనా" అని మొరపెట్టుకుందామె.

"నిజంచెప్పు. ఎవరూ పంపక పోతే ఈ అర్ధరాత్రివేళ ఇక్కడికి నీకేం పని ?" అని గద్దించా డతడు.

"నిజం చెప్పకపోయ్యావా ఇవ్వాల నీపని వున్నదే" అని పళ్ళుకొరికాడు మరి ఒకడు.

ఆఖరుకు వీళ్ళ చేతుల్లో అవమానంపాలై చావమని భగవంతుడు తనకు రాశాడుకాబోలు అని ఖేదపడుతూ "నన్ను ఎవరూ పంపలేదు నాయనా. జీవితం మీద విరక్తిపుట్టి దేనిలోనన్నా పడి కళ్లుమూసుకుందామని యిట్లా బయలుదేరాను" అని చెప్పిందామె.

ఆమాటకు మొదటివాడు తోకతొక్కిన తాచులా "ఇదంతా నాటకం. నిజాన్ని కప్పిపుచ్చాలంటే ఎలాకుదురుతుంది? దేనిలోనన్నాపడి కళ్లుమూసుకునే దానివైతే ఈ పాకలోకి నీకేం పని ?" అని మండిపడ్డా డతడు.

"అబద్ధాలుచెప్పి తప్పించుకుపోవాలని చూస్తున్నావు. అదంతా ఇక్కడ సాగదు" అని బుసలుకొట్టాడు రెండోవాడు.

"ఇక్కడికి లాక్కురాండ్రా అన్నీ చెపుతుంది" అన్నాడు అవతల కూర్చున్న మూడోవాడు.

ఇంతలో బైటనుంచి మరో దృఢకాయుడు వాళ్ళలోవాడేగావును లోనికి వచ్చి "ఏమిట్రా ఆడవాళ్ళనుగూడా రప్పిస్తున్నారు ?" అని అడగ్గా.

"మేమేమీ రప్పించలేదు. ఈమనిషే వచ్చింది. ఎవరుపంపారా ఏమిటా అని ఆరాతీస్తున్నాం" అన్నారు వాళ్ళు.

"ఏమీకారణం లేకపోతే ఈ అర్ధరాత్రప్పుడు ఇక్కడకు ఎందుకు వస్తుంది ? ఏదో పన్నాగడ ఆయివుండాలి" అని అతడు మొదటివాడి చేతిలో

వున్న దీపంబుడ్డి తీసుకుని "ఎవరునువ్వు? ఇక్కడి కెందుకొచ్చావ్!" అంటూ ఆమెను ఎగాదిగా చూసేసరికి అతనికేంతట్టిందోగాని, దగ్గుత్తికతో "అక్కయ్యా! ఇట్లా వచ్చావేమిటి!" అన్నాడు.

అతణ్ణి భూషణంగా గుర్తించేసరికి ఆమెకు పోయినప్రాణం లేచివచ్చినట్టయింది. నరకప్రాయంగా వున్న ఆ వాతావరణం స్వర్గధామంగా తోచింది. అతణ్ణి చూసేసరికి ఆమెకు సంతోషం దుఃఖం ఒక్కసారిగా పెల్లుబికినవి. "భూషణం! ఎన్నాళ్ళకు కనిపించావురా నాయనా! ఏమయ్యావో అని విచారపడుతున్నాను" అని తాను పిన్నిగారింటికని బయలుదేరితే పిన్ని యింటివద్ద లేకపోవడం, ఇద్దరుపిల్లలూ తప్పిపోయి తాను ఇక్కడ చిక్కుపడి గత్యంతరం లేక జీవితంమీద విరక్తిపుట్టి ఇట్లా బయలుదేరడం అన్నీ చెప్పి వాపోయింది.

ఆ మాటలకు భూషణం ఎంతో విచారపడి "కుర్రవాడు వూహ వచ్చినవాడు. ఎక్కడికి వెళతాడు? వాడే తిరిగివస్తాడు. పిల్లనుగురించి వెంటనే దండోరా వేయించు. ఎక్కడికి పోతుంది? నువ్వీ పిచ్చిఅభిప్రాయం మార్చుకుని పిల్లను తీసుకుని ఇంటికివెళ్ళు. నేను కొద్దిరోజుల్లో తిరిగివస్తాను. ఇంకా కొన్నాళ్ళు ప్రచ్ఛన్నంగా ఇట్లాగే గడపక తప్పదు" అన్నాడు.

భూషణం ఆ గాఢాంధకారంలో అప్పుడామెను వెళ్ళనివ్వకుండా 'నువ్వీ అఘాయిత్యానికి దిగవద్దని' మరీ మరీ చెప్పి ఆమెచేతికి కొంత పైకంయిచ్చి తెల్లవారవస్తుంటనగా ఆమెకు ఇద్దర్ని తోడిచ్చి అందాకా వదిలిపెట్టి రమ్మని చెప్పి పంపించాడు.

జానికమ్మ గ్రామంచేరుకునేటప్పటికి వుదయం పదిగంటలు కావచ్చింది. రాత్రి ఆ వుద్వేగంలో చాలాదూరం నడవడంవల్ల తిరిగివచ్చేటప్పటికి యీవేళైంది. కీడులో మేలన్నట్టు తన పిల్లలు పరారీ అయినా పరారీ అయిన తమ్ముడు కనిపించాడు. ఇన్నాళ్ళబట్టి కనపడక పోవడంవల్ల పోలీసులు పట్టుకెళ్ళతారనీ తమ్ముడు ఏ అఘాత్యమైనా చేసుకున్నాడేమోననీ ఆమె చాలా విచారపడుతూ వుండేది. అతడు సజీవుడై వున్నందుకు ఆమెకు ఒకవిధమైన సంతృప్తి కలిగింది. తమ్ముడు యిచ్చిన పదిరూపాయల కాగితాలు అయిదు

పమిటి చెంగున భద్రపర్చు కున్నది. తన తమ్ముడు చెప్పినట్టు దండోరా వేయించి పిల్లను తీసుకుని ఇంటికి వెళ్ళిపోయి కుర్రవాడి విషయం ఆరా తియ్యవచ్చు అనుకుంటూ గ్రామం చేరుకుని బజారునే నడవసాగింది.

ఇప్పుడు తాను పిల్లగురించి దండోరా వేయించాలి. దండోరా వేసేవాడి యిల్లు ఎక్కడో అడిగి తెలుసుకోవాలి, అనుకుంటూ బజారు మలుపు తిరిగింది. ఆ బజారులో జనం గుంపుగా కూడివున్నారు. వెళ్ళేటందుకు సందులేదు. ఆ జనం ఏమిటా అని జానికమ్మ అడిగి తెలుసుకోగా ఎవరో బండికింద పడ్డారని తెలిసింది. ఆ పడ్డది తనబిడ్డ కాదుగద ! ఆమె గుండెలు వేగంగా కొట్టుకో జొచ్చినవి. ఎవరు నాయనా పడ్డది పిల్లలా, పెద్దవాళ్ళా-అని యెవర్నడిగినా చెప్పరు. తాను వెళ్ళి చూదామా అంటే జనం వెళ్ళనివ్వటం లేదు. బండివాణ్ణి పట్టుకోండి, బండి పోనివ్వకండి అన్న అరుపులు వినపడుతున్నవి. ఆమె అట్లాగే ప్రాణాలు అరచేత పెట్టుకుని ఒకప్రక్క నిలుచుంది. కాసేపటికి జనం తగ్గారు. బండికింద పడ్డది ఎవరో ముసలివాడనీ ప్రాణాపాయం ఏమీలేదనీ తెలియడం వల్ల జానికమ్మ బ్రతుకు జీవుడా అని అక్కడనించి బయలుదేరింది.

అప్పుడు మధ్యాన్నం పన్నెండు దాటింది. జానికమ్మ దండోరా వేసేవాడి యిల్లు తెలుసుకుని వాడితో దండోరా వెయ్యమని చెప్పి వాడికి డబ్బులు యివ్వడానికి పమిటిచెంగు చూసుకుంటే యేముంది! వట్టిచెంగు. పైకం కాస్తా ఎవరో విప్పుకున్నారు. తాను యింకేం దండోరా వేయిస్తుంది ? కాసినా కూసినా యాభై రూపాయిలు ! ఆమెకు దుఃఖం ముంచుకు వచ్చింది. ఆమె తన దురదృష్టాన్ని నిందించుకుంటూ అక్కడనించి కదిలి తిరిగిన బజారే తిరుగుతూ పిచ్చిదానిలా వీధులవెంట తిరుగుతున్నది.

౪

ఏలూరు పవరుపేటలో ఓ మేడ వున్నది. చూడ్డానికి రెండంతస్థులే అయినా పింగాణీరాళ్ల అమర్చబడి చాలా ఆకర్షకంగా వుంటుంది. ఆ పేటలో కల్లా ఆదే అందమైన మేడని చెప్పవచ్చు. ఆ మేడ లక్ష్మణరావనే ఓ షావుకారుది. ఒకనాటి ఉదయం పదిగంటలవేళ ఆ మేడ [illegible]

కారులోనించి లక్ష్మణరావుగారు ఓ కుర్రవాడితో దిగి లోనికి వెళ్ళాడు. లక్ష్మణ రావుగారు యాభై పైబడ్డ వయస్సువాడైనా కుర్రవాడిలా చలాకీగా నడవ గలడు. ఇంటి ఆవరణలో వున్న చెట్లకేసి చూసి "ఇవాళ్ళ వీటికి నీళ్ళుపొయ్య నట్టుందే అంటూ గడపమెట్లెక్కాడు; వెంటవున్న కుర్రవాడు ఆయన్ని అనుస రిస్తున్నాడు.

కచేరిహాల్లో అయనకోసం ఎవరో నలుగురు వేచివున్నారు. ఆయన అక్కడ నిలవకుండా ఎకాయెకి కుర్రవాణ్ణి తీసుకుని లోనికి వెళ్లాడు. మధ్య హాల్లో అయిదారు కుర్చీలు వేయబడి వున్నవి. గోడన గాంధి, నెహ్రూ మొద లైన దేశనాయకుల పెద్దసైజు పటాలు పెట్టబడి వున్నవి. వాకిటి యెదురుగా గుమ్మంపైన లక్షణరావుగారి తండ్రిదికామాలు పెద్ద ఆయిలు పెయింటింగు పెట్టబడివున్నది. అక్కడవున్న కుర్చీల్లో ఒకదానిమీద రాజ్యలక్ష్మమ్మగారు కూర్చుని కుట్టుపని చేసుకుంటూ వున్నది. ఆమె లోనికివచ్చిన భర్తను చూసి మందహాసంతో "యింకా మీరు రాలేదేమిటా? అని యిప్పుడే అనుకుం టున్నాను. యీకుర్రవా డెవరండీ?" అని అడిగింది.

లక్ష్మణరావుగారు ఓ కుర్చీలో కూర్చుని "యీ కుర్రవాడా? లోకంలో ఎన్నిమోసాలు జరుగుతున్నవి? మేము బెజవాడ సివారులోవున్న గుణదల నించి రాత్రి ప్రొద్దుపోయి మట్టిరోడ్డుమీదుగా అవతల మరిఒకగ్రామం వెళుతూవుంటే ఎవరో యిద్దరు యీ కుర్రవాణ్ణి నడిపించుకుని తీసుకెళ్లుతు న్నారు. కుర్రవాడు మాకారుచూసి చేతులెత్తి గట్టిగా ఏడ్చాడు. కారు ఆపేసరికి ఆ దుండగులు యిద్దరూ పొలాలమీదగా పిక్కబలం చూపారు. అప్పుడు మేము కుర్రవాణ్ణి కారెక్కించుకుని తీసుకొచ్చాం. కుర్రవాడి దగ్గర వస్తువులేమైనావుంటే తీసుకోటానికి పట్టుకొచ్చారనుకున్నాం. తీరా కుర్రవాణ్ణి అడిగితే దగ్గర నగలేమీ లేవని చెప్పాడు. మరిఎందుకు యెత్తుకెళ్లుతున్నారో? నాకర్థం కాలేదు."అని లక్ష్మణరావుగారు అనగా;

"ఎవరో పిల్లల్ని యెత్తుకెళ్లుతున్నారని మనవూళ్ళో గూడా గోలగా వుందండి. తూర్పుబజార్లో ఎవర్నో యెత్తుకెళ్లారట." అని రాజ్యలక్ష్మమ్మగారు

"తల్లీ, పిల్లా కలిసి చుట్టాలింటికి వెళ్ళుతూ బెజవాడ సత్రంలో దిగారట. ఇంకేం కుర్రవాణ్ణి మోసపుచ్చి పట్టుకెళ్ళుతున్నారు." అని చెప్పాడు లక్ష్మణరావుగారు.

రాజ్యలక్ష్మమ్మగారికి కుర్రవాణ్ణి చూస్తే ఎంతో జాలివేసింది. ఎర్రటి శరీరచ్ఛాయ, విశాలమైన నుదురు, గుండ్రపు కళ్ళు, కోటేరులాంటి ముక్కు వికాసవంతమైన వర్చస్సు "పాపం మంచి కుర్రవాడండి. వాళ్ళ కేం పోయ్యే కాలమో ?" అన్నది.

వీళ్ళిట్లా మాట్లాడుకుంటూ వుండగా లోపలనుంచి ఓ శ్వేతవస్త్రధారిణి గుమ్మం గుండా తొంగిచూచి గోడచాటున వుండి వాళ్ళనుకునే మాటలన్నీ ఆలకిస్తున్నది. భార్య అన్నమాటలకు "మంచికుర్రవాడే పాపం" అన్నాడు లక్ష్మణరావుగారు.

"తీసుకెళ్లి యేంచేస్తారండి ? పెంచుకుంటారా ?" అని అడిగింది రాజ్యలక్ష్మమ్మగారు.

"పెంచుకునే వాళ్ళయితే యిట్లా యెందుకు చేస్తారు." అన్నాడు లక్ష్మణ రావుగారు.

"ఇవ్వాళ మీరు కనపడబట్టి పాపం బిడ్డకు ఎంతగణ్ణం తప్పిందండి! యీ అబ్బాయికోసం తల్లి అక్కడ యెంత యిదవుతున్నదో పాపం" అని రాజ్యలక్ష్మమ్మగారు అంటూవుండగా,

వారి కుమార్తె కళ్యాణి పదేళ్ళ వయస్సు వుంటుంది, ఒక చేత్తో పుస్తకాలు మరో చేత్తో గొడుకు పట్టుకుని స్కూలుకు వెళ్ళుతూ తల్లి దగ్గర నిలబడి యీ కొత్త కుర్రవాడు యెవరా ? అని చూచి వాళ్ళు అనుకునే మాటలు యదాలాపంగా కొన్ని ఆలకించి స్కూలుకు వెళ్ళిపోయింది.

లక్ష్మణరావుగారు కుర్రవాడికేసి చూస్తూ లాలనగా "అబ్బాయీ నీ వేమీ బెంగపెట్టుకోబోకు. యిక్కడ నీకేమీ భయంలేదు. మీ అమ్మ బెజవాడలో వున్నదో లేక, నిన్ను వెదుక్కుంటూ మీ చుట్టాలింటికి గాని వెళ్ళిందో తెలుసుకుని విన్నక్కడ దిగపెడతాం." అంటూ కచేరి హాల్లోకి వెళ్ళిపొయ్యాడు.

గుమ్మందగ్గరగా నిలబడి వున్న కుర్రవాణ్ణి రాజ్యలక్ష్మమ్మగారు 'ఇట్లా వచ్చి కుర్చీలో కూర్చో నాయనా' అనగా కుర్రవాడు ఆమె దగ్గరగా వచ్చి కుర్చీ మీద కూర్చోడానికి సందేహిస్తూ కుర్చీని పట్టుకుని నిలబడ్డాడు.

"నీ పేరేమిటి నాయనా ?" అని ఆదర పూర్వకంగా అడిగింది రాజ్యలక్ష్మమ్మగారు.

"రాధాకృష్ణ" అని చెప్పాడు కుర్రవాడు.

"మీ అన్నదమ్ము లెంతమంది ?" అని మళ్ళా అడిగింది రాజ్యలక్ష్మమ్మగారు.

"తాను ఒక్కడనేనని చెల్లెలు మాత్రం వున్న"దని చెప్పాడు.

"మీ నాన్న యేంపని చేస్తాడు ?" అని తిరుగా ప్రశ్నించింది రాజ్యలక్ష్మమ్మగారు.

"నాన్నలేడు అమ్మ వున్నది" అని చెప్పాడు.

"అయితే మీ కేమయినా భూవసతి వున్నదా నాయనా" అని అడిగింది రాజ్యలక్ష్మమ్మగారు.

"భూవసతి ఏమీ లేదు. జరుగుబాటు లేక అమ్మమ్మగారింటికి వెళ్ళుతున్నాం అని చెప్పాడు కుర్రవాడు.

వాళ్ల దీనస్థితి వినేసరికి రాజ్యలక్ష్మమ్మగారికి కుర్రవాడి మీదగల సానుభూతి ప్రగాఢమైంది. కుర్రవాడి జుట్టురేగి ముఖం వాడిపోయి వున్నందున రాజ్యలక్ష్మమ్మగారు "సుబ్బమ్మా" అని పని మనిషిని కేకవేసింది. "ఏమిటమ్మగారూ?" అంటూ సుబ్బమ్మవచ్చి నిలబడగా "ఈ అబ్బాయిని పెరట్లోకి తీసికెళ్లి స్నానం అదీ చేయించు.పాపం యెప్పుడు అన్నం తిన్నాడో?" అని చెప్పింది.

రాధాకృష్ణ స్నానంచేసిరాగా రాజ్యలక్ష్మమ్మగారు వెంటబెట్టుకుని వంట గదిలోకి తీసుకెళ్లింది. వంటగదిలో యేదోపనిచేస్తున్న శ్వేతవస్త్రధారిణి వీళ్ళను చూసి ముఖం ముడుచుకుంది. ఆమెపేరు నాగరత్నం. ఆమె లక్ష్మణరావుగారి చెల్లెలు. వయస్సు నలభై ఏళ్ళుంటవి. పిల్లాజల్లాలేరు. భర్త యెప్పుడో పోతే అప్పటినుంచి పుట్టింటివద్దనే పడివుంటున్నది. ఆమెకు ఒకళ్లకు పెట్టడమంటే సరిపడదు. అందులో వదినంటే అసలే గిట్టదు. వాళ్ళ భార్యా భర్తల మధ్య యేలాటి పొరపులూ లేకుండా యిద్దరూ ఒకమాటమీద వుండి తనమాట సాగనివ్వరని యీర్ష్య. తాను వంటమనిషిమీద తగువులాడటంవల్ల మామకోగా [illegible]

రాజ్యలక్ష్మమ్మగారు కుర్రవాణ్ణి కూర్చోబెట్టి పప్పు, నెయ్యి, కూరలుగడ్డ పెరుగువేసి తృప్తిగా భోజనం పెట్టింది.

లక్ష్మణరావుగారు కచేరిహాల్లోనుంచి లోనికివచ్చేసరికి పన్నెండు గంటలు దాటింది. ఆయనకు భోజనం చేసేటందుకయినా తీరుబడి వుండదు. తెల్లవారి లేస్తే తలమునిగే పనులు. వారికి మైకా రసాయనపు ఎరువులు మొదలయిన చాలా వ్యాపారాలు వున్నవి. కొన్ని వూళ్లల్లో బ్రాంచీలుగూడా వున్నవి. అయితే మంచి వితరణశాలి. ఆయన ధర్మంచెయ్యని సంస్థంటూలేదు. ఆ చుట్టుపట్ల ఆయనంటే మంచిపేరు. లక్ష్మణరావుగారు లోనికివస్తూ మధ్యహాల్లో కూర్చునివున్న రాధాకృష్ణను చూసి "అబ్బాయీ అన్నం పెట్టారా నీకు?" అని అడగ్గా "పెట్టారు" అని చెప్పాడు. భర్తలోనికిరాగా రాజ్యలక్ష్మమ్మగారు వంటగదిలో పీటవేసి వెండి కంచంలో భర్తకు భోజనం వడ్డించింది. ఆయన భోజనంచేస్తూ "మా నాగరత్నంఅంటే ఏమో అనుకున్నాను. వంట భేషుగ్గా చేసిందే? ఈ పులుసు యెంతయినా తాగవచ్చు" అన్నాడు.

ఆ మాటకు రాజ్యలక్ష్మమ్మగారు ఆవిడచేసిన వంట బాగుండక పోవడం వల్ల చలోక్తిగా అట్లా అన్నాడనుకుంది. కొంచం అవతల పొయ్యిమీద వెన్న కరగబెడుతున్న నాగరత్నం ఆమాటవిని తనవల్ల వంటమనిషి మానుకున్న దని అసంతృప్తి లేకుండా తానుచేసిన వంట బాగావున్నదని మెచ్చుకున్నందుకు ఆమె పొంగిపోయింది.

అసలు సంగతేమిటంటే వదినా మరదళ్ళ మధ్య యే కొత్త మాట వచ్చినా, నాగరత్నం భోజనం చెయ్యకుండా అలిగి పడుకుని 'సాగించుకునే వాళ్ళు సాగించుకుంటారు, యీ యింట్లో నాదేముంది? దేవుడిట్లా రాయబట్టి అందరికి అలకనై పొయ్యాను' అని యేడుస్తూ నానాహంగామా చేస్తుంది. అందుకని లక్ష్మణరావుగారు చెల్లెల్ని యేమంటే ఎక్కడ యేడ్చి పోతుందో నని నీయంత మంచిది లేదన్నట్టుగా ఆమెను బుజ్జగిస్తూ వుంటాడు.

లక్ష్మణరావుగారు భోజనంచేసి బయటకు వచ్చే సరికి ఎవరో కొందరు హార్మణీ, మృదంగం సితారు వాయిస్తూ భజన చేసుకుంటూ వచ్చి "మేం కాలి నడకన అన్ని యాత్రలు చేస్తున్నాం" అని యాచించగా వాళ్ళ కేదోయిచ్చి

పంపి లక్ష్మణరావుగారు విశ్రాంతి తీసుకోడానికి మెట్లెక్కి డాబాపైకి వెళ్ళి పొయ్యారు.

ఆయన డాబా మీదనించి కిందకి దిగేసరికి మూడు కావచ్చింది. కాళ్ళు ముఖం కడుక్కుని కచేరి హాల్లోకి వెళ్ళేసరికి యెవరో యిద్దరు; హేటు సూటుతో వున్న ఒకాయనా సామాన్య దుస్తులతో వున్న ఒకాయనా కూర్చుని వున్నారు. లక్ష్మణరావుగారు వాళ్ళతో కాసేపు మాట్లాడి లోనికివెళ్ళి బట్టలు వేసుకుని ముగ్గురూ కలిసి కారులో వెళ్ళిపొయ్యారు.

కాసేపటికి కచేరీహాల్లో వున్న వారి గుమాస్తా మధ్య హాల్లో వున్న రాధాకృష్ణ దగ్గరకు వచ్చి వాళ్ళు బెజవాడలో యే సత్రంలో దిగిందీ వాళ్ళ అమ్మమ్మగారి అడ్రస్సు అడిగి వివరంగా వ్రాసుకుని వెళ్ళాడు.

నాలుగు గంటలయ్యేసరికి స్కూలునించి కళ్యాణి యిద్దరు జతకత్తెలను వెంటవేసుకుని వచ్చింది. వారికి సంతానమల్లా యిద్దరు ఆడపిల్లలు. పెద్ద అమ్మాయికి వివాహమై కాపరానికి వెళ్ళిపోయింది. రెండో అమ్మాయి కళ్యాణి. స్కూలునించి వచ్చిన ముగ్గురు పిల్లలూ గంతులువెడుతూ ఆ ఆవరణలో వున్న చెట్లపూలు కోసుకుంటూ వుండగా రాజ్యలక్ష్మమ్మగారు "కొమ్మలు విరవకుండా కోసు కోండమ్మా" అని చెప్పింది. నాగరత్నం చూచి "ఇవ్వాళ చెట్లను ధ్వంసం చేసివెయ్యరూ, పైగా వాళ్ళనొకటి వెంటబెట్టుకుని వచ్చింది." అని గొణుక్కున్నది. వాళ్ళట్లా పూలు కోసుకుంటూ వుండగా రాధాకృష్ణ దూరంగా డాబా మెట్లపైన నిలబడి చూస్తున్నాడు. పూలు కోసుకుని జతగత్తెలిద్దరూ వెళ్ళిపోగా కళ్యాణి పూలు పట్టుకుని లోపలకి వచ్చింది. రాజ్యలక్ష్మమ్మగారు కుమార్తె తలదువ్వి పూలుపెట్టగా కళ్యాణి పుస్తకాలు పట్టుకొని డాబా పైకి వెళ్ళిపోయింది.

ప్రొద్దుకూకింది, మేడలో లైట్లన్నీ వెలిగేసరికి ఒక వింతశోభ గలిగింది. ఎనిమిదింటికల్లా పనిమనిషి మధ్య హాల్లో మంచాలువేసి పక్కలు పరిచింది. రాజ్యలక్ష్మమ్మగారు రాధాకృష్ణకు అన్నం పెట్టగా తినివచ్చి మధ్యహాల్లో కుర్చీలో కూర్చున్నాడు. "ఇక పడుకో నాయనా" అని చెప్పింది రాజ్యలక్ష్మమ్మగారు. ఆ హాల్లో కొన్ని మంచాలు వేసివున్నవి. తాను పడుకోడానికి చాపయినా యివ్వలేదు, ఎక్కడ పడుకోడం అని ఆలోచిస్తున్నాడు రాధాకృష్ణ.

"సందేహిస్తావేం నాయనా? వెళ్లి మంచంమీద పడుకో" అని చెప్పి లోనికి వెళ్లింది రాజ్యలక్ష్మమ్మగారు. ఆ మాటకు ఆబ్బురపాటు కలిగింది రాధాకృష్ణకు. ఆ మంచాలమీద మెత్తటి దిళ్లవేసి మంచందిగేటట్లు తెల్లటి మల్లెపువ్వులాంటి పక్కలు పరచివున్నవి. తానటువంటి మంచంమీద జన్మేపి పడుకుని ఎరగడు. పడుకోటానికి బిడియం వేసిందతనికి. కాసేపటికి రాజ్యలక్ష్మమ్మగారు లోపలనించి వచ్చిచూస్తే రాధాకృష్ణ అట్లాగే కుర్చీలో కూర్చుని వున్నాడు. "పడుకోపొయ్యావా నాయనా? ప్రొద్దుపోతున్నది. ఇంటివద్ద పెంద లాడే పడుకువేవాడివేమో?" అన్నది.

అక్కడ నాలుగు మంచాలు వేసివున్నవి. తాను యేమంచంమీద పడుకోవాలి అన్న సందేహం కలిగింది రాధాకృష్ణకు. ఆమెగారు ఆప్యాయంగా పడుకోమని యిన్నిసార్లు అంటూవుంటే అట్లా తాను యెందాకవి కూర్చోడం! రాధాకృష్ణ చొరవచేసి అన్నిటికంటే చిన్న మంచంచూసి పడుకున్నాడు.

లక్ష్మణరావుగారు యింటికి వచ్చేసరికి రాత్రి పది దాటింది. అప్పటికి రాధాకృష్ణ నిద్రపోతున్నాడు.

ఆ మర్నాడు గడిచిపోయింది. ఆ మూడవరోజు ఉదయం లక్ష్మణరావుగారు కచేరీహాల్లో కూర్చుని వచ్చిన టపా చూచుకుని అందులో రెండు ఉత్తరాలు పట్టుకుని మధ్య హాల్లోకి వచ్చాడు. రాజ్యలక్ష్మమ్మగారు ఓ కుర్చీలో కూర్చుని కుట్టుపని చేసుకుంటున్నది. కళ్యాణి తల్లి సరసన కుర్చీలో కూర్చుని యేదో వ్రాసుకుంటున్నది. రాధాకృష్ణ అవతల కుర్చీలో కూర్చుని అక్కడ వున్న ఏదో వారపత్రిక తిరగవేస్తున్నాడు. లక్ష్మణరావుగారు భార్యతో "మన ఖాతాదార్లకు వ్రాస్తే జవాబు వచ్చింది. వీళ్ళ తల్లి బెజవాడలో కనిపించలేదట. జగన్నాధపురంలో వీళ్ళనాయనమ్మ గారింటికి తాళంవేసి వున్నదట. అక్కడా కనుపించలేదని" చెప్పగా;

రాజ్యలక్ష్మమ్మగారు విన్నది. "కుర్రవాడు బుద్ధిమంతుడుగా ఉన్నాడు. ఈ మూడు రోజులబట్టి భోజనం చేసి మధ్య హాల్లో ఏం కూర్చుంటున్నాడో అంతే, బయట కాలు పెట్టలేదు," రాధాకృష్ణను వుద్దేశించి "మీ అమ్మ కనపడలేదని బెంగపెట్టుకోబోకు నాయనా! మీ అమ్మ కనపడే వరకూ యిక్కడే వుండువుగాని." అన్నది.

లక్ష్మణరావుగారు "మీ యిల్లు కంటె మా యిల్లు బాగానే వుంటుందిలే అబ్బాయి. ఇక్కడే వుండిపో నీకేమీవచ్చిన ఇబ్బందిలేదు. అంతకైతే ఇక్కడి బడికి వెళ్ళుదువుగాని" అని కచేరి హాల్లోకి వెళ్ళిపొయ్యాడు.

ఈ మూడు రోజులబట్టి ఆ దంపతులు చూపుతున్న ఆదరణకు రాధాకృష్ణకు తన తల్లిమీద ధ్యాసపోలేదు. సామాన్యమైన యే చిన్నయింట్లోనో వుండే తాను యీ దివ్యభవనంలో విద్యుద్దీపాల మధ్య తిరుగుతూ వుంటే అతని కేదో స్వర్గంలో విహరిస్తున్నట్టుగా వున్నది. వారు అన్నమాటలకు ఆ లేత హృదయం పొంగిపోయింది.

ఆ సాయంత్రం రాజ్యలక్ష్మమ్మగారు దర్జీని పిలిపించి రాధాకృష్ణ వంటిమీద బట్టలు మాసిపోవడం వల్ల ఇంట్లోవున్న గుడ్డ చింపించి చొక్కాలు, లాగులు పట్టించింది.

తర్వాత నాలుగు రోజులకు ఉదయం టిఫిన్ అదీ చూచుకుని లక్ష్మణరావుగారు కారులో బయటికి వెళ్లిపొయ్యారు. ఆయన వెళ్లిన కాసేపటికి రాజ్యలక్ష్మమ్మగారు, కళ్యాణీ బంధువుల యింట్లో ఏదోవనైతే పేరంటానికి వెళ్లిపొయ్యారు. ఇంటికి వచ్చేసరికి పది గంటలు దాటింది. వచ్చి ఆభరణాలు సర్ది బట్టలుమార్చుకుని చూస్తే రాధాకృష్ణ కనిపించలేదు. అదివరకు మధ్య హాల్లోనే కూర్చునే వాడల్లా యిప్పుడిప్పుడు కచేరి హాల్లోకి డాబాపైకి వెళ్లతున్నాడు. కింద చూస్తే కనవడక పోవడం వల్ల డాబా యేమన్నా యెక్కాడేమో; నని డాబా పైకి వెళ్లి చూసింది. అక్కడాలేడు. బజారుకేమన్నా వెళ్లాడేమో అనుకుని కాసేపు చూసింది. రాలేదు. అప్పుడు వంటగదిలో పనిచేస్తున్న నాగరత్నాన్ని "రాధాకృష్ణ ఎక్కడికి వెళ్ళాడని" అడిగింది. అందుకు ఆమె "ఎక్కడికి వెళ్ళాడో ? నాకేం తెలుసు? దారిన పొయ్యేవాళ్ళను యింట్లో తెచ్చిపెట్టుకుంటే ఏముంది ? వాళ్ళ బుద్ధులు నిలకడగా వుంటయ్యా ! వెళ్ళేవాడు • వూరికినే వెళ్ళకుండా ఏమన్నా యెత్తుకెళ్ళాడేమో ? ముందు చూడు" అని దీర్ఘాలు తీసింది.

తన ఆడపడుచు ధోరణి రాజ్యలక్ష్మమ్మగారికి తెలియునిది కాదు. కుర్రవాడు అటువంటివాడు కాదు. ఇవన్నీ గిట్టని మాటలు. తాను అవునన్నది కాదనటం, కాదన్నది అవుననటం ఆమెకు పరిపాటి, అందులో కొత్తేమున్నది

అనుకుని బదులు మాట్లాడకుండా యివతలకు వచ్చి పని మనిషిని అడిగింది. "నేను దొడ్లో నీళ్లుచేదతా వున్నానండి నేను చూడలేద"ని చెప్పింది పనిమనిషి.

రాజ్యలక్ష్మమ్మగారు కచేరీహాల్లో వున్న గుమాస్తాను పిలిచి "రాధాకృష్ణ ఎక్కడికి వెళ్ళాడ"ని అడగ్గా "నేను అతణ్ణి పొద్దున చూశాను. మళ్ళా చూడ లేద"ని చెప్పాడు.

"భోజనం వేళ గూడా అయింది ఎక్కడికి వెళ్ళాడో? అట్లా బజారుకు వెళ్ళి వెదికిరా నాయనా" అని చెప్పి గుమాస్తాను పంపింది.

సైకిలుమీద వెళ్ళిన గుమాస్తా కాసేపటికి రాధాకృష్ణను వెంటబెట్టుకుని తీసుకుని వచ్చి రాజ్యలక్ష్మమ్మగారితో "రోడ్డునే వెళ్లిపోతున్నాడండి. మీరు పిలుచుకు రమ్మన్నారని చెప్పి తీసుకొచ్చాను" అన్నాడు.

రాధాకృష్ణ తలవంచుకుని నిలబడ్డాడు. అతని ముఖంలో విషాద రేఖలు పొడకడుతున్నవి. బుగ్గలమీద కారిన కన్నీళ్ళ చారలు కనుపిస్తున్నవి. రాజ్య లక్ష్మమ్మగారు అతని వాలకం చూచి "ఎక్కడికి వెళ్లుతున్నావు నాయనా? నిన్ను ఎవరేమన్నారు?" అని అడిగింది. రాధాకృష్ణ పలకలేదు "చెప్పు నాయనా నువ్వు ఎందుకు వెళ్ళావు? ఎవరైనా ఏమైనా అన్నారా? చెప్పు కనుక్కుం టాను." అన్నది.

రాధాకృష్ణ "నాగరత్నంగారు వెళ్లిపొమ్మన్నారు" అని జంకుతూ చెప్పాడు.

ఇంతలో కారుహారన్ మ్రోగింది. లక్ష్మణరావుగారు లోపికివచ్చి సంగతి అడిగి తెలుసుకొని చెల్లెల్ని పిలిచి "ఎందుకు- నువ్వీ అబ్బాయిని వెళ్లి పొమ్మన్నావట?" అని అడిగాడు.

"అయ్యో! నేనెందుకు పొమ్మన్నాను? నామాట సాగుతుందిగనక పొమ్మంటానా? ఆ కుర్రవాణ్ణిచూస్తే నాకు జాలివేసి 'అక్కడ మీఅమ్మ పాపం నీ కోసం ఎంత అటమటించి పోతున్నదో, నాయనా! కనుక్కున్న వాళ్లకు తెలుస్తుంది ఆబాధ- వట్టివాళ్ళకేంతెలుస్తుంది.' అని అంటే ఆ కుర్రవాడు ఎట్లా అర్థంచేసుకున్నాడో మరి! సాగేవాళ్ళు సాగించుకుంటారుగానీ పొమ్మనడానికి నెనెవర్ని?" ఇది ఇట్లా అది అట్లాఅని యేకరువు పెడుతూ నాగరత్నం లోపికి వెళ్ళిపోయింది.

అప్పుడు లక్ష్మణరావుగారు చెల్లెల్ని ఏమన్నా అంటే అలిగి పడుకుం టుందని రాధాకృష్ణతో "దానిమాట పట్టించుకోబోకు అబ్బాయి" అని చెప్పాడు.

"మేము వుండగా ఒకళ్ళతో నీకేంపని? యెవరిమాటా పట్టించుకోబోకు" అని చెప్పి రాజ్యలక్ష్మమ్మగారు రాధాకృష్ణను లోనికి తీసుకువెళ్ళి భోజనం పెట్టింది.



జానికమ్మ డబ్బు పోగొట్టుకుని శశికోసం పిచ్చిదానిలా తిరుగుతూ దేవాలయం వీధినే నడుస్తోంది. వీధినిఆనుకుని ఆ చివరనుంచి యీ చివరవరకూ ఆలయపు ఎత్తయిన ప్రాకారపు గోడమధ్య గోపురంతో కూడుకున్న ముఖ ద్వారం వున్నది. జానికమ్మ ఆలయంముందుగా నడిచి పోతున్నది. అప్పుడు సాయంత్రం అయిదుగంటలు దాటుతుంది. ఆవాళ మబ్బులు యేమీలేకుండా ఆకాశం నిర్మలంగా వున్నది. ఆలేత ఎండలో ఆలయపు గోపురశిఖరాలు మిల మిల మెరిసిపోతున్నవి. ఆరోజు శ్రావణ శుక్రవారం కావటవల్ల చాలామంది స్త్రీలు కర్పూరం టెంకాయ పట్టుకుని అమ్మవారిని దర్శించటానికి కోవెల్లోకి వెళ్ళుతున్నారు. వెళ్ళేవాళ్ళు వెళ్ళుతూవుంటే అమ్మవారిని దర్శించుకుని తిరిగి ఇళ్ళకు వెళ్ళేవాళ్ళు వెళ్ళిపోతున్నారు. కోవెల ముందుగా వెళ్ళిపోతున్న జానికమ్మకు, "జానికమ్మా!" అన్న పిలుపు వినబడగా తలయెత్తి అటువేపు చూసింది. చిన్ననాటి స్నేహితురాలు కనకదుర్గ హారతి పళ్లెంచేతితో పుచ్చుకుని కోవెల్లోనించి తనవైపు వస్తున్నది. జానికమ్మకు పోయినప్రాణం లేచివచ్చిన ట్లయింది. కనకదుర్గ జానికమ్మను సమీపించి "అయ్యో! అట్లాఅయిపోయ్యా వేమిటి! యీవూరు యెప్పుడొచ్చావు?" అని అడిగింది.

స్నేహితురాలిని చూసేసరికి జానికమ్మకు సంతోషం దుఃఖం ఒక్క- సారిగా పొంగుకొచ్చినవి. తన పిన్నిగారింటికనివస్తే ఆమె లేకపోవడం, తిరిగి యింటికి వెళదామనుకుంటూవుంటే పిల్ల కనపడకపోవడం దారిలో రాధాకృష్ణ పరారీ కావడం మొదలైన సంగతులు టూకీగా చెప్పగా విని కనకదుర్గ యెంతో విచారపడి:

"నేను ఆ మధ్య కొరిటిపాడు వెళ్లినప్పుడు అమ్మ చెప్పగా నీ పరిస్థితులు విని ఎంతో నొచ్చుకున్నాను. మాకు యీ మధ్యనే ఇక్కడకు బదిలీ అయింది. మాయింటికి వెళదాం రమ్మ"ని జానికమ్మను వెంటబెట్టుకుని తీసుకెళ్ళింది.

ఇంటివద్ద కనకదుర్గ భర్త కేశవరావు వసారాలో కూర్చుని యేవో ఆఫీసు కాగితాలు చూచుకుంటున్నాడు. భార్య వెంటబెట్టుకువెళ్లిన జానికమ్మను అతడు చప్పున గుర్తుపట్టలేక పొయ్యాడు. కేశవరావు జానికమ్మను ఎరుగు న్నాడు. కొరిటిపాడులో తన అత్తగారింట్లో తన భార్యా, ఆమె యెప్పుడూ కలిసి మెలిసి వుండేవాళ్ళు. జానికమ్మతో అతడు యధాలాపంగా కొన్నిసార్లు మాట్లాడాడు. కాని అట్టే పరిచయంలేదు. భార్య జానికమ్మఅని చెప్పగా అప్పుడు పోల్చుకుని "ఎప్పుడొచ్చావమ్మా?" అని జానికమ్మను పరామర్శ చేశాడు. ఆమె ముఖంలోని విషాదరేఖలుచూసి యెందుకీమె యిట్లావున్నదని అను కుంటూవుండగా భార్య ఆమెను గురించి అంతాచెప్పింది. అతడు ఎంతో జాలిపడి "నీ బిడ్డకువచ్చిన పరవా యేమీలేదు. దగ్గర వస్తువులేమీ లేవుగనక మనం భయపడవలసిన అవసరం యేమీలేదు. నేను మా జవాన్నిపంపి వెదికి స్తాను, నువ్వేమీ విచారపడవద్దమ్మా." అని జానికమ్మకు ధైర్యం చెప్పాడు.

ప్రొద్దుకూకింది. చీకట్లు అలముకొంటున్నవి. కనకదుర్గ లాంతరు వెలిగించి భర్త దగ్గర పెట్టింది. వెలుతురును చూడగానే ఇంట్లో దాగున్న చీకటి పోలీసును చూసిన దొంగలా పరుగుపెట్టింది "ఎప్పుడు భోంచేశావో? పాపం నీరసంగా మాట్లాడుతున్నావు" అంటూ కనకదుర్గ జానికమ్మకు ఆదరా బాదరా స్నానానికి నీళ్ళు తోడింది. స్నానంకాగా జానికమ్మను భోజనానికి లేవ మంది. ఆమె "నే నిప్పుడు భోజనంచెయ్యన"ని చెప్పగా కనకదుర్గ "అట్లా వల్లకాదు. నువ్వు భోజనంచేసితీరాలి. నువ్వు భోంచేస్తేనే యివ్వాళ నేనుభోంచే స్తానని"పట్టుపట్టింది. కేశవరావుగూడా ఎంతో దూరం చెప్పినమీదట జానికమ్మ భోజనానికి లేచింది.

ఆమర్నాడు ఉదయాన కనకదుర్గ యింటిపనుల్లో నిమగ్నురాలై వున్నది. కేశవరావు యేదో పనిమీద వెళ్లాడు. జానికమ్మ దిగులుగా వసారాలో కూర్చు న్నది. ఆమె కళ్ళు తెరిచినా మూసినా పిల్లలిద్దరూ కళ్ళల్లో మెదులుతున్నారు. ఎప్పుడూ ఆమెకు అదేచింత. కుర్రవాడు బధిపించి వచ్చినట్టూ, తాను వాడికి

అన్నం పెట్టినట్టూ, శశి, వాడూ దేనికో తగువులాడుతుంటే తాను సర్దినట్టు ఈ దృశ్యాలన్నీ ఆమె కళ్ళకు కట్టినట్టు కనపడ సాగినవి.

కనకదుర్గ కూతురు హేమకు యేడేళ్ళుంటవి. జానికమ్మ దగ్గరకువచ్చి కూర్చున్నది. ఆ అమ్మాయి వినేవాళ్ళుగనక వుంటే మాటలు ముత్యాల్లా గుమ్మరిస్తుంది. "మా నాన్న నాకు పట్టుపరికిణీ కుట్టించాడు. ఎంత బాగుందను కున్నావు? అమ్మ పెట్టెలోపెట్టి తాళంవేసింది. అనిక్కూ చూపిస్తాలే. నాన్న నిన్న ఆఫీసుకు వెళుతూ అమ్మచేతికి పావలాయిచ్చి చామంతిపూలుకొని నాకు జడవెయ్యమనిచెప్పి వెళ్ళితే అమ్మ నాకు జడవెయ్యలా. నీకు జడవెయ్యటం చాతనవుతుందా?" అని అడిగింది.

"ఆ" అన్నది జానికమ్మ.

"అనిక్కూ పూలుకొనుక్కుంటాగానీ జడవేస్తావా?" అని అడిగింది.

"వేస్తాలేగానీ నేను జ్ఞప్తి వున్నానా? హేమా"అని అడిగింది జానికమ్మ. శశికంటే హేమ ఒకఏడాది చిన్నది. శశి ఏడాది పిల్లయి వుండగా తాను పుట్టింటికి వెళ్ళితే అప్పుడు కనకదుర్గ హేమను ప్రసవించింది, ఆమాటకు హేమ చేతులు ఆడిస్తూ:

"ఎందుకు జ్ఞప్తిలేవు? మా తాతగారింటికి నువ్వు అమ్మకోసం వచ్చేదానివి. అవతల సీతగారియిల్లుకదు మీది? నువ్వు నాకోసారి మామిడిపండు యివ్వ లేదమ్మా" అంది.

"ఎప్పటి సంగతో నీకింకా గుర్తున్నదా చిట్టితల్లీ."

"మొన్న మేం అదేదో వూరెళ్లితే నాన్న చాల పళ్లుకొన్నాడు. గుళ్ళోకి వెళ్ళి అమ్మ స్వామికి టెంకాయకొట్టి హారతి యిచ్చింది. అక్కడ పెద్ద రథం వుంది. పెద్ద కోనేరుకూడా వుంది. కోనేరు నువ్వెప్పుడన్నా చూశావా?" అని అడిగింది.

"చూడలేదు."

"ఐతే యీ దఫా వెళ్ళినప్పుడు నిన్నుగూడా తీసుకెళతాంలే."

ఇంతలో లోపలనించి కనకదుర్గవచ్చి "కోడలు ఏదో జవాబు చెప్తున్నదే" అంటూ జానికమ్మ దగ్గర కూర్చున్నది. "ఈమె జడవేస్తుందట అనిక్కూ పూలు కొనవచ్చే అమ్మా" అన్నది హేమ.

"ఈమె యేమిటి ? అత్తయ్య అను" అని గదుముకున్నది కనకదుర్గ. ఆమె కొడుకు సూర్యం నాలుగేళ్ళవాడు, తల్లివడిలో వచ్చి కూర్చున్నాడు. "నిండునెలలు. అట్లా మీదపడవేసుకోబోకు దుర్గా" అన్నది జానికమ్మ. జాని కమ్మకు ఆమెను దుర్గ అనే పిలిచే అలవాటు. "చూశావు అత్తయ్యా ? మా సూర్యానికి ఎంతయినా హోరంచాలదు. గుడ్లేసుకుని ఎట్లా చూస్తున్నాడో చూడు ? మా నాన్న మిఠాయి తీసుకొస్తే సినిమాలో ఘటోత్కచుడులాగ నాకు లేకుండా అంతా వాడే మింగేస్తాడు" అన్నది హేమ.

జానికమ్మకు గూడా నవ్వువచ్చింది. "బాగా సినిమాలు చూస్తున్నావా ? హేమ" అన్నది.

"సినిమాలకేం తక్కువ? వీధిలో డప్పులు మోగితేచాలు, పేపరు పట్టు కొచ్చి సినిమాకెళ్ళదామని గోలపెడుతుంది" అంది కనకదుర్గ.

ఇంతలో ప్రక్కయింటి కోటినాగమ్మగారు వచ్చింది. ఆమె భక్తురాలు. వయస్సు యాభై ఏళ్ళుంటవి. కాశీ, రామేశ్వరం, కంచి, కాళహస్తి మొదలైన క్షేత్రాలు యెన్నోసార్లు చుట్టివచ్చింది. యెప్పుడూ పూజలు, పునస్కారాలు చేస్తూంది. ఆమె కూర్చుని అక్కడవున్న జానికమ్మను చూసి "ఈమె ఎవర"ని అడగ్గా కనకదుర్గ "నా స్నేహితురాలు-వలాన వూర"ని చెప్పింది. కోటి నాగమ్మగారు జానికమ్మ వచ్చిన కారణం మొదలైనవి అడిగి తెలుసుకుని;

"మనం కష్టాలు వచ్చినప్పుడే వాటిని ధైర్యంగా యెదుర్కోవాలి, అమ్మాయి. సుఖం వచ్చినప్పుడు సంతోషించి కష్టంవచ్చినప్పుడు దుఃఖ పడ రాదు. ప్రతివాళ్ళకు సుఖపడాలనే వుంటుంది గాని అది మనచేతుల్లో లేదు. కర్మ చెయ్యడం వరకే మానవులు స్వతంత్రులు. దాని ఫలితానికి మాత్రం కాదు. అందుకనే గీతలో శ్రీ కృష్ణుడు ఫలితం తనమీద వదిలేసి నిష్కామ కర్మ చెయ్యమని బోధించాడు...." అని చెప్పింది కోటినాగమ్మగారు.

జానికమ్మగూడా రామాయణం భారతం మొదలైన గ్రంధాలు పఠించి కొంత విజ్ఞానాన్ని సంపాయించుకున్నది గనక కోటినాగమ్మగారు చెప్పిన మాటలు విని ఆమె జ్ఞానిగా గుర్తించి ఆమెకు నమస్కారం చేసింది.

తర్వాత కోటినాగమ్మగారు ఆధ్యాత్మిక విషయాలను గురించి కొంత సేపు ముచ్చటించింది.

ఆరోజు రాత్రి ఎనిమిది గంటలకల్లా కోటినాగమ్మగారు "నీ భోజనం అయిందా కనకదుర్గా?" అంటూ రాగా "అయింది, కూర్చో పిన్నీ" అన్నది కనక దుర్గ. కోవెల్లో పురాణం చెపుతూ వుండగా వాళ్ళిద్దరూ కలిసి ప్రతిరోజు వెళ్ళు తున్నారు. వసారాలో హేమను దగ్గరపెట్టుకుని కూర్చున్న జానికమ్మను "నువ్వుగూడా వస్తావా? అమ్మాయి" అని కోటినాగమ్మగారు అడిగింది. ఆ చెప్పే పురాణం రామాయణం అని తెలుసుకుని తనకు రామాయణం అంటే ఎంతో భక్తి అవటం వల్ల వాళ్ళతోపాటు జానికమ్మగూడా బయలుదేరి వెళ్ళింది.

ఆలయ ముందుహాల్లో విద్యుద్దీపాలు వెలుగుతున్నవి. అక్కడ ప్రతి రాతి స్తంభానికీ శిల్పాలు చెక్కబడి వున్నవి. హాల్లో గర్భగుడి ముఖద్వారం ఎదురుగా పెద్ద నందివాహనం తన యజమాని సృష్టించిన జీవులకు ఆహారం సమకూర్చడానికి నేలంతా దున్ని దున్ని అప్పుడేవచ్చి పడుకున్నట్టుగా జీవ కళతో ఉట్టిపడుతున్నది. అప్పుడే జనం ఒక్కొక్కరే చేరుకుంటున్నారు. కాసేపట్లో హాలంతా జనంతో నిండిపోయింది. పురాణం ప్రారంభమైంది. ఆ చెప్పేది సుందరాకాండలో సీతాదేవి అశోకవృక్షం క్రింద కూర్చుని విల పిస్తున్న ఘట్టం. పౌరాణికుడు పద్యాలు శ్రావ్యంగా వల్లిస్తూ తేటతెల్లంగా అర్థం విడమర్చి చెపుతున్నాడు.

"జనకమహారాజు పుత్రిక దశరథమహారాజు కోడలు లోకారాధ్యుడైన శ్రీరామచంద్రప్రభువు అర్ధాంగి అయ్యుండికూడా సీతామహాదేవి రాక్షసులమధ్య అట్లా కష్టాలు పడటం యేమిటి? ప్రారబ్ధం అనేది యెటువంటి వాళ్ళకైనా అనుభవించక తప్పదు. సింహాసనం యెక్కబోతున్న శ్రీరామచంద్రుడు అడ వులపాలై కష్టాలు అనుభవించటం; నాకు వద్దుమొర్రో అన్న భరతుణ్ణి రాజ్యాభి షిక్తుణ్ణి చెయ్యడం ఇదంతా ఏమిటి? సుఖమూ దుఃఖమూ యీ రెండుగూడా ప్రారబ్ధాలు. మానువుణ్ణి కట్టికుడుపుతవి. తప్పించుకోవాలంటే వీల్లేదు. దుఃఖాన్ని తప్పించుకో లేనట్లే సుఖాన్ని వదులుకుందామన్నా అదీ వీలుకాదు. అనుభ వించి తీరవలసిందే. అందుకు భరతుడే తార్కాణం. శ్రీరామచంద్రుడు భార్య సమేతంగా అరణ్యాలపాలై కష్టాలు అనుభవిస్తున్నాడు గదా? మళ్ళా సీతమ్మ వారిని రావణాసురుడు యెత్తుకెళ్ళడం ఏమిటి? దాని ప్రభావం ఎంతవరకు

కున్నదో తప్పదు. సత్యసంధులైన యుగపురుషులే అట్లా సతమత మయితే యిక కలియుగంలో వున్న వాళ్ళ సంగతి వేరే చెప్పాలా ?"

పౌరాణికుడు రాగంతీస్తూ మళ్ళా పద్యం వల్లించటం మొదలుపెట్టాడు. జానికమ్మ సీతాదేవి పడేకష్టాలువిని కంటతడి పెట్టుకుంది. సీతమ్మవారికి హనుమంతుడు కనపడి ముద్రిక యిచ్చేటంతవరకు కథ జరిగింది. పౌరాణికుడు కర్పూరం వెలిగించి మంగళహారతి యిచ్చాడు. జనం లేచిపొయ్యారు.

ఆ తెల్లవారి హేమ ఉదయానే లేచి ప్రక్కయింట్లో పూలు కోసుకుని వచ్చి "అత్తయ్యా నాకు జడవేసి పూలుపెట్టవూ ?" అని కూర్చుంది.

"ప్రొద్దున్నే ఏం జడ ?" అని తల్లి గదుముకున్నది.

"పోనీలేపాపం పూలు తెచ్చుకున్నది." అంటూ జానికమ్మ జడవేసి పూలు పెట్టింది.

ఇంతలో కనకదుర్గ కాఫీకాచి జానికమ్మకూ పిల్లలకూ యిచ్చి తాను గూడా తాగి వసారాలో జానికమ్మదగ్గర కూర్చున్నది. రాత్రి విన్న పురాణం సంగతి ప్రస్తావనకు తెచ్చి "అయ్యవారు పురాణం బాగా చెపుతున్నారు. సీతామ్మవారు పడే కష్టాలు వర్ణించి చెపుతుంటే నా కళ్ళవెంట నీళ్ళువచ్చినవి" అన్నది.

సీతామ్మవారి సంగతి ఎత్తేసరికి జానికమ్మ కళ్ళు చమ్మగిలినవి. "పురాణం బాగా చెపుతున్నారు" అన్నది.

"కష్టాలు అటువంటివారికే తప్పలేదు. నువ్వేమీ విచారపడవద్దు. జానికమ్మా, ఆఫీసులో జవాను వారుచెప్పిన గుర్తులనుబట్టి విన్న వెదికితే కళి కనపడలేదట. ఇంత వూరుమీద కాసేపు వెదికితే ఏంతేలుతుంది ?" అన్నది.

"నేను కనపడలేదని బిడ్డ ఎంత యేడుస్తున్నదో! యెక్కడ చిక్కపడ్డదో యేమో ? వేళకు అన్నం అమిరిందో ; లేదో ? పిల్లవాడికోసమే దిగులు పడుతూవుంటే మళ్ళా యిదొకటి" అని వాపోయింది జానికమ్మ.

"ఇది ఊరుకాదు జానికమ్మా, పిల్ల యేడుస్తూవుంటే అంత కనికారం లేకుండా యెవరికుంటుంది. ఎవరో దగ్గరికి తీసివుంటారు. పిల్లవిషయంలో

నీకు వప్పగించే భారం మాది. వీరు అర్జంటుగా వెళ్ళవలసి .రాత్రి బండికి, కేంపుకు వెళ్ళారు. సాయంత్రానికి వస్తారు. పిల్లవిషయంలో నీవేలాటి బెంగా పెట్టుకోవద్దు. నీకో విషయం చెప్పాలనుకుంటున్నాను. రాత్రి మేమిద్దరం గూడా అనుకున్నాం. నాకు పురుడు పోసేటందుకు మా అమ్మకు ఉత్తరం రాస్తే తన కోడలికిగూడా ప్రసవించే రోజులని ఉత్తరం రాసింది. సమయానికి దేవుడు పంపినట్టు వచ్చావు. నువ్వు వుండి ఈసారి నాకు పురుడు పొయ్యాలి" అని జానికమ్మ రెండుచేతులూ పట్టుకుంది.

౬

ఆరోజు సత్రం వసారాలో ముగ్గురుపిల్లలూ ఆడుకుంటూ వుండగా జానికమ్మ సంచి శశిదగ్గరపెట్టి యిప్పుడే వస్తానని చెప్పి వెళ్ళడం వెళ్ళడం ఆవాళ్ళ సాయంత్రంవరకూ తల్లి రాకపొయ్యేసరికి శశి ఏడవడం మొదలు పెట్టింది.

చీకటి పడ్డది. శశి అట్లా ఏడుస్తూనే వున్నది. అవతల గదిలో ఓరైతు కుటుంబం ఆడవాళ్ళకు అనారోగ్యంగా వుండడంవల్ల చికిత్సనిమిత్తం వచ్చి వుంటున్నారు. రైతుభార్య ఏడుస్తున్న శశినిచూసి "ఎందుకమ్మాయి ఏడుస్తున్నావు?" అని అడిగింది.

"అమ్మ రాలేదు" అని చెప్పింది శశి.

"ఎక్కడికెళ్ళింది?" అని అడిగిందామె.

"ఎక్కడికెళ్ళిందో నాకు తెలియదు. మధ్యాహ్నమనంగా పోయింది" అంది శశి.

"వస్తుందిలే. ఏడవబోకు అమ్మా" అని ఓదార్చి శశినీ శశిదగ్గర ఉన్న సంచినీ వాళ్ళగదిలోకి తీసికెళ్ళి శశికి అన్నం పెట్టింది. ఆరాత్రి శశి అక్కడనే పడుకున్నది. మర్నాడుగూడా తల్లి రాకపొయ్యేసరికి శశి బెంగతో ఏడవడం మొదలుపెట్టింది.

రైతు భార్యపేరు తిరపతమ్మ. శశి అట్లా ఏడుస్తూ వుండడం చూసి "వీళ్ళమ్మ నిన్నమనంగా వెళ్ళింది. ఇంకా రాలేదు. పిల్ల యేడుస్తున్నది. కాస్త అట్లా పోయి వెతికిరాండి" అని చెప్పింది భర్తతో.

"వీళ్ళమ్మ గోడకు చేరగిలబడి కూర్చుంటే నేను చూశాను. ఎక్కడికి వెళ్ళిందో?" అన్నాడతడు.

చిన్న పిల్లకు రొట్టికూడా కొనిపెట్టింది. వుండివుండి ఎక్కడికి వెళ్ళిందో? పిల్లనుగూడా మర్చిపోయింది. కాస్త అట్లా వెళ్ళివద్దురూ" అని భర్తను పంపింది తిరపతమ్మ.

రైతుపేరు హనుమయ్య. జానికమ్మను వెదకి కాసేపటికి తిరిగివచ్చి "ఒకవీధిలో ఎవరో స్త్రీ భావిలో పడ్డదట. జనం గుంపులు గుంపులుగా కూడి చెప్పుకుంటున్నారు" అన్నాడు.

"అరె పాపం. వీళ్ళమ్మ కాదుకదా!" అని విచారపడ్డది తిరపతమ్మ.

"నాకూ అదే అనుమానంగా వుంది. లేకపోతే చిన్ననంగా పిల్లను వదిలిపెట్టిపోయి ఎందుకురాదు?" అన్నాడతడు.

"అయ్యో! పాపం అంత ప్రాణంమీద కేంవచ్చిందో?" అంది.

"ఏవో బాధలవల్ల విరక్తి చేసుకుని వుంటుంది."

పాపం బాగా బ్రతికినవాళ్ళులాగా వున్నారు. ఎంతలో ఎంత యిది జరిగింది?"

"అంతవరకు సరిపోయింది."

వాళ్ళు అనుకునే మాటలను బట్టి శశి తనతల్లి చనిపోయిందని విని గట్టిగా ఏడవడం మొదలుపెట్టింది. తిరపతమ్మ శశిని దగ్గరకు తీసుకుని ఓదార్చింది.

తిరపతమ్మకు కులాసాగా వుండటంవల్ల ఆ మర్నాడు వాళ్ళకుటుంబం యింటికి వెళ్ళిపోతున్నది. వాళ్ళది అక్కడకు దగ్గరలో వున్న ఓ గ్రామం. వాళ్ళను యెక్కించుకు వెళ్ళడానికి వాళ్ళగ్రామంనించి వుదయానే రెండెడ్లబండి వచ్చింది. వాళ్ళు వెళ్ళిపోతూ శశినిగూడా వాళ్ళవెంట తీసుకెళ్ళారు.

బండి వాళ్ళగ్రామం చేరేసరికి ఉదయం పదిగంటలయింది. ఊరివెలపల తాళ్ళతోపు రాములవారి మందిరందాటి బండి వాళ్ళ వాకిటిముందు నిలిచింది. పాలేరు బండిలో సామాను లోపలకి జేరవేశాడు. బండిదిగి అంతా లోపలికి వెళ్ళారు. పాలేరు బండిని యింటిముందు ఖాళీస్థలంలో విడిచి ఎడ్లను బావిట్లో

కట్టివేశాడు. హనుమయ్య లోపల అడుగుపెడుతూ "ఈ గేదె దొక్కలు యిట్లా పీక్కుపోతున్నై మేతవెయ్యడంలేదా ? దానిముందు మేతతెచ్చిపడవెయ్యరా" అని పాలేరును కేకవేశాడు. అది నాలుగుగదుల పెంకుటియిల్లు. ముందువసారా. యింటిముందు ఖాళీస్థలంలో. యింటికి కొంచెం దూరంలో ప్రక్కగా గొడ్ల చావిడి, చావిడిముందు పెద్దవేపచెట్టు, వీధిని ఆనుకుని రెండుతాటిచెట్లు వున్నవి. పాలేరు వసారాలో దించిన సామాను ఒక్కొక్కటే రైతుభార్య తిరపతమ్మ యింట్లోకి జేరవేస్తున్నది. శశి వసారాలో గోడను ఆనుకుని నిలుచున్నది. వాళ్ళకూతురు సావిత్రి పదేళ్ళది. సామాను లోపలపెడుతున్న తల్లికి సహాయ పడుతున్నది. హనుమయ్య తల్లి కామాలు ముసలమ్మ వాళ్ళకు నీళ్ళుతెచ్చి యివ్వగా కాళ్ళు కడుక్కుని యింటిముందు వేపచెట్టుకింద మంచం వాల్చుకుని కూర్చున్నాడు. వారికి, యిద్దరు ఆడపిల్లలు, యిద్దరు మొగపిల్లలు సంతానం. పెద్దకొడుకు పెళ్ళికాగానే వేరేవున్నాడు. పెద్దపిల్ల పెళ్ళయి కాపరానికి వెళ్ళిపోయింది. రెండోకొడుకు పట్టణంలో చదువుకుంటున్నాడు.

వాళ్ళ యింటికి రాగానే ప్రక్కయింటి సుబ్బయ్య పరామర్శ నిమిత్తం వచ్చాడు. హనుమయ్య "రావేబాబు కూర్చోవే" అనగా సుబ్బయ్య, హనుమయ్య సరసన మంచంమీద కూర్చున్నాడు. లేగదూడ విప్పుకుని తల్లి దగ్గరికి పరుగెత్తుతూవుంటే హనుమయ్యలేచి దాన్ని కట్టివేసి మళ్ళావచ్చి మంచంమీద కూర్చున్నాడు. తాడిచెట్టుమీద గద్దవాలడంవల్ల మట్ట వూగిసలాడి కర్రుమని శబ్దం చేసింది.

"అమ్మాయికి బాగా కులాసేనా ?" అని అడిగాడు సుబ్బయ్య.

"కులాసే" అన్నాడు హనుమయ్య.

"కాస్తరోగానికి కూస్తరోగానికి బస్తీ పరిగెత్తుతున్నారు. మన ఆచార్లు మాత్రం నయం చెయ్యడంలా ?" అన్నాడు.

"ఆచార్లు కారం, కందినీళ్ళు పత్యంపెట్టి పంపుతూంటే వున్నరోగం ఎక్కువైంది. అదేమిటంటే ఆగండి తగ్గుతుందం'టాడు'. అప్పుడు విసుగుపుట్టి కాదు-బస్తీ వెళ్ళింది" అన్నాడు.

"ఈ ఇంగ్లీషు మందులు లేనప్పుడు వాళ్ళు చెప్పినప్రకారం నడుచుకుని రోగాలు నయంచేసుకోలా ! యిప్పుడా మందులు కళ్ళకు కనపడుతూవుంటే ఓపిక యెక్కడిది ?" అన్నాడు.

"ఏం ఓపికో ఏమోబాబూ - బస్తీవెళ్ళితే యిప్పుడు మాకు సామాన్యం అయిందా ?"

"నీకేం మహారాజువి"

"సరేకానిబాబు పొలంలో పైబలం వెయ్యాలి. నేను బస్తీకి యిక్కడికీ తిరగడంలో యింతవరకూ వెయ్యడం పడలేదు. అమువప్పింది నీదగ్గిరేమన్నా మిగిలిందా ?" అని అడిగాడు.

"మాదగ్గర యెక్కడిది-కొన్నది మాకే సరిపోయింది" అన్నాడు.

ఇంతట్లో రంగనాయకులు వచ్చాడు. అతడు యువకుడు, వాళ్ళది ప్రక్క ఇల్లు. ఎక్కడికివచ్చినా అతనినోరు కాసేపయినా వూరుకోదు. ఏదో పేలుతూ వుంటాడు. "ఏంమావా యెప్పుడొచ్చారు ? అత్తయ్యా కులాసాగా వుందని మొన్ననే చెప్పావుగా, మళ్ళా అడగడందేనికి ? కోడలికోసం అమ్మమ్మగారు ఎంతో ప్రేమతో ఎదురుచూస్తున్నది. అత్తకూ కోడలకూ మంచి స్నేహంకదు! అమ్మమ్మగారు మీరు వచ్చేసరికి నాలుగుకూరలు, నవకాయపిండివంటలూ చేసి వుండాలి: ఏంఅమ్మమ్మా నన్నుగూడా భోజనానికి వుండమంటావా" అన్నాడు.

"పోరా రాలుగాయి" అన్నదామె వసారాలో నిలబడి.

"అవును నీ కోడలు నీకోసం ప్రేమతో తయారుచేసిన పదార్థాలు నాకెందుకు పెడతావులే ?" అతడు వసారాలో వున్న శశినిచూసి "ఈ కొత్త పిల్లెవరు మావా అట్లా ముఖంపెట్టింది. అసలే పిల్లల్ని యెత్తుకెళ్ళుతున్నారని గోలగావుంది. యెక్కడైనా సూక్కురాలేదుగదా ?" అన్నాడు.

"సత్రంలో దొరికితే తీసుకొచ్చాం" అన్నాడు హనుమయ్య.

"నేనన్నమాట నిజమేనా? అసాధ్యుడివి" అన్నాడు రంగనాయకులు.

"అర్రె నీ అంబోతుకూల-బండిని కుమ్మేస్తున్నది" అంటూ హనుమయ్య బాణాకర్ర పుచ్చుకుని వీథిలోకి వెళ్ళాడు. వాళ్ళయింటి ఎదురుగా వీధి ప్రక్క యెవరిదో ఖాళీస్థలం వున్నది. అందులోరాళ్ళకుప్ప మాత్రం వున్నది. దానినిండా గడ్డీ పిచ్చిచెట్లు అడివిలాగా మొలిచినవి. అందులో గొడ్లుపడి మేస్తుంటవి. ఆ ఖాళీస్థలంలోనే పాలేరు బండివిడిచాడు. అంబోతు బండిని కుమ్ముతూ వుండగా హనుమయ్య కర్రపట్టుకుని వెళ్ళి దాన్ని తోలివేశాడు.

అమర్నాడు ఉదయాన జొన్నచొప్ప తోలుకొనివచ్చి వాకిటిముందు పడ వేసి పాలేరు బండిని మళ్లా పొలం తోలుకెళ్లాడు. ఇంతలో వానచినుకులు ప్రారంభమైనవి. చొప్ప తడిసి పోతున్నది. పాలేరులేడు-బండి తోలుకెళ్ళాడు. హనుమయ్యగూడా యింటివద్దలేడు. తిరపతమ్మ "అయ్యో చొప్పంతా తడిచి పోతున్నది. రాండే లోపలికి జేరవేద్దాం" అంటూ గబాగబా వీధిలోకి వెళ్లింది. సావిత్రి తల్లిని అనుసరించిందిగాని శశి వసారాలోనే నిలబడ్డది. తిరపతమ్మ శశినిగూడా రమ్మనగా శశివెళ్ళి వాళ్ళతోపాటు వానలో చొప్ప జేరవేస్తున్నది. చొప్పంతా జేరవేశేసరికి ముగ్గురూ వర్షంలో తడిసి ముద్దయి పోయారు. లోనికి వచ్చి తిరపతమ్మా సావిత్రీ తడిబట్టలు విడిచి పొడిబట్టలు కట్టుకున్నారు. శశి ముఖంవెంట, వరికిణావెంట నీళ్ళుకారుతూ అట్లా వసారాలో నిలబడివున్నది. విడిచేటందుకు బట్టలేవి? కొంతసేపటికి తిరపతమ్మ సావిత్రిది చినిగిపోయిన లంగాతెచ్చి శశి తడిబట్టలు విడిపించింది.

అప్పుడు మధ్యాన్నం పన్నెండుగంటలు కావచ్చింది. తిరపతమ్మ సావిత్రికీ శశికీ అన్నం పెట్టింది.

ఇంతలో హనుమయ్య పొలాన్నించి తడిసి ముప్పందమై వచ్చాడు.

"అట్లాతడిసి ముద్దయ్యావు-దబ్బున ఆబట్టలు విప్పేసి తల బాగా తుడు చుకో నాయనా, జలుబు చేస్తుంది" అన్నది ముసలమ్మ.

"ఆయనే నెట్లా తడిసింది? మేంమాత్రం తడవలా" అన్నది తిరపతమ్మ.

"మీరు కాశేపేగా వానలోవుంది: వాడు యెంతసేపటినించి వున్నాడు?" అన్నది ముసలమ్మ.

భార్య పొడిబట్టలు యివ్వగా హనుమయ్య కట్టుకుంటూ "మురుగు వచ్చిపడి పొలంగట్టు కోసేసింది. యివ్వాల పొద్దున్నే పొలం వెళ్ళబట్టి సరి పోయింది. లేకపోతే పొలం దిబ్బేసేదే. అక్కడికీ నా ఒక్కడివల్ల అయిందా యెటువంటి నీళ్ళవురవడి - పక్కపొలం ఆసామీ, నేను యిద్దరం ఒరిగడ్డివేసి గండి పూడ్చేతలికి ఘా ఘాతమారింది." అని చెప్పాడు.

"ఇంటివద్ద చొప్పంతా వానకు తడిసిపోయింది. అట్లాగే లోపలికి జేర వేశాం" అంటూ తిరపతమ్మ భర్తకు కాళ్ళకు నీళ్ళిచ్చి భోజనం వడ్డించింది. అప్పటికి ఇంకా వానపడుతూనే వున్నది.

మధ్యాహ్నంనించి తెరపిచ్చింది. డాక్టరు తిరపతమ్మను కొన్నాళ్ళవరకూ యేపనీ చెయ్యవద్దని చెప్పాడు. అందువల్ల పొలంవెళ్ళి కాస్త దూడకు గడ్డి కోసుకురమ్మని, సావిత్రినీ శశినీ జతచేసి పొలం పంపించింది.

తర్వాత వారంరోజులకు పొలానికి అన్నం పంపవలసివచ్చింది. హను మయ్య పొలంలో మొక్కజొన్న కండెలు విరిపిస్తున్నాడు. తిరపతమ్మ ఇంకా తానేమో బయట కాలుపెట్టడంలేదు. సావిత్రిని శశిని జతచేసి పంపుదామంటే సావిత్రి అలిగి కూర్చుని వెళ్ళమంటే వెళ్ళనంది. అది ఊరువెలపల పొలం. ఊరుకు ఎంతోదూరంలేదు. రెండుమూడు ఫర్లాంగుల దూరం వుంటుంది. శశి ఆ పొలంఎరుగును. నాలుగైదుసార్లు వెళ్ళివచ్చింది. తిరపతమ్మ గిన్నెలో అన్నంపెట్టి భద్రంగా పైన గుడ్డకట్టి శశి నెత్తిమీద పెట్టి పొలంలో యిచ్చి రమ్మంది. శశి బయలుదేరింది. రాత్రి కురిసిన వర్షానికి నేలంతా బురదగా వున్నది. ఆ బజారు మలుపుతిరిగాక ఓవీధిలో గంగిరెద్దమేళం మోగుతున్నది. శశి ఎక్కడా నిలబడకుండా వెళ్ళిపోతున్నది. ఊరుదాటి డొంకనే నడుస్తున్నది. బాటప్రక్క చెట్లమీద ఏవోపిట్టలు యింపుగా కూస్తున్నవి. గొడ్లు తొక్కడం వల్ల వర్షాకాలమంతా ఆ డొంక రొచ్చురొచ్చుగా వుంటుంది. శశి అదివరకు యెప్పుడూ ఇట్లా పొలం వెళ్ళిందికాదు. బురదలో కాలుపెట్టి యెరగదు. మెల్లిగా ఆ బురదలో నడిచిపోతున్నది. ఇంతలో వెనకనించి గొడ్లమంద రావడం చూసి యెక్కడ పొడుస్తాయోనని భయంతో శశి పక్కకు తప్పుకున్నది. ఎంత తప్పుకున్నా మందలో ఓ గేదె తలవిసరడంలో శశి పరిగెత్తబోయి కాలుజారి కిందపడిపోయింది. నెత్తిమీద అన్నపుగిన్నె అంత దూరంలో బాట ప్రక్క నిలిచివున్న వర్షపునీళ్ళ గుంటలో పడిపోయింది. బాటనే వెళ్ళుతున్న ఎవరో ఒకాయన శశిని లేవతీశాడు. ఒంటినిండా బట్టలనిండా బురద గొట్టు కున్నది. అన్నంగిన్నె గుడ్డకట్టివున్నా బురదనీటిలో పడటంవల్ల అన్నమంతా చెడిపోయింది. శశి ఏడుస్తూ అన్నంగిన్నె నెత్తినపెట్టుకుని తిరిగి యిల్లుచేరు కుంది. శశి బట్టలనిండా, అన్నంగిన్నెనిండా, బురదచూసి తిరతమ్మ కోపంతో

"ముదనష్టపు పిల్ల, అన్నం నీ మొఖాన పెట్టుకున్నావా ?" అంటూ శశినిరెండు వడ్డించింది. శశి ఎవర్ని చూసుకుని ఏడుస్తుంది. శబ్దం పైకి రాకుండా లోలోపల కుమిలిపోయింది. తర్వాత కొంతసేపటికి హనుమయ్య నకనకలాడుతూ ఇంటికి వచ్చి భోజనం చేశాడు.

ఆ మర్నాడు ఉదయం సావిత్రీ, శశీ ఇంటి యెదురుగా వున్న ఖాళీ స్థలంలో పేడ పోగేస్తున్నారు. అట్లా పేడపోగువెయ్యడంలో నిమగ్నమైవున్న శశికి "శశీ" అన్న పిలుపు వినబడగా తలమెత్తి చూచింది. రామం వీధిలో, నిలుచుని వున్నాడు. శశికి ప్రాణంలేచి వచ్చింది. రామం వయస్సు పన్నెండేళ్ళుంటవి. రామానిది వాళ్ళవూరు. వాళ్ళ యింటిప్రక్కనే రామంయిల్లు. రెండు కుటుంబాలు ఎంతో సన్నిహితంగా ఉండేవి. చిన్నప్పటినించీ తానూ రామం కలిసి ఆడుకున్నారు. శశి చేతిలోపని వదిలేసి ఓ గంతులో రామం దగ్గరకు వచ్చింది. "ఇక్కడ వున్నావేం శశీ ?" అని అడిగాడు రామం.

శశి బిక్కమొగంతో "అమ్మ చచ్చిపోయింది. నన్ను వీళ్ళు తీసుకొచ్చారు" అని చెప్పింది.

"ఎప్పుడు చచ్చిపోయింది ? ఎందుకు వీళ్ళు తీసుకొచ్చారు ?" అని అడిగాడు.

"ఆ వూళ్ళో సత్రంలో వుంటే అమ్మ చచ్చిపోయింది. వీళ్ళు నన్ను తీసుకొచ్చారు" అంది.

"నేనూ, అమ్మా, తాతగారింటికి వచ్చాం. వెళదాం వస్తావా" అన్నాడు.

"ఆ వస్తా" అంటూ శశి రామంవెంట వెళ్ళడానికి వుద్యుక్తురాలవుతూ వుండగా, అవతల వీళ్ళమాటలన్నీ వింటున్న సావిత్రి తల్లిని కేకవేసిపిలిచింది. తిరపతమ్మ వెంటనేవచ్చి సంగతి విని "ఎవరివి అబ్బాయి నువ్వు ?" అని అడిగింది విసురుగా.

"మాది కొల్లిపర. మావూరే వీళ్ళది" అన్నాడు.

"అయితే ఏమంటావు ? పో ! పో !" అంటూ తిరపతమ్మ శశి రెక్కపుచ్చుకుని దూకుడుగా లోనికి తీసుకెళ్ళింది.

ఆ సాయంత్రం రామం అతని తల్లి, కలిసి వాళ్ళింటికివచ్చారు. రామం తల్లి శశిని పంపమని అడిగింది. తిరపతమ్మ "పాపం తల్లిలేని పిల్లగదా అని

జాలిపడి మేం తీసుకొస్తే యిదో వేషం వేసుకుని వచ్చారా? పిల్లను తీసుకెళ్ళి ఏం చెయ్యాలని? పంపం పోండి" అని చెడామడా నాలుగు పెట్టగా వాళ్ళు వెళ్ళి పొయ్యారు.

ఆ తెల్లవారి ఏదో పనిమీద తిరపతమ్మ తండ్రి వచ్చాడు. వాళ్ళది దగ్గరలో వున్న ఓపల్లె. వచ్చినపని చూసుకుని అతడు ఇంటికి వెళ్ళిపోతూవుంటే సావిత్రి నేనుగూడా వస్తానని తాతవెంట పడ్డది. అప్పుడు తిరపతమ్మ ఆలోచించి, ఎందుకయినా మంచిదని శశినిగూడా తండ్రివెంట వాళ్ళవూరు పంపింది.

అది చిన్నపల్లె. అన్నీపూరియిళ్ళు. పెంకుటిళ్ళు తక్కువ. సావిత్రికి తాతగారియిళ్ళు కొట్టిన పిండికావడంలో పెట్టెలోనించి వెంకటేశ్వర్లు బొమ్మతెచ్చి శశిని "ఆడుకుందాం రమ్మ"ంది. శశి, రామం కనిపించిన దగ్గర నించి మరీ బెంగగా వుంటున్నది. ఆ అమ్మాయి మనసంతా రామంమీదకే పోతున్నది. సావిత్రి బలవంత పెట్టడంలో శశి యెట్లాగో ఆడుకున్నది. ఆ పగలు గడిచిపోయింది. చీకటిపడ్డది. సావిత్రి అమ్మమ్మ సావిత్రికి, శశికి అన్నం పెట్టగా తిని ఇద్దరూ ఓ మంచంమీద పడుకుని నిద్రపొయ్యారు.

శశికి తెల్లవారుఝామున గప్పున మెళుకువ వచ్చి కళ్ళువిప్పి చూసింది. తానూ రామం, రామంగారి యింట్లో ఆడుకుంటున్నారు. రామం "నేను మేష్టార్ని. పుస్తకం తీసుకో. చదువు చెపుతా" నన్నాడు. శశి పుస్తకం తీసుకుని చదువుతున్నది. ఇంతలో "ఇక్కడ వున్నావా! శశి" అంటూ వాళ్ళమ్మవచ్చి రామం తల్లితో యేదో మాట్లాడుతున్నది. శశికి గుప్పున మెళుకువవచ్చి చూస్తే ఏముంది మట్టిగోడలు, పూరికప్పు కనిపించినవి. అది రామం యిల్లు కాదు. శశికి దిగులు వేసింది. స్వర్గంలోనించి నరకంలో పడ్డట్లయింది. ఇక అక్కడ వుండటానికి సుతరామూ మనస్కరించలేదు. మంచంమీదనించి లేచి నిలుచుంది. సావిత్రి గుర్రుపెట్టి నిద్రపోతున్నది. శశి వీధిలోకి వచ్చింది. మసక చీకటిగా వుంది. తెల్లవారటానికి ఎంతో వ్యవధిలేదు. చెట్లమీద పక్షులు కూస్తున్నవి. అప్పుడే పనుల్లోకివెళ్ళేవాళ్ళు వెళ్ళుతున్నారు. వచ్చిన దారివే వెళ్ళితే రామాన్ని ఎంతలో కలుసుకోవాలి అనుకుని-శశి నడవడం మొదలు పెట్టింది. ఎవరో దాసరి తంబురా మీటుకుంటూ, పాటలు పాడుతూ వెళ్ళు

తున్నాడు. ఆ బజారుమలుపు తిరిగేసరికి ప్రక్కవీధిలోనించి అంబోతు రంకె వేస్తూ వస్తున్నది. శశి పరిగెత్తుకుంటూ ఆవీధి దాటింది.

శశి ఊరుదాటి నడుస్తున్నది. అక్కడికి శశి వెళ్ళేగ్రామం మూడు మైళ్ళు వుంటుంది. పాపం, ఆ పసికందు దీక్షతో వెళ్ళుతున్నది. ఎవరో అరక కట్టుకొని పొలం వెళ్ళుతున్నారు. కొందరు ఆడవాళ్ళు గడ్డిగంపలు పుచ్చుకుని పొలానికి వెళ్ళుతున్నారు. శశి వాళ్ళవెనక నడుస్తోంది. కొంత దూరంవెళ్ళాక వాళ్ళు అడ్డదారిగుండా పొలం వెళ్ళిపోయారు. శశిఒక్కతే నడిచి వెళ్ళుతున్నది. బాట అక్కడక్కడ బురదగా వున్నది. కొంతదూరం వెళ్ళాక గొర్రెలమంద వస్తూవుంటే బాటప్రక్క చెట్టుదగ్గర నిలబడ్డది. చెట్టుపైన యేదో పక్షివాలడం వల్ల ఆకులనుండి జలజలా వర్షపు నీటిబిందువులు పడినవి. శశి పరికిణీతో తల తుడుచుకుని గొర్రెలమంద దాటిపోగా బాటనేపడి నడుస్తున్నది.

అప్పటికి సూర్యోదయమైంది. చీకట్లుపోయి, లోకమంతా వెలుతురుతో నిండిపోయింది. చెట్లు, పక్షులు, పొలాలు అన్నీ స్పష్టంగా కనిపిస్తున్నవి. జీవ కోట్లు మత్తువదలి తమ దినచర్యకు ఉపక్రమిస్తున్నవి. ఆకాశంలో కొంగలు బారులుతీర్చి వెళ్లుతున్నవి. బాటప్రక్క వర్షానికి నిలిచిన మడుగు దగ్గర ఏవో పిట్టలు వాలినవి. కనుచూపుమేర అటూ యిటూ రెండు ప్రక్కలా పచ్చని పొలాలు. శశి అట్లా నడిచి వెళ్లిపోతున్నది. మార్గమధ్యంలో బొమ్మలాటవాళ్లు యిద్దరు మగవాళ్ళు ఒక ఆడమనిషి మృదంగం మొదలైన పరికరాలూ ఏవో పెట్టాబేడా మోసుకుని వెళ్ళుతున్నారు. ఇంకా కొంతదూరం వెళ్ళాక ఓ రెండెడ్ల బండి సామాను వేసుకుని వెళ్ళుతున్నది. శశి అట్లానే నడిచిపోతున్నది. అడ్డ దారిగుండా ఎవరో యిద్దరు ఆడవాళ్ళు నెత్తిన పిల్లల ఆటవస్తువులు గిలక్కా యలు లక్కపిడతలు మోసుకుంటూ వచ్చి ఆబాటనే నడిచి వెళ్ళుతున్నారు. ఆ బాటలోనించి చీలి ప్రక్కదారులు రెండుమూడు కనిపించినా వాళ్ళంతా ఆ బాటనే వెళ్ళుతూ వుండడం వల్ల శశి దారితప్పి వాళ్ళతోపాటు నడిచివెళ్లి మరి ఒక గ్రామం చేరింది.

శశికి ఆ గ్రామం కొత్తగా కనిపించింది. ఇళ్ళన్నీ వెల్లలువేసి అలంక రింపబడి వున్నవి. గ్రామమంతా ఏదో అలజడిగా వున్నది. దూరాన్నించి డప్పుమోత, ఏవో బూరల ధ్వనులు అస్పష్టంగా వినవస్తున్నవి. అప్పుడు

గ్రామంలో తిరునాళ్ళ జరుగుతున్నది. ప్రతి సంవత్సరం అదే రోజుల్లో తిరు నాళ్ళ జరుగుతుంది. స్వామిని దర్శించుకోడానికి ఎక్కడెక్కడనించో వేలాది యాత్రీకులు వస్తూవుంటారు. నాలుగురోజులు వుత్సవాలు వైభవంగా జరుగు తవి. అది చివరిరోజు. జనం విపరీతంగా వచ్చారు. ఏ వీధిలో చూచినా జనమే. శశి జనాన్నితప్పుకుంటూ బజారునే నడుస్తున్నది. మిఠాయి దుకాణాలు, బొమ్మల దుకాణాలు కంచరసామానుకొట్లు, రంగులరాట్నాలు మెన్నోవచ్చినవి. అప్పుడు ఉదయం పదిగంట లవుతుంది. శశి నడిచి నడిచి వుండడం వల్ల కాళ్ళు నొప్పు లేస్తున్నవి. ఆకలి గూడా వేస్తున్నది. ఆ జనంలో ఎరుగున్నముఖం ఒకటీ కని పించదు, ఏముఖం చూచినా కొత్తదే. ఒక్కతే బిక్కు బిక్కు మంటూ తిరుగు తున్నది.

అప్పుడు మధ్యాన్నం పన్నెండుగంట లవుతుంది. ఆ సాయంత్రమే రథోత్సవం. జనం కొట్లకేసి ఎగబడి యెవరికి కావలసినవి వాళ్ళు కొనుక్కుం టున్నారు. మిఠాయి, బొమ్మలు యెగిరిపోతున్నవి. ఒక బొమ్మలకొట్లో ఎవరో పిల్ల, బొమ్మలు దొంగిలించి పరిగెత్తగా కొట్టుమనిషి తరుముకుని వెళ్ళాడు. ఆ దొంగతనం చేసిన పిల్ల ఆ జనంలో యెక్కడ తప్పించుకుపోయిందో-అదే సమయానికి అటువైపు మాసిన బట్టలతో వెళ్ళుతున్న శశిని పట్టుకుని కొట్టు వాడు తన కొట్టుముందుకు లాక్కొచ్చి "బొమ్మలు ఎక్కడ దాచావో? చెప్పు" అని గుడ్లురుముతూ దండిస్తున్నాడు. శశి హఠాత్తుగా తనమీద పడ్డ ఆ అభాం డానికి కంగారు పడిపోయి జవాబు చెప్పకుండా యేడుస్తున్నది. శశి జవాబు చెప్పకపొయ్యేసరికి కొట్టువాడు పరుషంగా మాట్లాడుతూ మరింత రెచ్చి పోతున్నాడు.

ఇంతలో బజారునే వెళ్ళుతున్న ఓ యువతి, ఓ యువకుడు చటుక్కున అక్కడ నిలబడ్డారు.

"ఏ మనిషి, ఆ అమ్మాయిని యెందుకట్లా నిర్బంధిస్తావు?" అని తీవ్ర స్వరంతో అన్నది యువతి.

కొట్టువాడు వాళ్ల దుస్తులూ వాళ్ళ వైఖరీ చూసి వుద్యోగస్తులని జంకి శశిని వదిలిపెట్టాడు. శశి తేరుకుని తనను వెనక వేసుకువచ్చిన యువతికేసి చూసింది. ఆవిడ తన మేనత్త గౌరి. శశిప్రాణం లేచివచ్చింది. "అత్తయ్యా!

అమ్మ చచ్చిపోయింది" అంటూ గౌరిని కావిలించుకుని బావురుమంది. గౌరి సంగతులు అడిగి తెలుసుకుని ఎంతో విచారపడి ఆప్యాయంగా శశిని తనవెంట తీసుకెళ్ళింది.

౭

అప్పుడు మధ్యాన్నం పన్నెండుగంటలవుతుంది. రాధాకృష్ణ అన్నం తిని చేత్తో పుస్తకం పట్టుకుని డాబాపైకి వెళ్ళాడు. పైన అన్నీ గదులు. ముందుభాగం హాలు. హాల్లో నాలుగైదు కుర్చీలు వేసివున్నవి. రాధాకృష్ణ ఓ కుర్చీలో కూర్చుని పుస్తకం తెరిచేంతలో వీధిలోనించి బ్యాండుమేళం వినిపించగా డాబా ముందుకు వచ్చి నిలబడ్డాడు. అది మాఘమాసం. బయట ఎండ జోరుగా కాస్తున్నది. ఎవరో పెళ్ళివారు వూరేగుతూ వస్తున్నారు. వూరేగింపు వారి మేడను సమీపించింది. ముందు బ్యాండుమేళం. తర్వాత పెళ్ళిపెద్దలు, ఆవెనక పెళ్ళికొడుకూ, పెళ్లికూతురూ వున్న కారు. అటు తర్వాత పేరంటాళ్ళు అలంకరించుకుని నడుస్తున్నారు. కారులో పెళ్లికూతురూ పెళ్లికొడుకూ మెళ్ళో పూలదండలతో కూర్చున్నారు. పెళ్లికూతురు బక్కపలచగా వుంది. పెళ్ళికొడుకు లావుగా రుబ్బుడు పొత్రంలా వున్నాడు. ఎదుటి ఇళ్ళలోనుంచి ఆడవాళ్ళు గుమ్మంలో నిలబడి చూస్తున్నారు. ఆ వూరేగింపు వారి మేడ దాటి సాగి వెళ్లిపోయింది. బ్యాండువాళ్ళు ఏదో సినిమా కీర్తన వాయిస్తున్నారు. రాధాకృష్ణకు ఆ కీర్తన యెంతో బాగుంది. వింటూ అట్లాగే నిలబడ్డాడు. ఆ వూరేగింపు బజారుమలుపు తిరిగింది. ఆ వాయిద్యం సన్నసన్నగా దూరమైపోయింది. ఎదురుగా పెట్టె దుకాణంలో ఓ అమ్మాయి కిళ్లీ కొంటూవుంది. ఇద్దరు స్త్రీలు గంపలు నెత్తిన పెట్టుకుని వీధినే వెళుతున్నారు. ఓ క్షురకవాడు పైకిలుకు సంచి తగిలించి తొక్కుని వెళుతున్నాడు. పైనించి కళ్యాణి ఎక్కడకెళ్లి వస్తున్నదో అనుకున్నాడు. కళ్యాణి వెనకమాలే తెల్లచీరె కట్టుకుని చేతిలో సంచి పట్టుకుని ఓ స్త్రీ వస్తున్నది. రాధాకృష్ణ ఆ స్త్రీని చూసేసరికి అతని ప్రాణం లేచివచ్చింది. అంతా వాళ్ళమ్మమాదిరిగానే వున్నది. చేతిలో సంచిగూడా వాళ్ళమ్మ చేతిలో వుండే బ్లూరంగుదే. అమ్మ తనవే వెదుక్కుంటూ వస్తున్నది. తానిక్కడ వున్నట్లు అమ్మకేం తెలుసుగనక ? డాబా దిగి ఎదురు వెళదాం. అతని మనసు

పురకలెత్తుతున్నది. ఇంతలో ఆ స్త్రీ కొంత దాపులోకి వచ్చింది. తీరా చూస్తే వాళ్ళమ్మకాదు. ఎవరో మనిషి. అతని సంతోషమంతా భగ్నమైపోయింది. ఈ సంఘటనతో రాధాకృష్ణకు తల్లి గుర్తుకు వచ్చి దిగులు ఆవరించింది. అమ్మ యిప్పుడు ఎక్కడుందో? బహుశా తాతగారింటిదగ్గరే వుంటుంది. అమ్మ యిప్పుడు ఏంచేస్తూ వుంటుంది? అన్నంతిని పడుకుంటుంది? శశి మట్టితో బొమ్మలు చేసుకుంటూ వుంటుంది. అమ్మ ఎంత చెప్పినా పాఠాలు చదవదు. బొమ్మలు చెయ్యడమంటే దానికి సరదా.

ఇంతలో "క్రిష్ణా" అన్న పిలుపువిని వెనక్కితిరిగి చూశాడు. కళ్యాణి చేతిలో పుస్తకంతో దగ్గరికివచ్చి "ఏమిటి చూస్తున్నావు?" అన్నది.

"ఏమీలేదు" అన్నాడు రాధాకృష్ణ.

"అదిగో అటుచూడు కృష్ణా, గళ్ళలంగా కట్టుకుని ఆ ఆడమనిషివెంట వెళ్ళుతున్నదే. ఆ అమ్మాయి నా క్లాసే. సరిగా బడికిరాదు. వట్టిమొద్దు. పాఠం రాలేదేమని పంతులమ్మ అడిగితే 'మాఅమ్మ లేవలేదు, నా చెల్లెలికి జ్వరం వచ్చింద'ని చెపుతుంది" అన్నది.

"సరేగాని నువ్వు పైనించి వస్తున్నావు ఎక్కడినించి" అని అడిగాడు.

"రాత్రి నాన్న మద్రాసునించి తెచ్చిన వస్త్రాపూలూ కాసిని పట్టుకెళ్ళి మా పంతులమ్మగారికి యిచ్చివస్తున్నా" అంది.

"ఇవ్వాళ శలవుకదూ బడిలేదుగా? మీ పంతులమ్మగారి యిల్లు నీకు తెలుసా?" అన్నాడు.

"ఆఁ ఎందుకు తెలియదు; యీబజారునేవెళ్ళి ఓసందులోగుండా పోవాలి" అంది.

ఇద్దరూ చెరో కుర్చీలో కూర్చుని చదువుకోవడం మొదలుపెట్టారు. రాధాకృష్ణ వచ్చి అప్పటికి ఆరుమాసాలు కావచ్చింది. మధ్యలో హైస్కూల్లో చేర్చటానికి వీలులేక పోయినందున లక్ష్మణరావుగారు రాధాకృష్ణని ఒక ప్రయివేటు స్కూల్లో చేర్చారు. కళ్యాణి, రాధాకృష్ణ బడివిడిచి యింటికివచ్చిన తర్వాతనూ శలవరోజుల్లోనూ యిద్దరూ డాబాయెక్కి చదువుకుంటారు.

ఇంతలో ఎందుకో నాగరత్నం అక్కడకు వచ్చింది. నాగరత్నాన్ని చూస్తే రాధాకృష్ణకు భయం. నాగరత్నం రాధాకృష్ణకేసి కొరా కొరా చూస్తుంది.

అందువల్ల రాధాకృష్ణ నాగరత్నాన్ని ఏమీ అడగడు. రాజ్యలక్ష్మమ్మగారే రాధాకృష్ణకు అన్నం అదీ పెడుతుంది. నాగరత్నం పైకివచ్చి "ఒరే క్రిష్టా!" అన్నది.

నాగరత్నం తనను యెప్పుడూ ఇంత సౌమ్యంగా, ఇంత శాంతంగా పిలిచి ఎరగదు. ఎప్పుడైనా పిలవవలసివస్తే ఒరే కుర్రోడా అని యీసడింపుగా పిలుస్తుంది. యివ్వాళ తనను పేరుతో పిలిచేటప్పటికి ఎందుకబ్బా ఇవ్వాళ ఇలా పిలుస్తుందనుకుంటూ రాధాకృష్ణ కుర్చీలోనించి లేచినిలబడి "ఏమిటండీ ?" అన్నాడు.

"ఒకపని చేసిపెడతావ్ ?" అన్నది.

ఇప్పుడు చెప్పబోయే ఆ పనేమిటో! అసలే తానంటే ఆమెకు గిట్టదు. ఒకసారి తనను వెళ్ళగొట్టిందిగూడా. అప్పుడు రాధాకృష్ణకు కథలోవిన్న రాజు చిన్నభార్య, తన సవతికొడుకును సప్త సముద్రాల అవతల మర్రిచెట్టు తొర్రలో వున్న పంచెవన్నెల రామచిలుకను తెమ్మని పంపిన వుదంతం తప్పక గుర్తు వచ్చి వుండాలి. రాధాకృష్ణ "ఏం పని" అన్నాడు జంకుతూ.

తీరావింటే ఆమె చెప్పినపని ప్రమాదకరమైందేమీకాదు. అర్ధరూపాయి బిళ్ళ రాధాకృష్ణ చేతులోపెట్టి "బజారుకువెళ్ళి పుస్తకాలు అమ్మేవాళ్ళ దగ్గిర వ్రత కథలు పుస్తకంఒకటి తెచ్చిపెట్టమ"ని చెప్పింది. చెప్పి అంతటితో వూరుకుందా? రాధాకృష్ణ మెట్లుదిగేవరకూ "అర్ధరూపాయి భద్రం" అని విసుగు లేకుండా చెపుతూనే వున్నది.

ఆమర్నాడుగూడా రాధాకృష్ణ అదే సమయానికి బడినించివచ్చి అన్నంతిని పుస్తకం చేత్తోపుచ్చుకుని డాబాపైకి ఎక్కాడు. కళ్యాణి అక్కడ కుర్చీలో కూర్చుని ఏదో వ్రాసుకుంటూవుంది. రాధాకృష్ణగూడా ఓ కుర్చీలో కూర్చుని "యివ్వాళ మీ పంతులమ్మ నాకు కనిపించిం" దన్నాడు.

కళ్యాణి వ్రాయడం ఆపి తలఎత్తిచూచి "ఎక్కడ ?" అని అడిగింది.

"నేను యిందాక బడికి వెళుతూవుంటే మీ పంతులమ్మ మార్కెటులో నించి సంచితో కూరలు పట్టుకెళుతూ వుంది" అన్నాడు.

"తల్లో పూలు పెట్టుకుందా ?"

"నేను సరీగా చూడలేదు."

"నిన్న నేను యిచ్చినపూలు పెట్టుకుందేమోనని?"

"వూరికేవస్తే ఎందుకు పెట్టుకోదు? రేపు మీకు బడివుందా?"

"ఆఁ, అందుకనే కాంపోజిషన్ వ్రాసుకుంటున్నాను. నువ్వు అన్నం తిన్నావా?"

"ఆఁ"

"ఎవరు పెట్టారు? అమ్మ పెట్టిందా?"

"అమ్మే పెట్టింది."

"అమ్మ అన్నం తినలా. పొద్దున కాఫీ గూడా తాగలా."

"ఎందుకని?"

"అత్తయ్యా, అమ్మా అరుచుకున్నారు."

అందుకనే కామాలు - తాను బడినించి వచ్చేసరికి రాజ్యలక్ష్మమ్మగారు గదిలో పడుకుని వుంది. రోజూ తాను బడినించి రాగానే పిలిచి అన్నం పెట్టేది. గదిలో పడుకుని వుండడం వల్ల వంట్లో బాగుండలేదేమో అనుకున్నాడు. తర్వాత కాసేపటికి రాధాకృష్ణ రావడంచూచి ఆమె లేచి అన్నం పెట్టింది. అప్పుడు రాధాకృష్ణ పుస్తకం అక్కడపెట్టి గబ గబా కిందికిదిగి వెళ్ళిచూస్తే రాజ్యలక్ష్మమ్మగారు యిందాక పడుకున్న గదిలోనే పడుకునివుంది. రాధాకృష్ణ లోపలికివెళ్ళి తలుపుదగ్గరగా నిలుచున్నాడు. రాజ్యలక్ష్మమ్మగారు రాధాకృష్ణను చూచి "ఏం రాధాకృష్ణా" అంది. రాధాకృష్ణ పలకలేదు.

"పుస్తకాలకేమన్నా డబ్బులు కావాలా?" అంది.

రాధాకృష్ణ దానికి గూడా జవాబు చెప్పలేదు. తలవంచుకుని నిలబడి వున్నాడు. అతని ముఖంలో ఏదో ఆవేదన వ్యక్తమవుతూ వుండడం గమనించి రాజ్యలక్ష్మమ్మగారు "నిన్ను యెవరైనా ఏమైనా అన్నారా?" అని అడిగింది.

"ఊఁహు" అన్నాడు తలవంచుకుని.

అప్పుడు రాజ్యలక్ష్మమ్మగారు తల్లిమీద కేమన్నా ధ్యాస పోయిందేమో అనుకుని "చెప్పకపోతే ఎలా తెలుస్తుంది?" అంది.

"మీరు అన్నం తినలేదటగా!" అతనికంఠం రుద్ధమైంది.

ఆ మాటతో ఆమె హృదయం ఆర్ద్రమైంది. "ఎవరుచెప్పారు నీకు కృష్ణా" అని అడిగింది.

"కల్యాణి"

"తింటాలే నాయనా! అందుకేనా నువ్వు వచ్చింది" అంది.

ఇంతలో కల్యాణిగూడా వచ్చి "అన్నం తిందుగాని లె" మ్మని తల్లి చెయ్యిపట్టుకుని లేవదీసి కూర్చోపెట్టింది. అప్పుడు రాజ్యలక్ష్మమ్మగారు యిద్దరు పిల్లలూ తనను గురించి అట్లా యిదికావడంచూసి లేచివెళ్ళి భోజనంచేసింది.

ఆ సాయంత్రం దాదాపు ఆరుగంటలకు వీధి గుమ్మందగ్గర కారుహారన్ మ్రోగింది. డ్రైవరు లోపలికివచ్చి టికెట్లు "అందటంలేదండి. మనం కాస్త పెందలాడే వెళ్ళడం మంచిది" అని చెప్పాడు రాజ్యలక్ష్మమ్మగారితో. ఆపూళ్ళో రౌజులుమారాయి చిత్రం ఆడుతోంది. సినిమాకి వెళదాం అనుకున్న దగ్గరనించి కల్యాణి సంతోషానికి మేరలేదు. గంటసేపటినించి ముస్తాబవుతోంది. పెట్టె తెరచి ఏ బట్టలు వేసుకుందామన్నా మనసొప్పడంలేదు. అందులోవున్న బట్ట లన్నీ బాగానే వున్నవి. అన్నీ అదంగానే కపిసున్తున్నవి. ఏబట్టలు వేసుకోడమో ఆలోచించి ఆఖరుకు రోజా జాకెట్టు, పసుపురంగుమీద బ్లూ గీరలువున్న సిల్కు లంగా తీసి కట్టుకుని గోడనవున్న అద్దందగ్గరకివచ్చి తిలకం పెట్టుకునివెళ్ళి కారులో కూర్చుంది. రాజ్యలక్ష్మమ్మగారు ప్రయాణమై హాల్లో కుర్చీలో కూచుని వున్న రాధాకృష్ణను, "రా కృష్ణా" అనగా రాధాకృష్ణ ఆమెవెంటనేవెళ్లి కారులో కూర్చున్నాడు. కారుకదిలి వెళ్లిపోయింది.

తర్వాత వారంరోజులకు ఒకనాటి అపరాహ్ణం మూడు గంటలవేళ లక్ష్మణరావుగారు "అమ్మాయీవాళ్ళు గన్నవరంనించి యీబండిలో దిగుతారు. తీసుకుర" మ్మని డ్రైవరుతోచెప్పి కారును రైలుస్టేషనుకు పంపాడు. కారు పంపి లక్ష్మణరావుగారు కచేరిహాల్లో కూర్చుని ఎవరితోనో వ్యవహార విషయాలు మాట్లాడుతున్నాడు. ఎల్లుండి శుద్ధదశమి కల్యాణి పుట్టినరోజు పండగ. ఇంకా కాసేపటికి తన అక్కావాళ్ళు వస్తారని కల్యాణి సంబ్రాలు పడుతున్నది. కాసే పటికి వీధిలో కారుహారన్ మ్రోగింది. కల్యాణి ఒక పరుగులో వీధిలోకి వెళ్లింది. అక్కా బావా పిల్లలూ కారు దిగుతున్నారు. కల్యాణి అక్కచంకలో

వున్న రఘును యేడ్చినకొందికి తీసుకుని యెత్తుకుంది. "ఏం పిల్లా, ఎదురొచ్చావు? నీపెళ్లికి వచ్చాం" ఇవి బావ సుందర్రావు అన్నమాటలు.

కల్యాణి "పోబావా" అంటూ రఘుని తీసుకుని లోపలకి పరుగుపెట్టింది.

"పిల్లణ్ణి పడేసేవు - నిదానంగా నడవ్వే" అని కేకేసింది వాళ్ళక్క శ్యామల.

ఐదేళ్ళ పద్మను చెయ్యిపట్టుకుని నడిపించుకుంటూ దంపతులిద్దరూ లోపికి వెళ్లి గడపమెట్లెక్కుతూ వుండగా; రాజ్యలక్ష్మమ్మగారు యెదురువచ్చి "పిల్లవాడు అట్లానలిగి పొయ్యాడేం అమ్మాయి?" అని అడిగింది.

"ఈమధ్య వాడికి అజీర్ణం పట్టుకుంది - మళ్ళా కోలుకోలేదు" అంది శ్యామల.

కచేరిహాల్లో లక్ష్మణరావుగారు ఎవరితోనో మాట్లాడుతున్నవాడల్లా లేచి అక్కడికివచ్చి అల్లుణ్ణి పరామర్శచేసి కల్యాణి దగ్గరవున్న మనవణ్ణి యెత్తుకుని మురిసిపొయ్యాడు. ఇంతలో నాగరత్నం ఆక్కడికివచ్చి "అంతా బాగావున్నారా అమ్మా, ఎన్నాళ్ళనాడో నిన్ను చూసినట్టుగా వుంది. అందరిమల్లే కాకుండా నువ్వు వెళ్లినచోటగూడా మంచిదాన వనిపించుకుంటున్నావు. యెప్పుడూ నీ మాటే అనుకుంటూవుంటాను, అబ్బాయిగూడావచ్చి శాన్నాళ్ళయింది. యిటు రావడమే లేదు." అంది.

సుందర్రావు, శ్యామల లోపికివెళ్ళి కాళ్ళు కడుక్కుని మధ్యహాల్లోకివచ్చి కూర్చున్నారు. కల్యాణి బావదగ్గర కూర్చుంది. రాజ్యలక్ష్మమ్మగారు పద్మను యెత్తుకుని వాళ్ళ దగ్గరగా నిలుచుని కూతుర్ని యోగక్షేమాలు అడిగి తెలుసుకుంటూవుంది.

"బాగా చదువుకుంటున్నావా?" అని అడిగాడు కల్యాణిని సుందర్రావు.

"ఆహా" అన్నది కల్యాణి.

"బాగా చదువుకోకపోతే మంచి మొగుడురాడు- నీ యిష్టం" అన్నాడు.

"పోబావా నువ్వు మరీని" అంది కళ్యాణి.

"రేపు యెట్లయినా పుట్టినరోజు పండుగ్గా; పనిలోపని- ఎవర్నన్నాచూసి ముడిపెట్టేస్తే సరిపోతుంది" అన్నాడు.

శ్యామల అందుకుని "చిన్నపిల్ల దానికి ఇప్పుడేం తొందరలేండి. యీాదేరి యింటకూర్చుని పెనిమిటికోసం కలవరిస్తున్న మీ చెల్లెలికి ముందు తీసుకు రాండి" అంది.

"అక్క చెల్లెళ్ళి పెనకేసు కొస్తున్నదే! యింట్లో నుంచుకుంటావా? రేపు చెయ్య వెట్లాగు?" అన్నాడు.

"ఎందుకు చెయ్యం లేండి - యిప్పుడు చెల్లెలికి తెచ్చేటందుకు యింత పతమత మైపోతున్నారా! రేపు మరదలికి వెదికేటప్పుడు కనపడుతుంది. యిప్పుడు చులాగ్గా అనడంకాదు" అంది.

"వెయ్యిమీద వెయ్యిపోసి తీసుకురాము. మీ నాయనకేం, కుబేరుడు" అన్నాడు.

"అల్లుళ్ళ కళ్ళకు మామలంతా అలాగే కనిపిస్తారు" అంది శ్యామల.

"ఏదో అంతమాత్రపుది కానివ్వండి నాయనా" అని ముసి ముసి నవ్వులు నవ్వుకుంటూ రాజ్యలక్ష్మమ్మగారు లోనికి వెళ్ళిపోయింది.

"ఇదిగో బావా, సినిమాలో ఒకబ్బాయి అంతా నీలాగే వున్నాడు" అంది కళ్యాణి.

"నాలాగే!"

"ఆ కళ్ళూ, ముక్కూ చెవులూ అంతా నీ మాదిరిగానే వున్నాడు బావా."

"వుండి?"

"ఆ అబ్బాయి పిల్లిని చూచినా, కుక్కను చూచినా జడుసుకుంటాడు."

"జడుసుకుని ఏంచేశాడు? చెప్పు - భార్యని కావలించుకున్నాడా" శ్యామల అందుకుని "పోండి మీరు మరీని" అంది.

"వినవేం బావా? ఆ అబ్బాయి యింట్లో గండుపిల్లిని చూచి భయపడి వెనక్కుపోయి పొయ్యిదగ్గర గిన్నెలో అప్పుడే వంపిన వేడి వేడి గంజిలో కాలువేసి ఇక లబోమంటూ గంతులు పెట్టాడు" అని విరగబడి నవ్వింది కళ్యాణి. శ్యామలగూడా నవ్వింది.

"అంతా యిప్పుడే నవ్వేయ మాకు. రేపటికి కొస్త దాచుకో" అన్నాడు బావ.

రాజ్యలక్ష్మమ్మగారు రెండు వెండి కప్పులతో కాఫీ పట్టుకుని గుమ్మం అవతల నిలబడి "ఇట్లా రావే అమ్మాయి" అని కేక వెయ్యగా కల్యాణి తల్లి దగ్గరకు వెళ్ళింది. "రెండూ ఒకసారే పట్టుకెళితే పడేస్తావేమో ? ముందు వకటి పట్టుకెళ్ళి బావకిచ్చిరా" అంది.

ఇంతలో బడినించి రాధాకృష్ణ రావడం చూసి రాజ్యలక్ష్మమ్మగారు రాధాకృష్ణను పిలిచి రెండోకప్పు అతనికిచ్చి పంపింది.

కల్యాణి కాఫీ బావకిచ్చి "పుచ్చుకోవేం బావా ? కుడితినీళ్ళని సందేహిస్తున్నావా ?" అంది.

"ఆ సందేహం ఎంతమాత్రం లేదు పిల్లా, వేడిగా వుందని" అన్నాడు. ప్రక్కగా కూర్చున్న భార్యకు కాఫీ తెచ్చి యిచ్చిన రాధాకృష్ణను చూసి సుందర్రావు "యీ కుర్రాడెవరు ?" అన్నాడు. గుమ్మంలోనున్న రాజ్యలక్ష్మమ్మగారు రాధాకృష్ణనుగురించి ఫలానా అని చెప్పింది.

సుందర్రావు కాఫీ తాగి బజారుకు వెళ్ళిపొయ్యాడు. ఆ మర్నాడు సాయంత్రానికల్లా మిగతా బంధువులంతా వచ్చారు. యిల్లంతా సందడిగా వుంది. ఆ తెల్లవారి వారి యిల్లు వచ్చేవారితో పొయ్యేవారితో కోలాహలంగా వుంది. వచ్చిన అతిథులను పరామర్శ చెయ్యడంలో లక్ష్మణరావుగారికి వూపిరిసలపడం లేదు. రాజ్యలక్ష్మమ్మగారికి పనులు పురమాయించటంతో సరిపోతున్నది. ఇక కల్యాణి వచ్చిన తన జతకత్తెలను పరామర్శ చెయ్యడంలో మునిగిపోయింది. లోపల వంటప్రయత్నం చేసేవాళ్ళు చేస్తున్నారు.

కల్యాణికి చాలా బహుమతులు వచ్చినవి. మధ్యాన్నం పెద్ద విందు జరిగింది. ఆ సాయంత్రం ప్రఖ్యాత గాయనీమణిచేత పాటకచేరి జరిగింది.

## ౧౦

బెజవాడలో మైలవరంహోలు వీధిలో గల ఓ డాబా వసారాలో కూర్చుని గౌరి శశికి తలదువ్వి జడవేస్తున్నది. గౌరి శశికి జడవేస్తూ చేతినవున్న రిష్టువాచి చూసి "ఆరు కావచ్చింది. రాజారావు యింకా రాలేదు ?" అనుకున్నది.

ఆ డాబా ఒకభాగంలో గౌరి వుంటున్నది. అవతల భాగంలో యెవరో వుంటున్నారు. గౌరి అక్కడకు వచ్చి ఆరుమాసాలు దాటింది. ఇప్పుడు పలవతి

స్థానే రాజారావు వెళిశాడు. దాదాపు రెండుమాసాల క్రిందట ఒక రోజున చలపతి బజారునించి ఇంటికి రాగానే గౌరికీ చలపతికీ వాగ్వాదం జరిగింది.

"నామెళ్లో నగలుగూడా మార్చివేస్తిమి. వుద్యోగం సంపాయిస్తానని యిన్నాళ్ళబట్టి వూరికే తిరుగుతున్నావు. చేతిలో డబ్బయిపోయింది. యిక యెట్లా గడవాలి?" అన్నది గౌరి.

"నేనుమాత్రం వూరుకున్నానా? కాలికి బలపం కట్టుకుని తిరుగుతూనే వున్నాగా?" అన్నాడు చలపతి.

"దొరికే వుద్యోగానికి యిన్నాళ్ళు తిరగాలా?"

"వుద్యోగం దొరక్క మహామహావాళ్ళు తలకిందులవుతున్నారు-నీకేం తెలుసు?"

"నాకేం తెలుసు? వండిపెడితే తినడం తెలుసు."

"నేనేగా తినేది! నీ కళ్ళకు అంత చులకనగా కనిపిస్తునానన్నమాట."

"ఇప్పుడు చేతిలో డబ్బులేదు. యెట్లా జరగాలి?"

"వుద్యోగంలేంది నన్నెక్కడ తెమ్మన్నావు? ఇంకో నగ వున్నదిగా-అదిగూడా మారిస్తే యీలోపల వుద్యోగం దొరుకుతుంది."

"వున్న యీ నగకూడా ఆఖరుచెయ్యాలని కూర్చున్నావు. యిది అమ్మేందుకు వీలులేదు. యేదో తవ్వి తలకెత్తుతానని చెప్పి మెళ్ళో నల్లపూసలో, తెల్లపూస లేకుండా చెయ్యాలని కూర్చున్నావు."

"నేనేం తవ్వి తలకెత్తుతానని నీతో చెప్పలేదు. యీ చాటుమాటు వ్యవహారం దేనికి, పల్లిగ్గా బతుకుదామని నువ్వేగా పోరుచేసింది."

"పైగా నామీద దొడపుతున్నావా? అట్లా సంపాయిస్తాను, యిట్లా సంపాయిస్తాను అని చెప్పి తీసుకొచ్చి!"

"నెపమంతా నానెత్తినే వేస్తున్నావు! సంపాయించేదాకా నీదగ్గర ఓపికేది?"

"ఎప్పటికీ నువ్వింకా సంపాయించి రాసులుపోసేది? యీ మాయమాటలు దేనికి?"

"మాయమాటలేనా!"

"మాయమాటలు కాకపోతే యేమిటి? నగ అమ్మేందుకు వీల్లేదు. డబ్బు యెక్కడనించి తెస్తావో తీసుకురా?"

"ఇందాకటినుంచి చెపుతుందేమిటి ?"

"ఏమిటి చెప్పేది ? అంత చాతగానివాడివి ఎందుకు తీసుకొచ్చావు ?"

చలపతి కోపంతో "చేతగానివాడినా ?" అంటూ గౌరిని రెండుదెబ్బలు వేసి చరచరా వీధిలోకి వెళ్ళిపోయాడు.

తర్వాత నాలుగు రోజులపు గౌరి గదిలో మంచంమీద వెక్కి-వెక్కి- యేడుస్తున్నది. చలపతి ఆరోజున తనను కొట్టి వెళ్ళిపోవడం పోవడం అంత వరకూ రాలేదు. తాను అతన్ని నమ్ముకుని వచ్చింది. తాను అతనిమీద పెట్టు కున్న ఆశలన్నీ అడుగంటినవి. తాను నిర్మించుకున్న ఊహాసౌధాలన్నీ కూలి పోయినవి. అతడు తన్ను యింత ద్రోహంచేస్తాడని అనుకోలేదు. బంగారం వంటి కాపరాన్ని చేతులారా చెడగొట్టుకుని వచ్చేసింది. యిక సంఘంలో తనకు స్థానంలేదు. జీవితంమీద విరక్తితో బావిలో దూకినవాళ్ళకు ఒక మునక వేసిన తర్వాత మళ్ళా జీవితేచ్ఛ కలుగుతుంది. అప్పుడు బ్రతకాలంటే యెట్లా బ్రతకడం. గౌరి పరిస్థితిగూడా అంతే అయింది. సంఘానికీ తనకూ మధ్య అంతులేని అగాధం యేర్పడ్డది. రెంటికీ చెడ్డ రేవడిగతి అయింది తనబ్రతుకు. యిప్పుడు గత్యంతరం యేమిటి? యెంత ఆలోచించినా దారీ తెన్నూ కనబడటం లేదు.

ఆ సాయంత్రం గౌరి తనదగ్గరవున్న నగగూడా అమ్మేసింది. ఆవచ్చిన డబ్బుతో మరో రెండునెలలు గడిచినవి. గౌరియింటికి "యిందులో ఎవరుంటు న్నారు ?" అనీ "యీ పోర్షన్ అద్దెకిస్తారటగా ?" అనీ యేదోవంక పెట్టుకుని యెవరెవరో వయస్సులోవున్నవాళ్ళు వచ్చి వెళ్ళుతున్నారు. గౌరిచేతిలో డబ్బయి పోవడంవల్ల ఒకరోజున గౌరి లోపల విచారంతో పడుకుని వుండగా పక్క- భాగంలోవున్న వెంకటమ్మవచ్చి గౌరి పడుకున్న మంచంమీద కూర్చుని "ఎందుకు దిగులుపడతావు ? పోయినవాడు యెట్లయినా పొయ్యాడు, అతడింకా తిరిగివస్తాడనుకుంటున్నావా? యెప్పటికీ అనుకోవద్దు. యిట్లా నమ్మించి మోసం చేసినవాళ్ళను చాలామందిని చూశాను. యెందుకుగాని ఒకాయన వున్నాడు,చాలా డబ్బుగలవాడు. బజార్లో బట్టలకొట్టూ అదీవుంది. మనిషి అందంగా వుంటాడు. నిన్ను చూశాడట. నాతో చెప్పాడు. నువ్వంటే మాంచిమోజులో వున్నాడు. యెందుకు చెడతావుగానీ ఆయన్ని అట్టిపెట్టుకో. నీ కరువు తీరిపోతుంది" అని చెప్పింది.

గౌరి జవాబుచెప్పలేదు. మళ్ళా వెంకటమ్మ అందుకుంది. "అంత డబ్బు గలవాడు తనకై తాను నిన్ను వెదుక్కుంటూ రావడం నీ అదృష్టమనే చెప్పాలి. అతన్ని చేపట్టావంటే నీ వళ్ళంతా బంగారంచేసివేస్తాడు. యీ అవకాశం జారవిడుచుకోవద్దు. పనికిమాలినవాళ్ళని నమ్ముకుంటే యేంలాభం. యిట్లాగే దగాపుచ్చిపోతారు" అని చెప్పింది.

నిరుత్తరం అంగీకారంగా భావించి వెంకటమ్మ ఆ సాయంత్రమే రాజారావుని తీసుకొచ్చింది. గౌరికి మళ్ళా నగలు అమిరినవి. అప్పటినుంచీ యే లోటూ లేకుండా సుఖంగా జరిగిపోతున్నది.

గౌరి శశికి జడవేసి రిబ్బనుకట్టి లేచివెళ్ళి సబ్బుతో ముఖం కడుక్కు రమ్మని చెప్పేఅంతలో రాజారావు టక్ టక్ మని బూట్లచప్పుడు చేసుకుంటూ వచ్చి "యింకా మీరు సిద్ధంకాలేదా?" అన్నాడు.

"అంతా అయిపోయింది. ఇక చీరకట్టుకోవడమే తరువాయి. మీ కోసమే యెదురుచూస్తున్నాను" అన్నది గౌరి.

"త్వరగా కానివ్వండి. ఆరున్నర కావచ్చింది. మనం వెళ్లేసరికి ఆట ప్రారంభిస్తారు "అన్నాడు రాజారావు.

గుఱ్ఱంబండి వచ్చి వాకిటిముందు నిల్చింది. గౌరి, శశి ముందు బండిలో ఎక్కారు. తర్వాత రాజారావు యెక్కాడు. బండి కదిలింది. ఇంతలో పక్క పోర్షనులో వున్న వెంకటమ్మ గుమ్మంలో నిలబడి. "అబ్బీ బండి ఆపు. గౌరమ్మా! మాపోరది సినిమాకి వస్తానంటూ యేడుస్తున్నదిగాపి కాస్త తీసుకెళ్ళమ్మా" అని చెప్పింది.

బండివాడు "వెనక బరువైంది. ముందు యెక్కించ" మన్నాడు. గౌరి ఆ అమ్మాయిని బండియెక్కించి సరసన కూర్చోపెట్టుకుంది. "గౌరమ్మా, దాని తలలో జడబిళ్ళా అదీ వున్నదిగాని కాస్త చూస్తూ వుండమ్మా" అని చెప్పింది వెంకటమ్మ. బండి సాగి వెళ్ళిపోయింది.



కాలగమనంలో ఐదు సంవత్సరాలు దాటిపోయినవి. ఆనాటి ఉదయం రాధాకృష్ణ డాబామీది తనగదిలో దుప్పటిముసుగు కప్పి క్రొత్త దువ్వుతుంటూ కిటి

కీలో నుంచి బైటికి చూస్తున్నాడు. కిటికీ ఎదురుగా కొబ్బరిచెట్టునిండా కాయలు నిండు చూలాలిలా కనిపిస్తున్నవి. ప్రహారీ గోడదగ్గర గుబురుగావున్న పూల మొక్కలదగ్గర నిలుచుని కల్యాణి పూలుకోస్తున్నది. రంగురంగుల సీతాకోక చిలుకలు పూలమొక్కలపైన ఆడుతున్నవి. నాగరత్నం అంట్లు తోముతున్న పనిమనిషిమీద కేకలువేస్తున్నది. మేడప్రక్కస్థలంలో పాకవేసుకుని వుంటున్న గుట్టంబండితోలే సోములుభార్య పాకవెనక చట్టి దగ్గరపెట్టుకుని, చేపలు రాతి మీదవేసి తోముతున్నది. దూరాన్నించి రమ వాళ్ళమేడపైన వసారాలో కూర్చుని పుస్తకం చదువుకుంటూ కనిపిస్తున్నది. రాధాకృష్ణ తలదువ్వుకుని దువ్వెన కిటికీలో పెట్టి కుర్చీలో కూర్చుని పుస్తకం చదవడం మొదలుపెట్టాడు. రాధాకృష్ణ వయసు యిప్పుడు పద్దెనిమిదేళ్ళు. నూనూగు మీసాల నూత్నయవ్వనం; అత డిప్పుడు యింటరు చదువుతున్నాడు. రాధాకృష్ణ యింతవరకూ ప్రతిసంవత్సరం మంచిమార్కులు తెచ్చుకుంటూ తప్పకుండా ప్యాసవుతున్నాడు. రాధాకృష్ణకు యెందులోనూ యేలోటూ లేదుగానీ తల్లినిగురించి ఒకటే చింత. ఆ మధ్య కొరిటిపాడు తన తాతగారింటికీ జగన్నాధపురం అమ్మమ్మగారింటికీ వుత్తరాలు రాసి తల్లినిగురించి భోగట్టాచేశాడు కానీ, అక్కడ తల్లిలేదని జవాబువచ్చింది. తల్లిగుర్తుకువచ్చినప్పుడల్లా ఆమె యెక్కడుందోనని వేదనపడుతూ వుంటాడు.

అట్లా పుస్తకం చదువుతున్న రాధాకృష్ణకు డాబా మెట్లమీదనుంచి "రాధా కృష్ణా!"అన్న పిలుపు వినవచ్చింది.అది లక్ష్మణరావుగొంతు. రాధాకృష్ణ చప్పున పుస్తకంమూసి డ్రాయరుమీదపెట్టి చకచకా కిందకిదిగి వెళ్ళాడు. అప్పుడే వచ్చిన టపాను పట్టుకుని లక్ష్మణరావుగారు మెట్లదగ్గర నిలబడివున్నారు. రాధా కృష్ణను చూసి "యిందులో రెండు ఇంగ్లీషు ఉత్తరాలున్నవి చదవాలి రమ్మ"ని కచేరీ హాల్లోకి పిలుచుకువెళ్ళాడు. లక్ష్మణరావుగారికి సరీగా యింగ్లీషురాదు. ఈ మధ్యనే కొద్దిగా నేర్చుకున్నారు. యింగ్లీషువచ్చిన గుమాస్తా వ్యాపారంమీద పొరుగూరు వెళ్ళాడు. రాధాకృష్ణ శెలవరోజుల్లోనూ తీరికసమయాల్లోనూ కచేరి హాల్లో కూర్చుని వ్యాపార విషయాల్లో పాల్గొనటంకద్దు. రాధాకృష్ణ అన్ని విష యాల్లోనూ స్వంతకుర్రవాడిలా అయిపొయ్యాడు. ఒకసారి యేంజరిగిందంటే; రాధాకృష్ణ యేదో పనిమీద మధ్యహాల్లోవున్న గదిలోకి వెళ్ళాడు. ఆ గదిలోనే ఇనప్పెట్టె వున్నది. రాధాకృష్ణ వెళ్ళేసరికి ఆ యినప్పెట్టెముందు నోట్లకట్ట పడి

వున్నది. లక్ష్మణరావుగారు ఇనప్పెట్టె తెరచి నోట్లు లెఖ్ఖపెట్టుకుని తొందరలో ఆ కట్ట లోపలపెట్టడం మర్చిపోయ్యారు. అప్పుడు రాధాకృష్ణ ఆ నోట్ల కట్టను రాజ్యలక్ష్మమ్మగారిని పిలిచి యిచ్చాడు.

రాధాకృష్ణకు లక్ష్మణరావుగారిదగ్గర చనువులేదు. ఆయన్ని పలకరించటానికి బిడియపడతాడు. తనకేదైనా డబ్బు కావలసివస్తే రాజ్యలక్ష్మమ్మగారిని అడిగి తీసుకుంటాడు. రాధాకృష్ణ ఆమెను "అమ్మా" అని పిలుస్తాడు.

రాధాకృష్ణ లక్ష్మణరావుగారికి వుత్తరాలు చదివి వినిపించాడు. "ఆనిక్కనువ్వు బడినించి వచ్చేసరికి పోస్టువేళ దాటిపోతుంది. యిప్పుడే వీటికి జవాబులు వ్రాయ"మని లక్ష్మణరావుగారు చెప్పగా రాధాకృష్ణ లెటరుపేడ్ తీసుకొని లక్ష్మణరావుగారు చెప్పిన ప్రకారం ఇంగ్లీషులో వుత్తరాలు వ్రాసి మడిచి కవర్లలో పెట్టి అంటించి పై అడ్రసులు వ్రాసేసరికి కాలేజీవేళ కావడంవల్ల రాధాకృష్ణ లోనికి వెళ్ళి భోజనంచేసి కాలేజీకి వెళ్ళిపొయ్యాడు.

రాధాకృష్ణ కాలేజీకి వెళ్ళేసరికి ఒక్కొక్క విద్యార్థి అప్పుడే చేరుకుంటున్నారు. రాధాకృష్ణ కాలేజీ వరండాలో కాలు పెట్టేసరికి చంద్రం అప్పుడే గేటుదాటి వస్తున్నాడు. చంద్రాన్ని చూసి రాధాకృష్ణ నిలబడ్డాడు. యింతలో చంద్రం వచ్చి కలుసుకున్నాడు.

"రాత్రి నువ్వు యింటికి వెళ్ళేసరికి యెంతసేపయింది?" అని అడిగాడు రాధాకృష్ణ.

"ఎనిమిది గంటలయింది. 'యీవరదాక యేం చేస్తున్నావ'ని నాన్న కోప్పడ్డాడు" అన్నాడు చంద్రం.

చంద్రం ఓ పేదవిద్యార్థి. అతనిది దగ్గరలో వున్న ఓ గ్రామం. రోజూ మూడుమైళ్ళు నడిచి చదువుకోడానికి వస్తూవుంటాడు. మంచి చురుకైనవాడు. యింతవరకూ క్లాసు తప్పకుండా వస్తున్నాడు. అతనికి స్కూలుజీతం అదీ యే స్నేహితులో కడుతూవుంటారు. నిన్నసాయంత్రం స్కూలు వదిలిపెట్టాక మిత్రులంతా కాలవకట్టమీద కూర్చుని మాట్లాడుతూవుంటే వాళ్ళకు తెలియకుండానే దానంతట అదే ప్రొద్దుకూకింది. అప్పుడు చంద్రం తొందర తొందరగా లేచి యింటికి వెళ్ళిపొయ్యాడు.

వాళ్ళిద్దరూ మాట్లాడుతూ వుండగా యింతలో టక్ టక్ మని బూట్ల చప్పుడు చేసుకుంటూ రమ వచ్చింది. యెర్రటి శరీరచ్ఛాయ, అందమైన ముఖం, తెల్లటి మల్లెపువ్వులాంటి లంగాపైన రోజారంగు వోణీవేసి ఆకుపచ్చ రంగు జాకెట్టు తొడిగింది.

"ఏం రమా? నేను వచ్చేటప్పుడు మీ తమ్ముణ్ణి అడిగితే నువ్వు కాలేజీకి వెళ్ళావని చెప్పాడు. ఆలస్యంగా వస్తున్నావు?" అని అడిగాడు రాధాకృష్ణ.

"బయలుదేరడమైతే ముందుగానే బయలుదేరానుగాని దారిలో మావాళ్ళ యింటికి వెళ్ళడంవల్ల ఆలస్యమైంది" అంది రమ.

ఇంతలో గంట మోగింది. ఆవరణలో అక్కడక్కడ వున్న విద్యార్థు లంతా త్వరత్వరగా ఎవరి గదుల్లోకి వారు వెళ్ళారు.

సాయంత్రం ఐదుగంటలకు కాలేజి వదిలిపెట్టాడు. విద్యార్థులంతా జట్లు జట్లుగా యేవేవో మాట్లాడుకుంటూ యిళ్ళకు వెళ్ళిపోతున్నారు. రాధాకృష్ణ, చంద్రం గేటుదాటి నడుస్తున్నారు.

"రాత్రి తొందరలో యింటికి వెళ్ళేటప్పుడు జేబులో కలం యెక్కడ పడిపోయిందో? రాధాకృష్ణా, యివాళ పెన్సలుతో రాసేటప్పటికి లెక్చరర్ కోప్పడ్డారు" అని చెప్పాడు చంద్రం.

"అవును నేనుగూడ విన్నాను. అయితే యెట్లా పాపం?" అన్నాడు రాధాకృష్ణ.

"ఏంచేసేది? కాలేజి జీతంగూడా వాళ్ళను వాళ్ళను అడిగి కడుతూ వుంటే యింటిదగ్గర అన్నం పెట్టేటందుకే కష్టంగా వున్నది. 'వంటి రెక్కపాటు బండంత సంసారాన్ని యెలా ఈడ్చుకొచ్చేది. పావలాడబ్బులు తెచ్చుకునే యీడులో యింకా యెందుకొచ్చిన చదువులు' అని మా తండ్రి యెప్పుడూ అంటూవుంటాడు. నేనే బలవంతాన చదువుతున్నాను" అని చెప్పాడు చంద్రం.

"యింటిదగ్గర జరుగుబాటులేక వాళ్ళు అలానే అంటూ వుంటారు."

"ఒకళ్ళను యెందాక అడిగేది? ఒక్కొక్కసారి చదువు మానివేద్దామా అన్న విరక్తి పుడుతుంది."

"యింత మాత్రానికి అప్రసన్న్యాసంచేస్తే యెట్లాగోయ్? పోనీ నా కలం యిస్తా తీసుకో" అంటూ రాధాకృష్ణ జేబులో కలంతీసి చంద్రానికి యిచ్చాడు.

"అయితే నీకెట్లా?" కలంతీసుకుంటూ అన్నాడు చంద్రం.

"ఫరవాలేదు-నేను యింకోకలం కొనుక్కుంటాలే" అన్నాడు రాధాకృష్ణ.

ఇద్దరూ రోడ్డుమలుపులోవున్న పెట్రోలుబంకు దగ్గర విడిపోయ్యారు. చంద్రం తన వూరికి రాధాకృష్ణ తన యింటికీ వెళ్ళిపొయ్యారు.

కల్యాణి అప్పుడే స్కూలునుంచివచ్చి డాబాపైకివెళ్ళి తనగదిలో కుర్చీలో కూర్చున్నది. కల్యాణి యిప్పుడు స్కూలుఫైనల్ చదువుతున్నది. శరీరమంతటా అప్పుడే వికసిస్తున్న నవయవ్వనం: యెండ తగ్గిపోవడంవల్ల కిటికీలోనుంచి చల్లని మంద మారుతం వీస్తున్నది. కల్యాణి ఓ పుస్తకంతీసి అటూ యిటూ పేజీలు తిప్పి ఆ పుస్తకం మళ్ళా డ్రాయరుమీద పడవేసి మరిఒక పుస్తకంతీసు కుని వ్రాసుకోడం మొదలుపెట్టింది.

ఇంతలో కాలేజినించివచ్చిన రాధాకృష్ణ పుస్తకాలు తన గదిలో పెట్టి కల్యాణి గదిలోకి వచ్చాడు. కల్యాణి తలవంచుకుని యేదో వ్రాసుకుంటూ వుండడం చూసి "కల్యాణీ!" అని పిలిచాడు.

కల్యాణి వ్రాసుకుంటున్నదల్లా ఆపి 'యేమిటి' అన్నట్టు తలయెత్తి చూసింది.

"నీదగ్గర రెండో కలం వుండాలికదూ కాస్త యివ్వు" అని అడిగాడు రాధాకృష్ణ.

నీ కలం ఏమైంది?" అని అడిదింది కల్యాణి.

"నా కలం యెక్కడో జారిపోయింది."

"అయితే తీసుకో" అంటూ డ్రాయరు సొరుగు లాగి అందులో వున్న కలం తీసి రాధాకృష్ణకు యిచ్చి "యీ లెక్క నాకు తెలియడంలేదు. యెట్లా చెయ్యాలి కృష్ణా?" అని అడిగింది.

రాధాకృష్ణ ఆమె వ్రాస్తున్న పుస్తకం చూసి ఆ లెక్క చేయవలసిన విధానం చెప్పి తన గదికి వచ్చేశాడు.

రాధాకృష్ణ తనగదిలో కూర్చుని పుస్తకం తెరచి యేదో వ్రాసుకుంటు న్నాడు. మేడప్రక్క వున్న పాకలోనించి కేకలు వినవస్తున్నవి. కోమటు తాగి వచ్చినప్పుడల్లా మొగుడూ పెళ్ళాలకు ద్వంద్వయుద్ధం జరుగుతుంది.

"వచ్చినోడ, డబ్బులన్నీ నీయెదాన పెట్టుకుని పొట్టపగల తాగొచ్చినావా ?" ఆడగొంతు వినిపిస్తున్నది.

"యియ్యాల ఐదు రూపాయలు బాకిగ తోలినానే; డబ్బు సిగ్గోసిరి నాకు లెక్కేటి సంపాయిత్తాను, తాగుతాను." మగగొంతు వినిపిస్తున్నది.

ఇంతలో టక్ టక్ మని బూట్లచప్పుడు చేసుకుంటూ రమవచ్చింది. రాధాకృష్ణ వ్రాయడం ఆపి "రా రమా, కూర్చో" అన్నాడు.

రమ కుర్చీలో కూర్చుని "నీనోట్సు కాస్త యివ్వు రాధాకృష్ణా, యిందాక కాలేజీనించి వచ్చేటప్పుడు అడిగి తీసుకుందామంటే మనక్లాసులో మాసిన గుడ్డలు వేసుకొస్తాడే; ఆ కుర్రాడూ నువ్వూ మాట్లాడుతూ వెళ్ళుతున్నారు."

"అవి మాసినగుడ్డలు కావు రమా, నీదుకావి బట్టలు. పల్లెటూళ్ళలో రోజూ వుతకడంవల్ల అలానే వుంటవి."

"ఏవో బట్టల్లే; పిలుద్దామంటే యిద్దరూ ముందు సాగిపొయ్యారు."

"పోనీ యిప్పుడు పట్టుకెళ్ళు. అయితే రమా, పద్యాలన్నీ పూర్తి చేశావా ?"

"ఏదో అట్లా చేశాను."

"అట్లాగే అంటావు. నేను సగం పద్యాలన్నా భట్టీ పట్టలేదు"

"నువ్వు యెంతలో పూర్తిచేస్తావులే."

"యెందుకని? ఐతే రమా, యివ్వాళ ప్రొద్దున ఏడుగంటలకు నువ్వు మీయింట్లో యేంచేస్తున్నావో చెప్పేది ?"

"చెప్పు చూదాం."

"దీక్షగా పుస్తకం చదువుతున్నావు."

"నీకెట్లా తెలుసు ? మా యింటివేపు వచ్చావేమో ?"

"రానవసరంలేదు. యిక్కడ వుంటేనే నాకంతా తెలుస్తుంది."

"అంత ప్రజ్ఞ ఎక్కడ సంపాయించావు ? జ్యోతిషంగూడా వచ్చునా ?"

"యిట్లా కిటికీలోనించి చూడు. మీమేడ కనిపిస్తున్నదా? అదిగో అవసారాలో వున్న కుర్చీలో కూర్చుని చదువుతున్నావు. తెలిసిందా ?"

"అదా సంగతి. మా ధాబాపైనవుంది చూస్తే మీ కిటికీ కనిపిస్తుంది. గాని కొబ్బరిచెట్టు అడ్డం. లోపల యెవరున్నదీ కనిపించదు."

మేడ ప్రక్క పాకలోనించి ధబీధబీమని గుద్దులు వినవచ్చినవి. "ముద నష్టపు సచ్చినోడ. నీ చేతులు పడిపోను. తాగొచ్చి కొడతావా, నీ జిమ్మ పీక" అని స్త్రీ రోదనం వినపడుతోంది.

"ఏమిటి ఆ న్యూసెన్సు?" అన్నది రమ.

"అది వక శ్రవ్యనాటిక."

రమ పకపక నవ్వింది.

"మనకు పాత్రలు కనిపించరు. మాటలుమాత్రం వినపడతవి. శ్రవ్య నాటిక కాకపోతే మరేమిటి?"

"అయితే నీకు వేరే రేడియో అవసరం లేదన్నమాట!"

ఇంతలో కల్యాణి "ఏం రమా?" అంటూ వచ్చింది.

"ఓహో! కల్యాణా! కనిపించడంలేదేం?" అని అడిగింది రమ.

"మీకెక్కడ కనిపిస్తాంలే-మీరు పెద్ద క్లాసువాళ్లాయే!"

"యీ సంవత్సరం పోతే నువ్వుమాత్రం మాలోకి రావెట్లాగు?"

"అయితే యీ లంగాగుడ్డ యెక్కడ కొన్నారు? చాలా బాగుంది."

"మా నాన్నగారు మద్రాసులో తెచ్చారు"

"బట్టలంటే మీ వాళ్ళకి మహా ఆసక్తి సుమా" అన్నాడు రాధాకృష్ణ.

"మా కేమిటి మీ మొగాళ్ళకు వుండదా" అంది రమ.

"ఎందుకుండదూ? మీ ఆడవాళ్ళంత వుండదు"

"అన్నిటికీ ఆడవాళ్ళను వేలుపెట్టి చూపించటం మీ మొగవాళ్ళ లక్షణం" అంది రమ.

"వున్నమాటన్నా. మొగవాళ్ళను సాధించిపొయ్యడం మీ ఆడవాళ్ళ లక్షణం"

ఆ మాటకు రమ, కల్యాణి నవ్వారు.

రమ కాసేపు మాట్లాడి నోట్సు తీసుకుని వెళ్ళిపోయింది.

తర్వాత వారం రోజులకు ఒకరోజు సాయంత్రం రాధాకృష్ణ కాలేజి నించి వస్తున్నాడు. దారిలో రోడ్డుప్రక్కగా ఓ అవ్వ కూర్చుని మూలుగు

తున్నది. ఆ రోడ్డునే వచ్చేపోయే జనానికీ జట్కాలకూ రిక్షాలకు విసుగు విరామం లేదు. రాధాకృష్ణ వెళ్ళిపోతున్నవాడల్లా అవ్వనుచూసి ఆగి దగ్గిరికి వెళ్ళాడు. అవ్వ యేదో సుస్తీగా వున్నట్టున్నది. చేతిలో మందుసీసా వున్నది. "ఏం అవ్వా, యెందుకు మూలుగుతున్నావు ?" అని అడిగాడు రాధాకృష్ణ.

"ఆసుపత్రినించి మందుతెచ్చుకుంటున్నా నాయనా! యిక్కడికి నడిచే సరికి నాపనై పోయింది. ఆయాసం వచ్చింది. బండెక్కిపోదామంటే డబ్బుల్లేవు" అంది. ఆ మాటలైనా ఆయాసంతో చెప్పలేక ఆపి ఆపి చెప్పింది.

"ఎక్కడికి వెళ్ళాలి అవ్వా నువ్వు ?" అని అడిగాడు రాధాకృష్ణ.

"గానుగులపేట నాయనా" అంది అవ్వ.

"అయ్యో ! పాపం చాలా దూరంవుందే! యెలా చేరగలవు ?" అంటూ రాధాకృష్ణ రోడ్డునే వెళ్ళుతున్న ఓ రిక్షా పిలిచి అవ్వ ఆయాసంతో రిక్షా యెక్కలేకపోతే రెక్కపుచ్చుకుని యెక్కించి తానుగూడా వెళ్ళేది ఆ మార్గమే అవటం వల్ల తనుగూడా రిక్షావెంట నడుస్తున్నాడు.

రిక్షా గానుగులపేటలోవున్న అవ్వ యింటిముందు ఆగింది. రాధాకృష్ణ అవ్వను రెక్కపుచ్చుకు దించి రిక్షావాడికి డబ్బులిచ్చాడు. "నీ కడుపు చల్లగా వెయ్యేళ్ళు వర్ధిల్లునాయనా, మంచితండ్రివి. వెళ్ళుదువుగాని లోనికి రా నాయనా" అవ్వ అనగా రాధాకృష్ణ లోనికి వెళ్ళాడు. అది ఓ చిన్న పెంకుటిల్లు. ముందు వసారా వున్నది. రాధాకృష్ణ లోనికి వెళ్ళేసరికి ఆ వసారాలో వున్న పదమూడు పధ్నాలుగేళ్ళ అమ్మాయి బిత్తరచూపులు చూస్తూ మెరుపులా మెరిసి లేడిలా లోనికి పరుగుపెట్టింది. రాధాకృష్ణకు ఆ అమ్మాయిని చూసేసరికి పంచప్రాణాలు లేచి వచ్చినవి. హృదయం కొట్టుమిట్టాడింది. ఆ అమ్మాయి అచ్చుగా తనచెల్లెలు శశిలాగా వున్నది. ఆ అమ్మాయిని చూసి యీ అమ్మాయిని చూడ నవసరంలేదు. శరీరచ్ఛాయ, కన్నూ ముక్కూ తీరు యిద్దరి పోలికా వకటే. శశి యిప్పుడు యే వయసులో వుంటుందో ఆఅమ్మాయికూడా అదే వయసులో వుంది.

అవ్వ "అబల్లమీద కూర్చోనాయనా!" అనగా రాధాకృష్ణ వసారాలో వేసివున్న బల్లమీద కూర్చున్నాడు. అవ్వ గోడకుపెట్టివున్న మంచం వాల్చు కుని కూర్చుని "నాకు యిద్దరు కొడుకులు నాయనా, పెద్దవాడు బెజవాడలో వున్నాడు. రెండోవాడు యిక్కడ జూట్‌మిల్లులో పనిచేస్తున్నాడు. వాడికి ఐదుగురు పిల్లలు నాయనా! ముగ్గురు ఆడపిల్లలు, యిద్దరు మొగపిల్లలు. వచ్చే జీతం చాలదు. పెద్దపిల్ల యీడేరి యింటపడివున్నది. దానికి పెళ్ళి చెయ్యా లంటే మంచి సంబంధాలు యెక్కడా దొరకడంలేదు" అని చెప్పింది.

ఇంతలో లోపలనుంచి యిద్దరు పిల్లలు వచ్చి రాధాకృష్ణను చుట్టవేసు కుని అతని చేతిలో వున్న పుస్తకాలు చూసి "మా అక్కదగ్గరగూడ చాలా పుస్తకాలు వున్నై" అన్నాడు కుర్రాడు.

"మా అక్కదగ్గర బొమ్మల బొక్కలు వున్నై. నీదగ్గర వున్నాయా?" అని అడిగింది చిన్నపిల్ల.

"లేవు" అన్నాడు మందహాసంతో రాధాకృష్ణ.

"యేవీ చూపించు" అంటూ చిన్నపిల్ల రాధాకృష్ణ చేతిలో పుస్తకం లాగింది.

"తప్పు. అట్లా లాగకూడదమ్మా. యీ పిల్లలకు బెరుకేమీ లేదు నాయనా, యెవరొచ్చినా యిట్లాగే పైనా పక్కనా పడతారు" అంది అవ్వ.

"అదే మంచిదిలే అవ్వా! కొందరు పిల్లలు గబ్బిగా పిలిచినా దగ్గిరికి రారు" అన్నాడు రాధాకృష్ణ.

ఇంతలో అవ్వకోడలు కామాలు, ఓ యువతి లోపలనించి రాగా అవ్వ "యిదుగోనే యీఅబ్బాయి, నేను నడవలేకపోతే బండి యెక్కించుకుని తీసు కొచ్చాడు" అని రాధాకృష్ణను పరిచయం చేసింది.

కూతురికి మంచి వరుడుకోసం సతమతమౌతున్న ఆ యిల్లాలు రాధా కృష్ణ స్ఫురద్రూపాన్ని చూసేసరికి మనస్సులో యెన్నో ఆశలు రేకెత్తినవి. యెన్నో కోర్కెలు పెనవేసుకున్నవి. అయితే యే గొప్పింటిబిడ్డో అనుకున్నది. అత్త అన్న మాటలకు "మంచివారు వుంటారు" అంది.

వీళ్ళు యిన్ని అంటున్నా రాధాకృష్ణ మనసంతా ఆ అమ్మాయిమీదనే వున్నది.

మరొకసారి చూద్దామనుకుంటే ఆ అమ్మాయి బయటికి రాలేదు, యెంత సేపని కూర్చోగలడు. "వస్తా అవ్వా" అన్నాడు.

"మీయిల్లెక్కడ నాయనా?" అని అడిగింది అవ్వ.

"పవరుపేటలో" అంటూ రాధాకృష్ణ వెళ్ళిపొయ్యాడు.

## ౧౦

గన్నవరంలో జానికమ్మ కూరలు తరుగున్నది. పొయ్యిమీద పులుసు మరిగిపోవడంవల్ల అనపకాయ తరిగి ముక్కలు అందులో పడవేసి అరటి కాయలు తరుగుతున్నది. ఇంతట్లో యజమానురాలు చింతకాయలు పట్టుకొచ్చి "పచ్చిమిరపకాయలు: మినప్పప్పు యిప్వేవేయించి పచ్చడిచెయ్య"మనిచెప్పింది.

"అనపకాయ పులుసుపెట్టి అరటికాయ వేపుడు వేస్తున్నానండి" అని జానికమ్మ అనగా "సరే యీ పచ్చడిగూడా చెయ్యి" అని చెప్పింది యజమానురాలు.

లోగడ జగన్నాధపురంలో జానికమ్మ తన స్నేహితురాలైన కనకదుర్గ యింట్లో వుంటున్న ఆ నెలలోనే కేశవరావుకు ఆ నీళ్ళు సరిపడక జబ్బు చెయ్యడంవల్ల అక్కడనించి గన్నవరానికి బదిలీ చేయించుకున్నాడు. కనకదుర్గ సుఖంగా ప్రసవించింది. మొగపిల్లవాడు కలిగాడు. తల్లీ బిడ్డా కులాసాగా వున్నారు. జానికమ్మ వారియింట్లో కొంతకాలం వున్నది. ఆమెకు బిడ్డల దగ్గరనించీ వారే యివ్వవలసి వచ్చింది. వారు యేమీ అనుకోకపోయినా అట్లా వుండడం జానికమ్మకు మనస్కరించలేదు. వారితో చెప్పి మరొకరి యింట్లో వంటలక్కగా కుదిరింది. జానికమ్మ వున్న పనేదో చేసుకుని కృష్ణా రామా అనుకుంటూ కూర్చుంటుంది. ఒకోసారి పిల్లలను తలుచుకుని లోలోపల కుమిలి పోతుంది. యింటివాళ్ళు పిలిస్తే పలుకుతుంది. అనవసరంగా యెవరితోనూ మాట్లాడదు. యెక్కువకాలం మౌనంగా గడుపుతున్నది.

ఆ రోజున నీళ్ళమనిషి రావడం ఆలస్యం అయితే జానికమ్మ రెండు బిందెలు నీళ్ళు అందుకోవలసి వచ్చింది. బావి యింటి సమీపంలో రెండిళ్ళు అవతల వున్నది. జానికమ్మ బావి దగ్గరకు వెళ్ళి జేరబోస్తూ వున్నది.

అయితే ఆమె వుంటున్న యింటిప్రక్క ఒకడు తయారయ్యాడు. అతడి పేరు పుల్లారావు. నాటకాల్లో చిల్లరవేషాలు అవీ వేస్తాడు. అతడు వేసే ప్రతీ నాటకం పేపరులోనూ 'మాష్టరు పుల్లి 'అని వ్రాసుకుంటాడు. విగ్గులాగా కత్తిర గిరిజాలు; యెప్పుడూ చేసిన గడ్డం చేసినట్లే వుంటుంది. తెల్లటి మల్లెపువ్వు లాంటి బట్టలువేస్తాడు. పనీ పాటా లేకుండా యెప్పుడూ తిరుగుతూ వుంటాడు. భార్యను నాలుగుతన్నినప్పుడల్లా పుట్టింటివద్దనుంచి యేదో పట్టుకొస్తుంది. ఆ గ్రామంలో అతడు కన్నువెయ్యని స్త్రీ అంటూలేదు. జానికమ్మ అక్కడ ప్రవేశించిన లగాయతు ఆమెమీద అతడికళ్ళు పడ్డవి. జానికమ్మ పూర్వం అందంగా వుండేది. మాణిక్యాన్ని మసిపాత్రలో కట్టినా కాంతి తగ్గనట్టు ఆమెలోని సౌందర్యం పూర్తిగా అణగారిపోలేదు. జానికమ్మ బావిదగ్గర నీళ్ళు తోడుతున్నది. బావిదగ్గర యెవరూలేరు. మాష్టరుపుల్లి బావిదగ్గరగా వీధిలో తారట్లాడుతున్నాడు. జానికమ్మ అతనిని చూడడం కొత్తకాదు, అదివరకూ యెన్నోసార్లు కనిపించాడు. జానికమ్మ అతడివేపు కన్నెత్తయినా చూడలేదు. జానికమ్మ అట్లా నీళ్ళుచేదుతూ వుండగా ఆమె అంగవిన్యాసం నృత్యభంగిమ గానూ బరబరమని ధ్వనిచేస్తూన్న బావియొక్క గిలకచప్పుడు మృదంగవాయిద్యంగానూ అతనికి కనిపించివుండాలి. వీధిలో తారట్లాడుతున్నవాడల్లా బావి దగ్గరకువెళ్ళి చిరునవ్వు వలకపోస్తూ "నేను తోడిపెట్టనా ?" అన్నాడు.

జానికమ్మ అతడికేసి చూడకుండానే "అవసరంలేదు" అన్నది. అంతటితో అతడు వదిలిపోలేదు, మన్మధుడి పూలశరాలతో దెబ్బతింటూ అట్లాగే నిలుచున్నాడు.

ఇంతలో ఆ వీధినే వెళ్ళుతున్న యిద్దరు వ్యక్తులు క్షణం నిలబడి యెర్రటి కళ్లతో ఆ తీరుచూసి వెళ్ళిపొయ్యారు.

బిందెనిండగా జానికమ్మ చేద పట్టుకుని వెళ్ళిపోవడంతో మాష్టరు పుల్లి కూడా అక్కడినించి కదిలి వెళ్ళిపొయ్యాడు.

ఆ సాయంత్రం జానికమ్మ తూర్పువీధిలో వున్న కనకదుర్గ యింటికి వెళ్ళింది. జానికమ్మ యెప్పుడైనా సాయంత్రంపూట తీరిక చేసుకుని కనకదుర్గ యింటికిమాత్రం వెళ్ళుతుంది. జానికమ్మ అట్లా కనకదుర్గ యింటికివెళ్ళి కాసేపు కనకదుర్గతో మాట్లాడిన తరువాత శ్యామ యిప్పుడు పెద్దదై పుస్తకం చదువు

తున్నది. జానికమ్మ ఆ అమ్మాయిచేత రామాయణం చదివించుకుని విని మళ్ళా తాను పనిచేస్తున్న యింటికి వచ్చేసింది.

మాష్టరు పుల్లి ఆ సాయంత్రం యేవో పనిమీద కొత్తపేటలో తిరుగుతున్నాడు. వాళ్ళసెట్టు యెక్కడో నాటకం వేద్దామనుకుంటున్నారు. కొంత మంది సెట్టులోవాళ్ళు కనిపించగా నాటకంవేసే విషయం మాట్లాడేటందుకు దీపాలుపెట్టాక తన యింటికి రమ్మని వాళ్ళతో చెప్పి పెద్దబజారునే నడుస్తున్నాడు. యెవరో స్నేహితుడు వెనకనించి భుజంతట్టి "ఏమోయ్ మాష్టర్, నీశక్తి వేషంయెప్పుడు?" అని అడిగాడు.

అతడు యెగతాళికి అంటున్నాడేమో అనుకుని మాష్టర్ పుల్లి "నా శక్తి వేషం యేమిటోయ్?" అన్నాడు యీసడింపుగా.

అప్పుడు ఆ స్నేహితుడు "అదిగో అట్లా ఆ గోడమీద చూడు యేం రాసివుందో?" అంటూ గోడకేసి చూపించాడు. తెల్లటి గోడమీద మసిబొగ్గుతో 'మాష్టరు పుల్లి యీరాత్రి శక్తివేషం వేయును. మీరంతావచ్చి చూడండి' అని పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసివుంది. అది చదువుకుని మాష్టరు పుల్లి తెల్లబోయ్యాడు.

"ఏం మాష్టర్, నేను చెప్పింది అబద్ధమా?" అన్నాడు స్నేహితుడు.

"ఎవరో గిట్టనివాళ్ళు రాసి యేడ్చారు" అంటూ మాష్టరు పుల్లి నడక సాగించాడు. ఆ బజారు మలుపుతిరిగాక ఓ యింటి గోడదగ్గర నలుగురు నిలబడి గోడమీద వ్రాసిన అక్షరాలను చదువుకుని నవ్వుకుంటున్నారు. మాష్టరు పుల్లి చూశాడు. ఆ గోడమీద గూడా అవే అక్షరాలు వ్రాసివున్నవి. అతడు "యే గాడిదకొడుకు వ్రాశాడో" అనుకుంటూ నడిచి వెళ్ళిపొయ్యాడు.

మాష్టరు పుల్లి యిల్లు చేరుకునేటప్పటికి చీకటిపడ్డది. అతడు ఆ వీధినే వస్తూవుంటే తనయింటి అవతల బావిదగ్గర బరబరమని గిలకచప్పుడు విన పడగా యింఢాకటి ఆవిడగానీ నీళ్ళు తోడుతున్నదేమోనవి చీకటిగా వుండడం వల్ల బావిదగ్గరికి వెళ్ళి చూశాడు. అయితే ఆవిడకాదు. యెవరో మగమనిషి నీళ్ళు తోడుతున్నాడు. తిరిగి యింటిదగ్గరికి వచ్చాడు. యింటి తాళంతీసి లోనికి వెళ్ళి దీపం వెలిగించాడు. భార్య పుట్టింటికి వెళ్ళడంవల్ల తానే ఆ పనులు చెయ్యవలసి వచ్చింది. చొక్కావిప్పి వంకెకు తగిలించి వచ్చి గుమ్మంలో

కూర్చున్నాడు. అతని మనసంతా యిందాకటి ఆవిడమీదనే వున్నది. ఇందాక ఆవిడ బావిదగ్గర నీళ్లు తోడుతూ వున్నప్పుడు ఆమె శరీరం వంపుసొంపులు అతని కళ్లల్లో మెదులుతున్నవి. పక్కవాకిలే వాళ్లది. ఆవిడ బయటికి వస్తుందేమోనని చూస్తున్నాడు. వుండకొందికి బైట చీకటి దట్టంగా అలుముకొంటున్నది. యెంతసేపటికీ ఆవిడ బయటికిరాలేదు. ఆతడు లోనికివెళ్ళి మధ్యాన్నం వండిన తాలూకు అన్నం అదీ వుండగా పెట్టుకుని తిని పెట్టెలోనించి పుస్తకం ఒకటితీసి లాంతరుదగ్గర పెట్టుకుని కాసేపు చదివి తాను రమ్మనిచెప్పివచ్చిన నాటకం పెట్టువాళ్ళు యింకా రాలేదేం అనుకున్నాడు.

అప్పుడు రాత్రి పదిగంటలైంది. అంతవరకు వాళ్ళు రాకపోవడంవల్ల అతడు తలుపుగడియవేసి మంచం వాల్చుకుని పడుకున్నాడు. పడుకున్నాడన్నా మాటేగాని అతని మనసంతా ఆవిడమీదకే పోతున్నది. నిద్రపట్టడంలేదు. అటూ యిటూ పొర్లుతున్నాడు. ఆడవాళ్ళు దబ్బున పైకిపొంగరు. మనసులో యిష్టపడినా పైకి బింకంగానే మాట్లాడతారు. వాళ్ళ నైజం అది. అందులో యిందాక తాను బావిదగ్గర ఆవిణ్ణినీళ్ళు తోడిపెట్టనా అని అడిగితే శాంతంగా జవాబిచ్చింది. అదేగుర్తు పరాయి మగవాడు దగ్గరికివెళ్ళి నేను తోడిపెట్టనా అంటే యే ఆడది వూరుకుంటుంది. 'నువ్వెవడివిరా నాకు తోడిపెట్టేటందుకు వచ్చినాడా' అని గల్లంతుగా అరచి గోలపెట్టదు? మనసులో యిష్టంలేకపోతే అట్లా శాంతంగా జవాబిస్తుందా? నువ్వు ధన్యుడివి, మాష్టర్, నీ కోరిక ఫలించింది.

తాను తేచివెళ్ళి వాళ్ళ తలుపు కొడదామంటే అది ఓ ఛాయలరాదు. గదిలో వక్కతే వుంటే పరవాలేదు. లేక కొంపదీసి యింకా యెవరైనా తోడు వుంటే తనకు యెంత యిష్టంవున్నా తన పరువు నిలబెట్టుకోడానికైనా యెదురు తిరగక మానదు. అబ్బే తాను వెళ్ళి తలుపు కొట్టవలసినపని గూడాలేదు. ఆవిడే వచ్చి తన తలుపు కొడుతుంది. సందేహం లేదు. అందాకా ఓపిక పట్టాలి.

తాలూకాలోనించి పన్నెండు గంటలు వినిపించినవి. విరహతాపం వల్ల అతనికి నిద్రపట్టడంలేదు. తలుపు యేగాలికి కాస్తమోగినా ఆవిడ వచ్చిందనుకుంటున్నాడు. యివాళ యింట్లోగూడా యెవరూలేరు. యిప్పుడువస్తే యెంత బాగుంటుంది. అనుకుంటున్నాడు. యెంతసేపటికీ రాదు. చూసి చూసి అత

ఆవిడ రాలేదు. అతనికి మాగన్నుగా కునుకుపట్టింది.

ఇంతలో వీధి తలుపు కొట్టిన చప్పుడుకాగా అతడు వులిక్కిపడి లేచాడు. ఆవిడ వచ్చేసింది. అబ్బ యెంతజాణ! అతని సంతోషానికి మేరలేదు. మంచం మీదనించి దిగ్గున లేచి గబగబా చేత్తో చెరిగిపోయిన జుట్టు సరిజేసుకున్నాడు. మంచంమీద వున్న తుండుగుడ్డ భుజంమీద వేసుకున్నాడు. తలుపు మళ్ళా మోగింది. అతడు ఒక్క అంగలోవెళ్ళి తలుపుతీసాడు. అతని సంతోషమంతా భగ్నమైపోయింది. వచ్చింది ఆవిడకాదు. యెవరో యిద్దరు మొగవాళ్ళు. "యిప్పుడొచ్చా రేమిటోయి? అర్ధరాత్రికాడ మద్దెలదరువని" అన్నాడతడు.

బయట అమావాస్య చీకటి. కన్నుపొడుచుకున్నా యేమీ కనిపించడం లేదు. అతడు ఆ మాట అంటూ వుండగానే వాళ్ళిద్దరూ లోనికి వచ్చారు. లాంతరు వెలుతురులో వాళ్ళను చూసేసరికి మాష్టరు పుల్లికి గుండెలు అవిసిపోయినవి. అతడు ఆశపడ్డట్లు అతని మనసు దొంగిలించిన సుందరాంగి కాకపోగా అతడు తలచినట్టు నాటకం తాలూకువాళ్ళు గూడా కాదు యెవరో నల్లగా పోతవిగ్రహాల్లాగా వున్నారు. "ఎవరు మీరు? యెందుకొచ్చారు.?" అని అడిగాడు భయంతో మాష్టరు పుల్లి.

వాళ్ళిద్దరూ మొల్లోనించి కత్తులుదూసి పైకెత్తి "అరిచావా చచ్చావే. నోరు ముయ్" అన్నారు.

మాష్టరు పుల్లికి ముచ్చెమటలు పోసినవి, వణికిపోతున్నాడు. యెవరు వీళ్ళు? అయితే తాను నాలుగురోజుల క్రిందట సూరిగాడి పెళ్ళాంతో మంతనాలు జరిపాడు. మొన్నటిరోజున ఓ అందమైన అమ్మాయికి ప్రేమలేఖ వ్రాశాడు. నిన్నామొన్నా అతడుచేసిన పనులన్నీ గుర్తుకొస్తున్నవి. యీ రోజుతో తన ఆయువు తీరిపోయిం దనుకున్నాడు. పురిశిక్ష పడ్డవాడు అయ్యో యెందుకు తప్పుచేశానా అని అప్పుడు యేడిస్తే యేంలాభం? అంతట వాళ్ళు తలుపువేసి అతని నోట్లో గుడ్డలు కుక్కారు.

* * *

ఆ తెల్లవారి చీకటితో స్మశానం మీదగా పొలంవెళ్ళే మగవాళ్ళకూ, గడ్డికివెళ్ళే ఆడవాళ్ళకూ స్మశానంలోనించి కేకలు వినవస్తూ వుండగా దగ్గరికి వెళ్ళి చూశారు. ఆ మసకచీకట్లో ఓ వికృతాకారాన్ని చూసి హడలిపోయ్యారు.

అక్కడ మంచంమీద ఓ వికృతాకారం నా కట్లు విప్పదియ్యండో అని అరుస్తు న్నది. చీకట్లో ఏవరంగా కనిపించడంలేదు. భూతమని ఒకళ్ళు, కాదు శవం బతికిందని ఒకళ్ళు యిట్లా అనుకుంటూ వాళ్ళు భయంతో పరుగుతీశారు.

యీ సంగతి గ్రామంలో తెలిసి విడ్డూరం చూడ్డానికి కాసేపట్లో ఆ ప్రదేశమంతా జనంతో నిండిపోయింది. అప్పటికి భల్లున తెల్లవారింది, అక్కడ మంచానికి ఓ మనిషి కట్టివేయబడివున్నాడు. మొఖంనిండా మసిపూసి సున్నపు చుక్కలు పెట్టబడి వున్నవి. మనిషి యెవరో గుర్తుతెలియడం లేదు. నాకట్లు విప్పండో అని అరుస్తున్నాడు. జనమంతా నెట్టుకుని చూస్తున్నారు. తీరా పర శాయించి చూస్తే ఆ మనిషి మాష్టరు పుల్లి! జనమంతా విరగబడి నవ్వారు. కట్లు విప్పతియ్యగా మాష్టరు పుల్లి బ్రతుకుజీవుడా అని చివాలున లేచి దగ్గరలో వున్న బావిదగ్గరికి వెళ్ళి మొఖానవున్న మసీ అదీ కడుక్కున్నాడు. చూడవచ్చిన జన మంతా నవ్వుకుంటూ యెక్కడివాళ్ళు అక్కడే వెళ్ళిపొయ్యారు.

గ్రామస్థులకు ఆ రోజున మంచి వినోదం దొరికింది, నలుగురు కూడి నప్పుడు మాష్టరుపుల్లిని గురించి చెప్పుకోడం నవ్వడం.

౧౧

గ్రానుగపేటలో అవ్వ తనయింటి వసారాలో మంచంమీద కూర్చుని కోడల్ని మందుసీసా యిట్లాతేవే, అనగా కోడలు రమణమ్మ మందుసీసా, గాజు గ్లాసు తెచ్చియిచ్చింది. అవ్వపేరు శేషమ్మ. శేషమ్మ మందు గ్లాసులో వేసు కుని తాగి "ఏంకూర చేస్తున్నావు?" అని అడిగింది.

"దొండకాయ వేపుడు" అంది రమణమ్మ.

"యీ కూరలు తినలేక చస్తున్నాను, గొంతు దిగవు. కాస్త గోంగూ రలో పచ్చిమిరపకాయలు వేసి వండిపెడుతూ" అంది అవ్వ.

"గోంగూరే! మందుతాగుతూ వుండి యెక్కడన్నా గోంగూర తింటారా?"

"డాక్టరు పత్యంలేకుండా అన్నీ తినెయ్యి అవ్వా అన్నాడు."

"వాళ్ళు అట్లాగే చెపుతారు. గోంగూరఅంటే యింకేమన్నా వుందా? మళ్ళా మొదటికొస్తుంది."

"పోనీ దోసకాయలు కుమ్ములో పెట్టి పచ్చిమిరపకాయలు వేసి పచ్చడి చెయ్యి యీ పాడుకూరలు తినలేకుండా వున్నాను."

ఇంతలో చిన్నపిల్ల సూరి పరిగెత్తుకొంటూ వచ్చి "అన్నయ్య చూడవే అమ్మా" అంటూ తల్లిని కావిలించుకున్నది.

వెంటనే రంగడు ఆ పిల్లను తరుముకుంటూ వచ్చి "సూరి నా బుర్ర లాక్కుని వచ్చింది చూడవే అమ్మా" అంటూ తల్లికి ఫిర్యాదు చేశాడు.

అప్పుడు రమణమ్మ పిల్లచేతిలో వున్న బుర్రను లాక్కుని రంగనికి యిచ్చింది. రంగడు నవ్వుతూ వీధిలోకి పరుగుపెట్టాడు. సూరి కూనిరాగం తియ్యడం మొదలుపెట్టింది.

రమణమ్మ వసారాలోనించి లోనికి వెళ్ళేసరికల్లా భర్త రావడం చూసి ఆగింది. ఆవాళ ఆదివారం కావడంవల్ల శివయ్యకు శలవు. అతడు దగ్గరలో వున్న ఓ పల్లెకు వెళ్ళి వస్తున్నాడు.

"ఏమైంది ?" అని అడిగింది ఆత్రంలో రమణమ్మ.

"ఏమౌతుంది కొండమీద కూర్చున్నారు; పిల్లవాడు స్కూలుఫైనలు దాకా చదివి మానేసేడట. వాళ్ళకు రెండెకరాలపొలం వుంది. యిల్లూ వాకిలీ వుంది. ముగ్గురు కొడుకులట. పెద్దవాడు యితడేనట. నల్లగా వున్నాడు. రెండు వేల కట్నంమీద కూర్చున్నారు" అని చెప్పాడు శివయ్య.

"ఎవర్ని చూడబోయినా కట్నాలు. అంతడబ్బు యెక్కడనుంచి తెచ్చి పొయ్యగలం ? మనదగ్గరేమున్నా డబ్బు మూలుగుతుంది గనకనా" అంది రమణమ్మ.

"బిడ్డపెళ్ళి కళ్ళారా చూసుకుందామంటే ఆ గీత నాకు లేనట్టుంది" అని విచారపడ్డది అవ్వ.

"ఇందాక వకామె అమ్మాయిని చూడ్డానికి మనయింటికి వచ్చింది" వాళ్ళది రామచంద్రరావుపేటట. ఆవిడ తన భాగ్య భోగ్యాలను గురించి గంట సేపు యేకరువుపెట్టింది. వాళ్ళకు రెండుయిళ్ళు వున్నయ్యట. బోలెడు అద్దె వస్తుందట. బజార్లో బట్టలకొట్టు వుందట. ఇద్దరు గుమాస్తాలట. ఇంతమంది వున్నా భర్తకు భోజనానికి వచ్చేటందుకు తీరదట. అన్నికొట్లకంటే వాళ్ళ కొట్లో అమ్మకం జాస్తట. తన పెద్దకొడుక్కి నాలుగువేలు కట్నం తెచ్చి

కాళ్ళమీద పోశారట. తనకొడుకులు మంచి తెలివైనవాళ్ళట. అని యేవేవో చెప్పింది. నేను వూకొట్టి వూరుకున్నాను" అంది రమణమ్మ.

"పెద్దరాతికింద చెయ్యిపెడితే నలుగుతై" అన్నాడు శివయ్య.

"ఎవర్ని కదిలించినా కట్నాలు కట్నాలని వేలంవెర్రిగావుంటే బిడ్డను గుండెలమీద కుంపటిలాగా యెన్నాళ్ళని భరించగలం? నాకు అడివిలో వున్నట్టుగా వుంది" అని విచారపడ్డది రమణమ్మ.

"తొందరపడితే యెట్లా? కల్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు. ఆ ఘడియ రావద్దూ" అన్నాడు శివయ్య.

"మనం ప్రయత్నించకుండా గాల్లో దీపంపెట్టి దేవుడా నీమహిమంటే యెట్లాగు?" అంది రమణమ్మ.

"మనమేం వూరుకున్నామా? చూస్తే మాటలతో పని జరిగేటట్టు లేదు. మనయిల్లుకాస్తా రూపాయిల్లోకి మారిస్తే అమ్మాయిపెళ్ళి యెల్లుండికవుతుంది" అన్నాడు శివయ్య.

"ఇల్లు అమ్ముకుని ఏ చెట్టుకిందికి పోవాలి?" అంది రమణమ్మ.

"కాకపోతే యెట్లా అనుకున్నావు? రూపాయలు చూపించందే చిలక దిగిరాదు" అన్నాడు శివయ్య.

"ఏదో మనకు తగ్గ సమ్మంధం చూసి చెయ్యండర్రా. పెద్దపెద్ద సమ్మంధాలు యెక్కడ తూగగలం? అంది అవ్వ.

"ఇక మనకు అందుబాటులో వున్న సమ్మంధం వెంకటయ్యకొడుకుదే" అన్నాడు శివయ్య.

"వాణ్ణి తగలెయ్య! వాడి సమ్మంధం మనకసలు వద్దు. చూస్తూ చూస్తూ బంగారంవంటి బిడ్డను గోతిలో దించలేను" అంది విసురుగా రమణమ్మ.

"అల్లరి చిల్లరగా తిరిగేవాడికి యెట్లా కట్టబెడతావురా? మరీ అటువంటి సమ్మంధం కాకుండా మనకు తగ్గ మంచి సమ్మంధం యేదో చూసి యివ్వాలిగాని" అంది అవ్వ.

ఇంతలో రాధాకృష్ణ అక్కడికి వచ్చాడు. ఆ అమ్మాయిని ఆవాళ చూపినదగ్గరనించి మళ్ళా యెప్పుడు చూద్దామా అనుకుంటున్నాడు. ఆవాళ

ఆదివారం కావడంవల్ల కాలేజీకి సెలవు. అట్లా తమయింటికి వచ్చిన రాధాకృష్ణను చూసి అవ్వ "రా నాయనా! కూర్చో" అంది.

రాధాకృష్ణ వసారాలో బల్లమీద కూర్చుంటూ "నీకు నయమేనా, అవ్వా?" అని అడిగాడు,

"అట్లా వున్నది నాయనా! ఆయాసం ఆకీ రావడంలేదు" అంది అవ్వ.

రాధాకృష్ణ తమయింటికి మళ్ళారావడంతో రసుజమ్మకు యెన్నో వూహాలు సుళ్ళు తిరిగినవి. అత్తగారి క్షేమం విచారించడానికి వచ్చాడా? ఆమెక్షేమం విచారించడం ఆయనకేమవసరం! మొన్న అమ్మాయిని చూశాడు? అమ్మాయి కంటికి ఆనివుండాలి. రూపంలో దానికి వంకపెట్టేవాళ్ళెవరు? అందుకే వచ్చి వుండాలి. అని వువ్విళ్ళూరుతూ వున్నది.

అక్కడ కూర్చున్న శివయ్య రాధాకృష్ణని అనేకసార్లు చూశాడుగాని యెవరబ్బాయో యేమిటో తెలియదు. తనతల్లి అతడూ మాట్లాడుతూ వుంటే యిది యెట్లా పరిచయమా అనుకుంటున్నాడు.

రాధాకృష్ణ ఆశించినట్టు ఆ అమ్మాయి కనిపించలేదు. యింట్లోవున్నదేమోనని లోనికి చూశాడు. ఆమూల కీనీడలో యెవరో స్త్రీ వున్నట్టుగావుంటే ఆఅమ్మాయేమోనని పరకాయించి చూశాడు. యెవరూ కాదు. గోడకు పెట్టివున్న మంచంమీద చీరవేసి వుంది. ఆ కీనీడలో అదాటుగా చూస్తే అతనికట్లా కనిపించింది. కాసేపు కూర్చున్నాడు. ఆఅమ్మాయి జాడాలేదు. యెక్కడికి వెళ్ళి వుంటుంది. నీళ్ళకు వాటికి వెళ్ళిందేమో అనుకున్నాడు. యింకా కాసేపు చూశాడు. ఆ అమ్మాయి రాలేదు. పోనీ అమ్మాయి యెక్కడికి వెళ్ళిందని అవ్వను అడిగితే! వాళ్ళు యేమనుకుంటారో! తాను యెంతసేపని కూర్చోవడం. వెళ్ళిపోదామా, యింతగా వచ్చి తాను వృధాగా తిరిగి పోవడమేనా! అమ్మాయి యెక్కడికి వెళ్ళిందని అడిగితే తప్పేమిటి అని అనుకుని "మీపెద్దమ్మాయి యెక్కడికి వెళ్ళింది అవ్వా, కనిపించలేదు" అని ధైర్యంచేసి అడిగాడు.

"మా భారతా నాయనా! యిప్పుడే పుస్తకం పట్టుకుని పక్కవాళ్ళింటికి వెళ్ళింది. వాళ్ళ అమ్మాయికీ దానికీ స్నేహం. యెప్పుడూ యేదో చదువుతూ వుంటారు" అని చెప్పింది అవ్వ.

రాధాకృష్ణ అన్నమాట వినేసరికి రమణమ్మకు కొండ యెక్కినంత సంతోషం కలిగింది. తన అంచనా నిజమైంది. రమణమ్మ భర్తను లోనికి పిలిచి "చూశారూ! ఆ అబ్బాయిని మొన్న అత్తగారు నడవలేకపోతే బండి యెక్కించుకుని మన యింట్లో దిగవిడిచేటందుకు వచ్చాడు. వచ్చినప్పుడు అమ్మాయిని చూశాడు. అమ్మాయి ఆయనకు బాగా నచ్చింది; లేకపోతే యెందు కొచ్చి అడుగుతాడు. కుర్రవాడు యెంత చక్కగా వున్నాడో చూశారా. వక చక్కదనమే కాదు బుద్ధిమంతుడు గూడా! అన్నమంతా పట్టిచూడాలా. యిది వరకు మన యింటికి యెవరెవరో పెద్దవాళ్ళు వచ్చి కట్నాలూ కానుకల కోసం బేరాలుచేసి వెళ్ళారు. యిప్పుడు కుర్రవాడే కావాలని వెదుక్కుంటూ వచ్చాడు. యిద్దరికీ యీడూ జోడూ చక్కగా వుంటుంది. కాస్త మీరు ఆ అబ్బాయితో గౌరవంగా అదీ యిదీ మాట్లాడుతూ వుండండి. నేను అమ్మాయిని తీసుకొస్తాను" అని చెప్పి రమణమ్మ వక్క అంగలో ప్రక్కవాళ్ళ యింట్లో వున్న కూతుర్ని పిలుచుకువచ్చి గబాగబా తలదువ్వి మంచి బట్టలుకట్టి వసారాలోకి పంపింది. ఆ అమ్మాయి గుమ్మం దగ్గరగా గోడకు ఆనుకుని నిలుచుంది.

రమణమ్మకు ఆల్లుణ్ణిచూస్తే సహజంగా స్త్రీలకు కలిగే సిగ్గూ బిడియమూ అప్పుడే ఆమెను ఆవరించినవి. కూతుర్ని బయటికి పంపి తాను లోపల తలుపు చాటున వళ్ళంతా చెవులు చేసుకుని నిలుచుంది.

రాధాకృష్ణ ఆ అమ్మాయిని చూసి క్షణంసేపు తనను తాను మరిచి పొయ్యాడు. శశికీ ఆ అమ్మాయికీ యేమీ భేదం లేదు. యిద్దరూ వకటే పోలిక.

"అమ్మాయి యెంతవరకు చదివింది అవ్వా?" అని రాధాకృష్ణ అడగ్గా శివయ్య అందుకుని "థరుడుఫారం వరకూ చదివిందండి అమ్మాయి! హిందీ గూడా ధారాళంగా చదువుతుంది" అని చెప్పాడు.

తన చెల్లెలుగూడా యిప్పుడు యీ వయసులోనే వుంటుంది. అప్పటి నుంచీ బడికివెళ్ళివుంటే థరుడుఫారంకాదు యింకా హైక్లాసులోనే వుండేది. యెక్కడున్నారో యేమిటో యీ విషయాలు తలపుకువచ్చి అతణ్ణి విచారం ఆవరించింది.

రాధాకృష్ణ కాసేపు కూర్చుని "వస్తానండీ" అని శివయ్యతోనూ అవ్వతోనూ చెప్పి వెళ్ళిపొయ్యాడు.

ఆ సాయంత్రం రాధాకృష్ణ రాజాకేఫ్‌లో కాఫీ తాగుతున్నాడు. ఆ హాల్లో చలవరాతి బల్లలముందు ఎవరెవరో కూర్చుని ఫలహారాలు అరగిస్తున్నారు. అక్కడ అరగిస్తున్న వాళ్ళందరికీ జిహ్వకు రుచితగలడమే కాకుండా చెవులకు కూడా రుచి తగులుతున్నది. ప్రక్కనవున్న రేడియోలోనించి కమ్మనిపాట విన వస్తున్నది. రాధాకృష్ణ కూర్చున్న బల్లముందు ఓ కుర్చీ ఖాళీగా వుండగా యెవరో అవతలవేపు కుర్చీలో కూర్చున్నవాడల్లా లేచివచ్చి రాధాకృష్ణకు యెదురుగా వున్న కుర్చీలో కూర్చుని రాధాకృష్ణను ఎగాదిగా చూస్తూ "మీది కొల్లిపర కాదు" అబ్బాయి అని అడిగాడు.

ఆ మాటకు రాధాకృష్ణ అవును అన్నాడు. ఆ మనిషి ఎవరో రాధాకృష్ణకు తెలియదు. యెప్పుడైనా చూసినట్టుగూడా జ్ఞాపకంలేదు. చామన చాయగా మనిషి బలిష్టంగా ఉన్నాడు; వయసు నలభై ఏళ్ళుంటవి.

"నీ తల్లీ దండ్రీ ఫలానా కాదా?" అని అడిగా డతడు.

"అవును" అన్నాడు రాధాకృష్ణ. యెవరో యితడు తనసంగతి బాగా యెరుగున్నాడు. అటుప్రాంతంవాడే. అయితే తన తల్లి సంగతి యేమైనా తెలుసునేమో అన్నఆశ కలిగింది రాధాకృష్ణకు. "మా అమ్మా వాళ్ళు యెక్కడున్నారో! మీకేమైనా తెలుసునా?" అని అడిగాడు.

"నాకు తెలియదు. కొల్లిపరలో లేరని మాత్రం తెలుసు. అయితే నువ్వు యిక్కడ యెవరింట్లో వుంటున్నావు? అని అడిగా డతడు.

రాధాకృష్ణ చెప్పాడు.

"ఏ పేటలో" అని మళ్ళా అతడు అడగ్గా రాధాకృష్ణ చెప్పాడు. అయితే ఆ కొత్తమనిషి మాట్లాడుతున్నంతసేపూ అతని ముఖంలో కలిగిన రకరకాలైన మనోభావాలు రాధాకృష్ణ కనిపెట్టలేదు.

"మీదేవూరో? చెప్పారుకారు" అన్నాడు రాధాకృష్ణ.

"మాదా కొల్లిపర దగ్గరవూరులే" అంటూ అతడు లేచి వెళ్ళిపోయాడు.

రాధాకృష్ణ కాఫీ ముగించి బయటికివచ్చాడు. ఇంతలో పైనించి పద్మనాభం వస్తూవుండడం చూసి రాధాకృష్ణ నిలబడ్డాడు. సిగరెట్టు కాల్చుకుంటూ పద్మనాభం రాధాకృష్ణను సమీపించి "యెందాకా ప్రయాణం?" అన్నాడు.

"పార్కుకు వెళదామా అని చూస్తున్నాను?" అన్నాడు రాధాకృష్ణ.

"అట్లా క్లబ్బు కెళదాంరా" పద్మనాభం అనగా యిద్దరూ క్లబ్బుకు బయలుదేరారు.

పద్మనాభం మరో సిగరెట్టు వెలిగించి "నువ్వు అదృష్టవంతుడివోయి నీకీ సిగరెట్ల బాధలేదు. వీటికి యెక్కడ డబ్బూ చాలడంలేదు. యింటివాళ్ళు యిచ్చే డబ్బులన్నీ వీటికే తగలేస్తున్నాను." అన్నాడు.

"నీకేం మహారాజువి"

ఇద్దరూ మాట్లాడుకుంటూ క్లబ్బుచేరారు. అక్కడ బల్లమీద యేవో తెలుగు పత్రికలూ ఇంగ్లీషు పత్రికలూ పడవేసి వున్నవి. వాటిజోలికి యెవరూ పోయినట్టులేదు. అంతా యేవో ఆటలాడు తున్నారు. అవలగా గుండ్రపు బల్ల చుట్టూ కుర్చీలో కూర్చుని ఆఫీసులో ప్రొద్దస్తమానం వ్రాసి వ్రాసి బుర్రకు వేడెక్కిన వుద్యోగులూ, షాపుల్లో కదలకుండా క్యాషుపెట్టిదగ్గర కూర్చుని డబ్బు లెక్కపెట్టి విసుకెత్తిన వ్యాపారస్థులూ పెద్దమనుషులనుకునే వాళ్ళంతా అక్కడ చీట్లాడుతున్నారు. బల్లమీద డబ్బులు గల గల మోగుతున్నవి.

"తురుపేమిటి?" అంటున్నాడు సూటులో వున్నాయన.

"డైమన్" అంటున్నాడు ఓ కళ్ళజోడాయన.

"యీ ముక్కలు తగలెయ్య" చేతిలో చూసుకుని పెదవి విరుస్తున్నాడు ఓ లావుపాటాయన.

బనీను తొడుక్కుని లుంగీ కట్టుకుని జుట్టు ముఖంమీద పడుతున్న ఓ యువకుడు వాళ్ళందరకి సిగరెట్లు సోడాలూ సరఫరా చేస్తున్నాడు.

అవతల ఖాళీస్థలంలో కూర్చుని కొందరు కేరంసు మొదలైన ఆటలాడు తున్నారు. పద్మనాభం రాధాకృష్ణ పత్రికలు తిరగవేస్తూ కూర్చున్నారు. కాసేపు పత్రికలు చదువుకుని ఇళ్ళకు వెళ్ళిపొయ్యారు.

తర్వాత నాలుగు రోజులకు రాధాకృష్ణ, పద్మనాభం యింటి దగ్గరనించి రాత్రి తొమ్మిది గంటలకు వస్తున్నాడు. పద్మనాభం తన క్లాసుమేటు యిద్దరూ మాట్లాడుతూ కూర్చోవడంలో వాళ్ళకు తెలియకుండానే ప్రొద్దుపోయింది. అప్పుడు లేచి రాధాకృష్ణ యింటికి బయలుదేరాడు. అవి కొత్తస్థలాలు అక్కడ యిళ్ళు చాలా పడినవి. వూరికి రెండు ఫర్లాంగుల దూరం వుంటుంది. మధ్య అంతా ఖాళీ ప్రదేశం. ఒకటి రెండూ సరివి తోటలు మాత్రం వున్నవి. రోడ్డు

గూడా లేదు. దొంకదారి. రాధాకృష్ణ యిప్పుడాటి దొంకదారినే నడుస్తున్నాడు. ప్రొద్దుకూకిందంటే అక్కడ జనసంచారం తక్కువ. అది బహుళపక్షం. దారి ప్రక్క చెట్లు చీకటి ముసుగులేసుకుని దయ్యాల్లా కనిపిస్తున్నవి. పూళ్ళోనించి సన్నగా సన్నాయిమేళం వినవస్తున్నది. రాధాకృష్ణ దారిప్రక్క సరివితోటను సమీపించి నడుస్తున్నాడు. తోటలోనించి గాలికి ఘుయ్యుమని ధ్వని వినవస్తున్నది. పది అడుగులు వేశాడు. ఆ చీకట్లో సరివితోట ముందునించి రెండు మానవాకారాలు అతనివైపు వస్తున్నట్టు గోచరించింది. అతడు నడిచి వెళ్ళిపోతున్నాడు.

"ఇడిగో అబ్బాయి!"

రాధాకృష్ణ అటువైపు చూశాడు. యెవరో యిద్దరు తాడిచెట్లల్లా దగ్గరగా నిలుచుని వున్నారు. రాధాకృష్ణ నిలబడి "యేమిటి?" అన్నాడు.

"యిట్లా రా. నీతో పనివుంది" అంది ఓ కంఠం.

"నాతో యేంపని? యెవరు మీరు?" అంటూ రాధాకృష్ణ నడకసాగించాడు.

"పిలుస్తుంటే పోతావేం, యెక్కడికి పోతావు?" అంటూ ఆ యిద్దరూ రెండడుగులు వేసి రాధాకృష్ణను పట్టుకున్నారు. రాధాకృష్ణకు గాభరావేసింది. యెవరు వీళ్ళు? తననెందుకు పట్టుకుంటారు? దొంగలా? రాధాకృష్ణ భయంతో కేకపెట్టాడు. అదృష్టవశాత్తు పైనించి వస్తున్న యెవరో యిద్దరు 'యెవరక్కడ?' అంటూ చేతిలోవున్న బేటరీలైటు వేశారు. ఆ వెలుతురులో ఒకడి చేతిలో కత్తి తళుక్కుమని మెరిసింది. రాధాకృష్ణకు ఆ యిద్దరి ముఖాలు స్పష్టంగా కనిపించినవి. అందులో ఒకడు మొన్నటిరోజున తనకు కాఫీ హోటల్లో కనిపించినవాడే! అట్లా పైనించి వస్తూవున్నవాళ్ళను చూసి ఆదుండగులిద్దరూ రాధాకృష్ణను వదిలి పిక్కబలం చూపారు. పైనుంచి వస్తున్న యిద్దరూ సమీపించి పరిగెత్తుతున్న వాళ్ళిద్దర్నీ పట్టుకోవాలని ప్రయత్నించారు కానీ, వాళ్ళకు చిక్కలేదు. సరివితోటలో యెక్కడ దాక్కున్నారో! అప్పుడు వాళ్ళిద్దరూ రాధాకృష్ణ దగ్గిరికి వచ్చి బేటరిలైటు వెలుతురులో రాధాకృష్ణను చూసి అందులో ఒకతను "నీపేరు రాధాకృష్ణకదూ" అని అడిగాడు.

రాధాకృష్ణ "అవు" ననగా అతడు రాధాకృష్ణను వీపుతట్టుతూ "యివ్వాళ నువ్వు అదృష్టవంతుడివి" అన్నాడు.

రాధాకృష్ణ గుండె వేగంగా కొట్టుకోవడం యింకా తగ్గలేదు. వీళ్ళెవరు! తనపేరు వీళ్ళకెలా తెలుసు ? అని అనుకుంటున్నాడు.

"నీమీద యేదో కుట్ర జరుగుతున్నది, అబ్బాయి! నువ్వు జాగ్రత్తగా వుండాలి. యిలా ప్రొద్దుపోయి యెక్కడా తిరగవద్దు" అని చెప్పి రాధాకృష్ణను అందాక పంపించి మరీ వాళ్ళు వెళ్ళిపొయ్యారు.

రాధాకృష్ణ రోడ్డెక్కి జనంలో పడ్డాడు. పట్టపగుల్లాగా దీపాలు వెలుగుతున్నవి. గుఱ్ఱబ్బళ్ళూ రిక్షాలూ నడుస్తున్నవి.

తనమీద కుట్ర జరుగుతున్న సంగతి వాళ్ళకేంతెలుసు? యేదో ఆవతల వాళ్ళ చర్యలనుబట్టి అనివుండాలి. వాళ్ళు తనను యెరిగున్నవాళ్ళే. లేకపోతే తనపేరెలా తెలుస్తుంది. యిక్కడ తమయింటికి (లక్ష్మణరావుగారి దగ్గిరికి) వచ్చి పొయ్యేవాళ్ళు యెవరో అయి వుండవచ్చు. చీకట్లో తాను గుర్తించలేదు. ఐతే తనను అడ్డగించినవాళ్ళెవరు ? దొంగలుకారు. యింత అఘాయిత్యానికి పాల్పడడానికి వాళ్ళకు తానేం అపకారం చేశాడు ? వాళ్ళు తమ ప్రాంతంవాళ్ళే. కాఫీహోటల్లో వివరాలన్నీ అడుగుతూవుంటే యేదో యెరుగున్నవాడవటం వల్ల అడుగుతున్నాడని భావించాడు, వాళ్ళు యింత అకృత్యానికి పాల్పడడానికి కారణమేమిటి? అతనికేమీ బోధపడలేదు. వాళ్ళు చెప్పినట్టు తాను జాగ్రత్తగా వుండడం మంచిది. యిలా ఆలోచించుకుంటూ రాధాకృష్ణ యిల్లుచేరుకున్నాడు.

రాధాకృష్ణకు ఆ రాత్రి సరీగా నిద్రపట్టలేదు. మనస్సంతా కలవరంగా వుంది. ఆ దృశ్యమే కళ్ళలో మెదులుతున్నది.

ఆ మూడవరోజున రాధాకృష్ణ ఉదయానే తనగదిలో కూర్చుని ఆంధ్ర పత్రిక చూస్తున్నాడు.

పక్కపాకలోవించి "నీకూ నాకూ జోడుఅయితే మల్లెపూల తెప్పకట్టి-తెప్పమీద తేలిపోదాం పదరా, చెలీ మోహనరంగా" సోములుపాట విన వస్తున్నది.

"పాటలు పాడుదువుగాని అన్నం ఉడికింది రా."

"వస్తాగానీ, నువ్వు ఆ గులాబీకోక కట్టుకుంటే బలే సోగ్గా వుండావే చిన్నదానా!"

"నీ మాటలకేంపచ్చె, దబ్బున అన్నంతిని బంపి కట్టుకెళ్ల. బాకిగంతా అందరూ తోలేత్తున్నారు."

"అప్పుడే తోలేత్తన్నారెటి! మనుసులు కాపి కీపి తాగి బజారికి రావాలా! పాపింజేరు యింకో గంటగ్గాని రాదు. రయిలు టేషనికి కష్టేసినానంటే బోలు డంత బాపిగ!"

"అట్టాగే సెపుతావు మాటలు."

"మాటలు సెప్పడమేటి. నాను బాపిగతోలి లేకపోతే యెక్కడ తింటు న్నావు?"

"మాలావు తెచ్చిపోత్తున్నాడు."

రాధాకృష్ణ పత్రిక చూస్తూవుండగా ఒకవార్త అతని కళ్ళపడ్డది. ఆస క్తితో చదివాడు.

'ఏలూరు నవంబరు 10.

కొల్లిపర హత్యకేసులో ముద్దాయిగా వుండి పరారి అయిన భూషణం అని వ్యవహరింపబడుతూవున్న నాగభూషణాన్ని పోలీసులు యివాళ యిక్కడ అరెస్టుచేశారు'

రాధాకృష్ణ ఆ వార్త చదివి నిట్టూర్పు విడిచాడు.

"భోజనం అయిందా, పత్రిక చదువుతున్నావు?"

రాధాకృష్ణ తలయెత్తి చూశాడు. చంద్రం గదిలో అడుగుపెడుతున్నాడు.

"ఇంకా కాలేదు. రా చంద్రం కూర్చో" అన్నాడు రాధాకృష్ణ.

"తొమ్మిదిన్నర కావచ్చింది" యింకా యెప్పుడు ?

"యిదిగో క్షణంలో వస్తా కూర్చో" అంటూ రాధాకృష్ణ చేతిలో పత్రిక డ్రాయరుమీదపెట్టి కిందికి దిగివెళ్ళాడు.

కాసేపటికి రాధాకృష్ణ భోజనంచేసి డాబాపైకిరాగా యిద్దరూ కలిసి కాలే జీకి వెళ్ళిపోయ్యారు.

తర్వాత దాదాపు నెల రోజులకు ఒకనాటి సాయంత్రం రాధాకృష్ణ కాలేజీ వించి వస్తూ గాంధీనగపేటలో వున్న అవ్వగారింటికి వెళ్ళాడు. అతడు వెళ్ళేపరికి వసారాలో గుమ్మంముందు అవ్వ కూర్చునివుంది. ఆమెకు కొంచెం అవతలగా

భారతి కూర్చుని లేసు అల్లుకుంటున్నది. రాధాకృష్ణనుచూసి అవ్వ యెంతో ఆప్యాయంగా "రా నాయనా కూర్చో" అంది.

రాధాకృష్ణ అక్కడవున్న బల్లమీద కూర్చున్నాడు. యీసారి భారతి లేచి పోలేదు. అలాగే కూర్చుని లేసు అల్లుకుంటున్నది.

"నీకు బాగా కులాసాగా వుంటున్నదా అవ్వా—" అని అడిగాడు. రాధాకృష్ణ.

"కులాసాగానే వుంటున్నది గానీ నోటికేదీ సహించడంలేదు నాయనా, యేది నోట్లో పెట్టుకున్నా చేదు" అంది అవ్వ.

"జ్వరం కాచిందికదు-కొన్ని రోజులవరకూ అలాగె ఉంటుంది" అన్నాడు రాధాకృష్ణ.

ఇంతలో రంగడు చేత్తో బనీను పట్టుకువచ్చి "మా అక్క నాకు బనీను అల్లింది" అంటూ రాధాకృష్ణకు చూపించాడు.

రాధాకృష్ణ అల్లికనేర్పు చూసి చాలా బాగుంది అన్నాడు. ఇంతలో సూరి యెక్కడినించో పరిగెత్తుకుంటూ వచ్చి రాధాకృష్ణను చుట్టవేసుకుని "మా అక్క నాక్కూడా బనీను అల్లుతున్నది" అని వూరించుకుంటూ చెప్పింది.

"యివతలకురా దెయ్యమా" అంటూ భారతి చెల్లెలిని గదుముకున్నది.

"అట్లా మీదపడకూడదు-యివతలకు దామ్మా" అంది అవ్వ.

రమణమ్మ లోపలనించి రాధాకృష్ణను తొంగిచూసి తలుపుచాటున నిలుచుంది. యింతలో మిల్లునించి శివయ్య వచ్చాడు. రాదాకృష్ణను చూసి మంద హాసంతో "యెంతసేపయింది మీరు వచ్చి?" అని పలకరించి లోనికివెళ్ళాడు. లోపల భార్యభర్తలు యేం మందలించుకుంటున్నారో శివయ్య తల్లిని లోనికి పిలవగా ఆమె లోనికి వెళ్ళివచ్చి యధాస్థానంలో కూర్చుని "రేపు మాఖ మాసంలో అమ్మాయిపెళ్ళి చెయ్యాలనుకుంటున్నాం నాయనా" అంది రాధాకృష్ణతో.

పెళ్ళిమాట యెత్తేసరికి భారతిలేచి లోనికి వెళ్ళిపోయింది. అవ్వ అన్న మాటకు "సంబంధం యెక్కడ చూశారు?" అని అడిగాడు రాధాకృష్ణ.

ఆ మాట అవ్వకూ యింట్లో వింటున్న భార్యాభర్తలకు ఆబ్బురపాటు కలిగించింది. పెళ్ళిమాట యెత్తగానే మంచి రోజెప్పుడో చూడమని అంటాడని

వాళ్ళ అభిప్రాయం. అమ్మాయిగాని అతనికి నచ్చలేదా? నచ్చకపోతే యిన్ని సార్లు తమ యింటికి పరిగెత్తుకుంటూ యెందుకొస్తాడు. ఒకవేళ అమ్మాయిని తనకు కాకుండా యెవరికైనా మాట యిచ్చాడేమోనని తేల్చుకోడానికి అట్లా అని వుండవచ్చు. అనుకుని అవ్వ రాధాకృష్ణ ప్రశ్నకు "యింకా యెక్కడా చూడలేదు, నాయనా" అంది.

"అట్లాగా" అని వూరుకున్నాడు రాధాకృష్ణ.

వాళ్లు తలచినట్టు రాధాకృష్ణవల్ల సరియైన సమాధానం రాకపోయ్యేసరికి "అవ్వ నీ అభిప్రాయం యేమిటి నాయనా" అని అడిగింది.

"నా అభిప్రాయం యేం వుంది! చదువుకున్న వాణ్ణిగా చూసి యోగ్యత యెరిగి యివ్వమని నా సలహా" అన్నాడు.

అప్పుడు అవ్వ, నిజానికి ముందు మన అభిప్రాయం తెలుసుకోకుండా నేను చేసుకుంటానని యెవరూ అనరు, అతడు మాటల్లో మంచి నేర్పరి. ఆ ముత్యమంత మాటా తమ నోటిమీదుగా అనిపించాలని యీ యెత్తంతా అనుకుని "నీకంటే యోగ్యులెవరు నాయనా!" అంది.

అప్పుడు రాధాకృష్ణకు యేమి సమాధానం చెప్పాలో తోచలేదు. అవ్వ మళ్ళా "మీ యిద్దరికీ యీడూ జోడూ చక్కగా వుంటుంది నాయనా ! చిలకా గోరింకల్లాగ వుంటారు" అని అంది.

తానో అభిప్రాయంతో వస్తూవుంటే వాళ్లో విధంగా భావించినందుకు బాధపడుతూ రాధాకృష్ణ "నే నా వుద్దేశంతో రావడంలేదు అవ్వా" అన్నాడు.

యింకా బెట్టుసరిపోతున్నాడు. ఆ వుద్దేశంతో రాకపోతే మరి యే వుద్దేశంతో వస్తున్నట్టు? తనకై తానే వెదుక్కుంటూ వచ్చాడంటే బెట్టుతక్కువ కదు అనుకుంది అవ్వ. యీయనకుగూడా యేదో కట్నంమీద ఆశ వున్నట్టుంది. వేలు ఒరగబెడితేగాని వెన్నరాదు. అందుకే యీ డొంకతిరుగుడంతా అనుకున్నాడు యింట్లోవుండి ఆలకిస్తున్న శివయ్య. యెట్లయినా ఆల్లుడివిగువు పోలేదు అనుకుంది రమణమ్మ.

అప్పుడు అవ్వ, "నువ్వా వుద్దేశంతో రాకపోవచ్చు నాయనా ! అమ్మాయిని మేమే యిస్తామంటున్నాంగా !" అంది.

"యింకా మీరు అర్థంచేసుకోలేదు. నా జీవితం ఓ తాడుతెగిన గాలి పటంలాంటిది" అన్నాడు రాధాకృష్ణ.

"అబ్బాయి మొన్న నీ సంగతంతా చెప్పాడు. మీ అమ్మావాళ్ళు యెక్కడో వున్నారట. నువ్విక్కడ చదువుకుంటున్నావట. అట్లని మేమేమీ అనుకోవడంలేదు నాయనా! యేదో చదువుకున్నవాడివి, బుద్ధిమంతుడివి. భార్యకు అన్నం పెట్టుకోలేకపోతావా అని ఆలోచించుకుని అమ్మాయిని నీకు యివ్వాలని నిశ్చయించుకున్నాం నాయనా!" అంది.

రాధాకృష్ణ యిది యెక్కడ ఖోభరా భగవంతుడా! చెప్పేది ఆలకించరు అనుకుంటూ "ఇంకేం అవ్వా! నాసంగతి మీకు తెలిసిందేగదా. ఆ అమ్మాయి నా సోదరిలాంటిది. మంచి వరుణ్ణి యెవరినైనా చూసి యివ్వండి. నేనుగూడా సంతోషిస్తాను" అని చెప్పి రాధాకృష్ణ బయటపడ్డాడు.

## ౧౩

బెజవాడలో మైలవరం హాలు వీధిలో వున్న గౌరి యింట్లోనుంచి పాట వినవస్తున్నది. వట్టిపాటేకాదు; పాటలో మిళితమై ఫిడేలు వాయిద్యం గూడా విన వస్తున్నది. గరుడయ్య పంచలో కూర్చుని ఫిడేలు వాయించుకుంటూ వుండగా వెంకటమ్మ ఓ అమ్మాయిని తీసుకొచ్చి "యీ అమ్మాయి బాగా పాడుతుంది పాడించు గరుడయ్య అన్నా" అంది.

గరుడయ్య ఆ అమ్మాయిచేత పాడిస్తూ ఫిడేలు వాయిస్తున్నాడు. గౌరి, వెంకటమ్మ ఇంకా పొరుగింటి ఆడవాళ్ళిద్దరూ కూర్చుని ఆలకిస్తున్నారు. అది ఉదయంపూట. అవతల కిటికీలోనించి యెండ లోనికి పడుతూవుంది. లోపల వంటగదిలోనించి సన్నగా పొగ పంచలోకి వస్తూవుంది.

రాజారావు యిప్పుడు రావడంలేదు. ఆ స్థానాన్ని గరుడయ్య ఆక్రమించాడు. గరుడయ్య వయస్సు నలభై యేళ్లుంటవి. ఫిడేలు వాయిస్తాడు, అదే అతని జీవనం. ఆ పట్నంలో తనకంటే ఫిడేలు వాయించేవాళ్ళు లేరని అతని గర్వం. ఆ గర్వం అతని ప్రతిమాటలోనూ తొంగిచూస్తూ వుంటుంది. యెర్రగా బొద్దుగా వుంటాడు, యెప్పుడూ కారాకిళ్లీ వేస్తాడు. అట్లా వింటున్న గౌరి పీఠిన

ఓ అమ్మాయి పోతూవుంటే ఆవాటుగా చూసి శశి అనుకుని ఏవాలున లేచి వీధి గుమ్మంలోకి వెళ్లింది చూసింది. శశికాదు. యెవరో అమ్మాయి.

శశి యిప్పుడు గౌరి దగ్గరలేదు. శశి వచ్చిన దాదాపు అయిదు మాసాలకు శశి ఓ రోజున వీధిలో కుళాయిదగ్గర నీళ్లు పట్టుతూవుండగా చలువ తలం పుగా అటు తండ్రివెంట వెళ్లుతూవున్న రామం శశిని చూశాడు. యిదేమిటి. మొన్న వాళ్ళ తాతగారింట్లో వున్న శశి యిక్కడికెట్లా వచ్చింది? అను కుంటూ "అదిగో నాన్నా శశి" అన్నాడు తండ్రితో.

రామం తండ్రి పేరు వెంకటనారాయణ. వాళ్లు బెజవాడలో గృహప్రవే శానికి గాను బంధువుల యింటికి వచ్చారు. వారి అత్తగారి గ్రామములో ఓరైతు యింట్లో శశివున్నట్లు, శశి తల్లి చనిపోయినట్లు లోగడ భార్యవల్ల అతను విని వున్నాడు. రామం, 'శశి అదిగో నాన్నా!' అనగా "యెక్కడరా?" అని అడిగాడు.

"అదిగో నాన్నా పంపుదగ్గర" అని చూపించాడు రామం. యిద్దరూ కలిసి కుళాయి దగ్గరికి వెళ్ళారు. శశి రామాన్ని చూడగానే సంతోషంతో "రామం!" అంది.

వెంకట నారాయణకు శశిని చూసేసరికి యెంతో జాలివేసింది. కొల్లి వరలో వీళ్ళ రెండు కుటుంబాలూ యెంతో సన్నిహితంగా వుండేవి. వాళ్ళ సంసారం చిందరవందరై ఆ వూరు వదిలిపెట్టి పోవడం, ఆఖరుకు ఆ అమ్మాయి తల్లికూడా చనిపోవడం శశిమీద వెంకటనారాయణకు యెంతో సానుభూతి కలి గింది. "యిక్కడ వున్నావేం అమ్మాయ్?" అని అడిగాడు.

"మా అత్తయ్యగారి యింట్లో వున్నా తాతయ్యా! అదిగో ఆ యిల్లే" అంది శశి.

వెంకటనారాయణ అర్థంగాక "ఏ అత్తయ్య? అని అడిగాడు.

"మా గౌరి అత్తయ్యగారింట్లో తాతయ్యా! అదిగో ఆ యిల్లే" అంటూ యెదురుగా వున్న డాబా చూపించింది శశి.

వెంకటనారాయణకు అప్పుడు అర్థమైంది. గౌరి చరిత్రంతా అతనికి తెలుసు. గౌరి లేచిపోవడమూ; తర్వాత కొట్లాటలు జరిగి ఖూనీలుదాకా కావ డమూ అన్నీ అతని కళ్ళయెదుట జరిగినవే. "మీ కుటుంబాన్ని నాశనంచేసింది

చాలకనా, నిన్నుగూడా చెడగొట్టడం. రామానికి వాళ్ళ తాతగారి వూళ్ళో కని పించావట. యిక్కడికెట్లా వచ్చావు అమ్మాయి ?'' అని అడిగాడు.

శశి జరిగిన సంగతి చెప్పింది.

వీళ్ళిలా మాట్లాడుకుంటూవుండగా కుళ్ళాయిదగ్గర నిండిన బిందెయెత్తుకు వెళ్ళడానికి గౌరి అక్కడకు వచ్చింది. వచ్చి అక్కడ నిలుచునివున్న చిరపరి చితుడూ ఆత్మీయులలో ఒకడూ అయిన వెంకటనారాయణను చూసేసరికి గౌరి కట్టెబారిపోయింది. ముఖాన కత్తివాటుకైనా నెత్తురుచుక్కలేదు. తల వంచుకుంది. వెంకటనారాయణ ఆజానుబాహుడు. కంఠంగూడా పెద్దదే. అప్పుడు గౌరినిచూసి అన్నాడుగదా, "ఏం అమ్మాయి? నువ్వు చెడిపోయింది కాకుండా యీపిల్ల జీవితాన్నిగూడా ధ్వంసం చెయ్యదలుచుకున్నావా ? తాచెడ్డ కోతి వనమెల్లా చెరిచిందట!'' ఈ మాటలు కోపంతో అన్నాడు.

గౌరి చెప్పకుండా తలవంచుకుని అట్లాగే నిలుచుంది. ఆపర్న వెంకట నారాయణ శశిని వెంటబెట్టుకుని తీసుకువెళ్ళాడు.

అట్లా ఆ అమ్మాయిచేత పాడిస్తూ గరుడయ్య ఫిడేలు వాయిస్తూవుండగా లోనికి ఓ యువకుడు వచ్చి "యిక్కడున్నావా మావా! రాత్రికి గవర్నరు పేటలో హరికథట. ఫిడేలు వాయించడానికి యెవరో యిద్దరు నీకోసం తిరుగు తున్నారు'' అని చెప్పాడు.

"కావలిస్తే వాళ్ళే వస్తార్లే'' అనిచెప్పి గరుడయ్య మళ్ళీ ఫిడేలు వాయించ డంలో నిమగ్నుడయ్యాడు.

కాసేపటికి యిద్దరువ్యక్తులు అక్కడకువచ్చి "మీ కోసం యెక్క డెక్కడ తిరుగుతున్నామండి! రాత్రికి గవర్నరుపేటలో హరికథ. మీరు ఫిడేలు వాయించాలి'' అనిచెప్పి కిరాయి బేరంఆడుకుని ఓ అయిదురూపాయలు అడ్వా న్సుగాఇచ్చి వెళ్ళిపోయారు. గరుడయ్య అయిదురూపాయలు పుచ్చుకుని అవతల కూర్చున్న గౌరిమీదికి నిర్లక్ష్యంగా గిరాటువేశాడు. అప్పటికి పాడించడం ఆపి గరుడయ్య "యీ అమ్మాయి గాత్రం మంచిది. శ్రద్ధగా నేర్చుకుంటే వృద్ధిలోకి వస్తుందని" చెప్పాడు. అంతటితో అక్కడ కూర్చుని వింటున్న ఆడవాళ్ళు లేచి యెవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయ్యారు.

తర్వాత రెండు రోజులకు సాయంత్రంపూట గౌరి లోపల కూర్చుని తల్లో పెట్టుకోడానికి పూలమాల కట్టుకుంటూ వుండగా గరుడయ్య వచ్చి గౌరి దగ్గరగా మంచం వాల్చుకుని కూర్చున్నాడు.

"మధ్యాన్నం వస్తానని రాలేదేం?" అని అడిగింది గౌరి.

"పనుండివెళ్ళి యింతకుమునుపే తిరిగి వచ్చాను. నేను యింటికి వచ్చే వరికి నాకోసం మనుషులు కూర్చుని వున్నారు. యీ రాత్రికి గాంధీనగరంలో భరతనాట్యం వుందట. ఫిడేలు వాయించటానికి మాట్లాడుకుని వెళ్ళారు. వాళ్ళను అటు పంపించి నేనిట్లా వచ్చాను."

"యిందాక యెవరో మనిషి మీరు ఉన్నారా అని వచ్చివెళ్ళాడు. లేరనే వరికి 'యెక్కడా అందడు' అని గొనుక్కుంటూ వెళ్ళిపొయ్యాడు."

"నల్లగా వుంటాడు వాడా?"

"అతడే."

"బట్టలుకొట్టు వాడులే. మొన్న తెచ్చిన చీరెలు తాలూకు వాళ్ళకు కొంత డబ్బివ్వాలి. వచ్చేడబ్బు చాలడంలేదు. యెన్ని పాటాలు చెప్పుకుని, హరికధలు, భరత నాట్యాలు యెన్ని వాయిస్తే యేం లాభం. నా విద్యకు తగిన ప్రతిఫలం రావడంలేదు. యిక్కడ వున్నన్నాళ్ళూ యింతే."

"బెజవాడకంటే యింకా యెక్కడ డబ్బొస్తుంది?"

"ఏ ఫిలిం కంపెనీలోనన్నా చేరితే కావలసినంత డబ్బు. అక్కడ మంచి జీతాలు వుంటవి. యిట్లా బాకుగలకోసం యెదురు చూసే అవసరం లేదు. ఠంచనుగా నెలకాగానే జీతం వస్తుంది."

"అటువంటిదేమైనా దొరికితే [illegible] కావాలి? యింతకీ అదృష్ట ముండాలి."

"అదృష్టం అని యింట్లో కూర్చుంటే వస్తుందా?" ప్రయత్నించవండి. మద్రాసు వెళ్ళి యే ఫిలిం కంపెనీలోనన్నా చేరాలని చూస్తున్నాను."

"మిమ్మల్ని చేర్చుకుంటారా?"

"నాకంటే వాయించే మొనగాడెవడు?"

"వాయిద్యానికి కాదు, నేననేది? యెన్ని సిఫార్సులు వుండాలో అని."

"సిఫార్సులకేం కొదవలేదు. అక్కడ నాకో స్నేహితుడున్నాడు. మనం చేరాలేగాని అవకాశాలకేం తక్కువలేవు. మన వాయిద్యం వింటే వాళ్లు చస్తే వదులుతారా! యేదైనా కాస్త వీలు చిక్కిందంటే మనం మద్రాసులోనే కాపురం పెట్టేద్దాం."

"అయితే వదిలి పెట్టడందేనికి-ప్రయత్నించండి"

"మద్రాసు వెళ్ళడానికి ఖర్చులకు యాభైరూపాయలు కావాలి. చేతిలో డబ్బులేదు. యెట్లానా ? అని చూస్తున్నాను."

"లాభం వచ్చేటప్పుడు యేదో వీలుచూచుకుని వెళ్ళాలి."

"చూడు గౌరి ! మా యింట్లో ఆడమనిషున్న దే; వట్టి జంతువు. యిటువంటి వేమీ దానికి తెలియవు. నువ్వో అంటే, యిటువంటి విషయాలన్నీ నీకు బాగా తెలుసు. ఓ యాభైరూపాయలు సర్దగలవా; మళ్ళా వెంటనే తిరిగి వస్తుంది."

"మీరు యరగంది నాదగ్గర యెక్కడుంది డబ్బు !"

"నువ్వు తలుచుకుంటే యెలాగయినా యివ్వగలవు ! ఆడవాళ్ళు యిటువంటి మంచిపనికి చేయూత యివ్వకపోతే యెట్లా ? పని నెరవేరిన తర్వాత అంతా డబ్బే !! నీ మెళ్ళో నగన్నా పెట్టి తెచ్చియివ్వు. రేపే ప్రయాణం కడతాను" అని చెప్పాడు.

గౌరి ఆ మాటకు మౌనం వహించడంచూసి అతడు మళ్ళా అందుకున్నాడు "యాభైరూపాయలు యివ్వవలసి వచ్చిందే అని ఆలోచిస్తున్నావా? ముందువచ్చే లాభాన్ని పారచూడు. పేరుకు పేరు; డబ్బుకు డబ్బూ వస్తుంది. ఇక మనపేరు మోతేననుకో ! పైకివచ్చేటందుకు యిదే మంచిమార్గం. నేను మరోటిగూడా ఆలోచిస్తున్నాను. అక్కడ ఫిలింకంపెనీలో చేరిన తర్వాత నీకు గూడా యేదైనా వేషం యిప్పించాలని చూస్తున్నాను. నీ పరసనాలిటీగూడా మంచిదే. అదృష్టరేఖ పట్టిందంటే నువ్వు సినీమాతారవై పోవచ్చు ! అప్పుడు అంతా డబ్బే !! యిప్పుడు పేరులోవున్న సినీమాతారలంతా మొదట యిట్లా ప్రయత్నించి పైకి వచ్చినవాళ్ళే !" అని చెప్పాడు.

గౌరి ఆ మాటలు విని పొంగిపోయింది. తానో సినీమాతార కావచ్చునని, అందరి తారల్లాగా పత్రికల్లోనూ, వాల్‌పోస్టర్లలోనూ, తన ఫోటోగూడా

పడుతుందనీ, హాయిగా సిటీ జీవితం గడపవచ్చుననీ, యెన్నో గాలిమేడలు నిర్మించుకోసాగింది.

ఆ మర్నాడు ఉదయానే గౌరి తన నగకుదువబెట్టి యాభైరూపాయలు తెచ్చి గరుడయ్యను మద్రాసు పంపింది.

ఆ మధ్యాహ్నం భోజనాలయ్యాక యిరుగుపొరుగు ఆడవాళ్ళు గౌరి యింట్లో కూర్చున్నారు. వాళ్ళయింటి చుట్టుపట్ల వున్న గృహాలన్నీ అటువంటివే! గౌరి ఆవాళ బాగా అలంకరించుకుని యెంతోసంతోషంగా వుంది.

"యీ జాకెట్టు గుడ్డ యే కొట్లో కొన్నారు, చాలా బాగుంది," అని అడిగింది మాలిని.

"యేకొట్లో తెచ్చారోమరి. మొన్న ఆయన తెచ్చారు" అంది గౌరి.

"డబ్బులిస్తాగాని నాకుకూడా అటువంటిగుడ్డ తెప్పించిపెట్టు" అంది మాలిని.

"పంకజ యివాళ మంచిచీర కట్టిందే!" అంది గౌరి.

"మాకెక్కడనించి వస్తై? చాకలిదాని చలవవల్ల కట్టాను. బట్టలు లేకపోతే అద్దెకుతెచ్చి కట్టుకున్నాను" అంది పంకజ.

"అదృష్టం వుంటే ఎలాగైనా కలిసివస్తుంది. గౌరమ్మ సినీమానటి కాబోతుంటే!" అంది వెంకటమ్మ.

"నిజంగానా!" అని అడిగింది పంకజ.

"యింకా నిజమేంటి! యివ్వాళ వాళ్ళాయిన మద్రాసుగూడా వెళ్ళితే" వెంకటమ్మ.

"యెప్పుడేమిటి? మాకు తెలియదే!" అంటూ పంకజ, మాలిని 'యీవిడ భాగ్యమేం!' అన్నట్టు గౌరికేసి చూశారు.

"మద్రాసు వెళ్ళినమాట నిజమేగాని అక్కడ పనికావద్దు?" అంది గౌరి; కార్యసాధన అవుతుందని తనకు యెంత నమ్మకమున్నా యిప్పటినించి చెప్పెన యెందుకన్న తలంపుతో.

"పనికావడం యెంతసేపేంటి? మీఆయన సినిమాలో పిడేలు వాయిస్తుంటే నీకు వేషం యిప్పించలేడా యేంటి?" అంది వెంకటమ్మ.

"ఇంకేం, పీళ్ళాయన సినిమాలో ఫిడేలు వాయించడానికి వెళ్ళాడన్న మాట ! అయితే నీకు వేషం యిప్పించడం యెంతసేపు !" అంది పంకజ.

"అదృష్టమంటే అట్లా కలిసిరావాలి !" అంది మాలిని.

"మాతో యిక పలుకుతుందా గౌరమ్మ !" అంది పంకజ.

"పలక్క అప్పుడే ఆకాశానికి ఎగిరిపోతున్నా ! మీ నోటిచలవ వలన కావివ్వండి !" అంది గౌరి.

"కాక పట్టుకుంటుందా ! యిక మీఆయన అక్కడపని చేస్తున్నాక !" అంది వెంకటమ్మ.

"మా వెంకటమ్మపిన్నికి ఏదన్నా వేషం యిప్పించాలి !" అని నవ్వింది గౌరి.

"నాకెందుకులే ముసలిదానికి ? వయసువాళ్ళు మీరు కానివ్వండి!" అంది వెంకటమ్మ.

"ముసలివాళ్ళను మాత్రం యెందుకు తీసుకోరు పిన్నీ ! ముసలివేషాలు వెయ్యడానికి" అంది గౌరి.

"నాకెందుకులే అమ్మా, యింకా వేషాలు ! యిట్లా బతకనివ్వండి!" అంది వెంకటమ్మ.

"మొన్న యేంజరిగిందనుకున్నావు వెంకటమ్మ పిన్నీ ! అవతలవీధిలో ఫిలింకంపెనీవాళ్ళమంటూ ఓ యిద్దరు సూటూ, బూటూతో డాబుగా వచ్చి, యాక్టర్లను బుక్‌చేస్తున్నామంటూ, ఒక అమ్మాయిచేత పాడించుకుని, విని, 'నీపాట బాగుంది, నీరూపం బాగుంద'ని మెచ్చుకుని ఫిలింకంపెనీలో షేరు దార్లుగా చేరినవాళ్ళకే వేషాలు యిస్తున్నామని చెప్పగా షేరు రెండువేలేగదా; పదివేలు వచ్చేటప్పుడు రెండువేలు పెడితేమాత్రం యేంఅనుకుని ఆ అమ్మాయి నగలమ్మి వెయ్యిరూపాయిలు అడ్వాన్సుగా యిచ్చిందట ! యింకేం; వాళ్ళు ఆ అమ్మాయిని బుక్‌చేసుకుని తెలియపర్చిన వెంటనే రావలసిందని చెప్పి వెళ్ళిపొయ్యారు. ఆఅమ్మాయి జవాబు వస్తుంది వస్తుందని యెదురుచూస్తే యేముంది ? జవాబులేదు; గివాబులేదు. వాళ్ళు వెయ్యిరూపాయిలు తీసుకుని అదే పోవడం పొయ్యారు" అని చెప్పింది పంకజ.

"ఇటువంటి మోసాలుగూడా జరుగుతుంటవి. ఆమధ్య యిట్లాగే ఎవరో వచ్చి ఓ అమ్మాయికి వేషం యిస్తామని తీసుకెళ్ళారు. ఆ అమ్మాయి బాగా

చక్కంది. వేషం యిస్తామంటే యెవరికైనా ఆశేగా! ఆఅమ్మాయి మంచి వేషం యేదన్నా యిస్తారనుకుంది. తీరా వాళ్ళు నామకా యేదో పనికిమాలిన వేషం యిచ్చి ఆ అమ్మాయిని వలలోవేసుకుని ఖర్చులుయిచ్చి రైలు యెక్కిం చారట" అని చెప్పింది మాలిని.

"వెళ్ళి మంచివేషం యేసి పైకివచ్చినవాళ్ళు మాత్రం యెందుకులేరు!" అంది గౌరి.

"ఎందుకులేరే: అట్లా వున్నారు; ఇట్లా వున్నారు!" అంది వెంక టమ్మ.

"లేరని కాదు. జరిగిన సంగతి చెప్పా పిన్నీ!" అంది మాలిని.

పంకజ వీధిలోకి చూస్తూ, "యెవరో ఆ మనిషి యిటువేపు చూస్తూ వెళ్ల తున్నాడు" అంది.

"ఆ గుంటకళ్ళవాడా! ఇంకేం నీమీద కన్నువేశాడు!" అంది మాలిని.

"నామీదెందుకు వేశాడులే! నీమీదే వేశాడు!" అంది పంకజ.

"నీవేపేగా చూస్తూ వెళ్ళింది!" అంది మాలిని.

ఇంతలో గొర్రెలమందలో తోడేలు పడ్డట్టు తలగుడ్డచుట్టుకుని చంకలో కవిలకట్ట పెట్టుకుని వాయిదా సరుకులవాడు వచ్చాడు. అతణ్ణి చూసేసరికి పంకజ, మాలిని గుండెల్లో రైళ్ళు పరుగెత్తినవి.

"మీ యిళ్ళకు వెళ్ళితే అక్కడలేరు. యేవి డబ్బులు?" అని అడిగా డతడు.

అతనిదగ్గర వాళ్ళు వాయిదాకు కొన్ని గిల్టునగలు తీసుకున్నారు. 'నాలుగురోజుల్లో చూసి యిస్తాలే:' అంది పంకజ. మాలినిగూడా అదే మాట వప్పగించింది.

"వాయిదా వెళ్ళి యిరవైరోజులయితే యింకా నాలుగురోజులు ఆగాలా! క్షణంగూడా ఆగేటందుకు వీల్లేదు!" అని అతడు యింటిపెంకు లెగిరిపొయ్యే టట్లు అరిచాడు.

వాళ్ళు ఏ సమాధానం చెప్పినా అతడు వినటంలేదు. గల్లంతుగా అరు స్తున్నాడు. అప్పుడు వెంకటమ్మ "నాలుగురోజుల్లో నేను యిప్పిస్తాలే నాయనా! అని హామీపడి బ్రతిమలాడి అతణ్ణి పంపించింది.

గరుడయ్య వెళ్ళి నాలుగురోజులైంది. అతని రాకకోసం గౌరి ఒళ్ళంతా కళ్ళుచేసుకుని ఎదురు చూస్తూవుంది. మద్రాసులో కాపురం యెప్పుడా! అని ఆవిడ వేగిరపడుతూవుంది. సినీమాలో వేషం ఎన్నడా అని ఉవ్విళ్ళూరుతూ వుంది. యెట్లయితేనేం; ఆ మర్నాడు గరుడయ్య వచ్చాడు. అతడు వచ్చేసరికి గౌరి లోపలయేదో పనిచేస్తుందల్లా వదిలిపెట్టి అతని దగ్గిరికివచ్చి 'యేమైంది?' అని అడిగింది ఆత్రంగా.

గరుడయ్య అక్కడ వాల్చివున్న మంచంమీదకూర్చొని "యేమవుతుంది! నేను బండిదిగి వెళ్ళడం వెళ్ళడం త్యాగరాయ నగరంలో వున్న ఫిలింకంపెనీకి వెళ్ళాను. ఆవాళ యెవరూ అందలేదు. అంతా షూటింగులో వున్నారు. అక్కడే హాలులో బసచేసి ఆ మర్నాడు వెళ్ళాను. అంతా వున్నారు. నేను ఫలానా అని చెప్పగా సంతోషించారు. అబ్బ! ఆ భవనం ఎంత అందంగా వుంది! యెటుచూసినా గుడ్డమీద రంగులతో వ్రాసిన చిత్రాలు, విలువైన సోఫాలు, కుర్చీలు, నేలంతా కాలుపెడితే మాసిపోతుందా అన్నట్టు పాలరాయి. నేను ఆ పాలరాతిమీద పరిచిన తివాచీమీద కూర్చుని ఫిడేలు తీశాను, నా చుట్టూ సినిమాలో ఫ్లూటు, వీణ, హార్మోనియం, క్లారునెట్టు మొదలయిన వాయిద్యాలు వాయించే విద్వాంసులంతా కూర్చున్నారు. నేను ఫిడేలు వాయిస్తూ మంచిపోకడ పోతున్నాను. వేసినసంగతి వెయ్యకుండా వాయిస్తున్నాను. వాయిద్యం వింటూ వాళ్ళంతా ఆనందిస్తున్నారు. మనం వాయించేది బాగుందో లేదో ఒకళ్ళ నడగవలసిన అవసరంలేదు. వాళ్ళముఖాలే చెపుతవి. ఇంతలో యెవరో ఒకాయన వచ్చారు, లావుగా వున్నాడు. నా వాయిద్యం కాసేపువిని యికచాలన్నాడు. తర్వాత విచారిస్తే అతడే డైరెక్టరని తెలిసింది. అటు తర్వాత నేను అయన్ని కలుసుకుని మీ కంపెనీలో చేర్చుకోవలసిందని అడిగితే 'మాకు ఫిడేలు వాయించే వారున్నారు. కాళీలేద'ని చెప్పాడు" అన్నాడు గరుడయ్య.

ఆ మాట వినేసరికి గౌరి నిర్మించుకున్న గాలిమేడలు కూలిపోయినవి. ఆమె ఉత్సాహమంతా భగ్నమైపోయింది. నిస్పృహతో "అంతగా ఆశపడి వెళ్ళితే యింతేనా" అంది.

గరుడయ్య గౌరి ముఖం పరికించి 'అప్పుడే అయింది; పొంతం వినవేం!' అనేసరికి మళ్ళా ఆవిడ ముఖంలో ఆశారేఖ పొడచూపింది.

"వాళ్ళు కాదంటే అయిందా, మన దగ్గర సరుకుంటే ఎవరైనా తీసు కుంటారు ! నేను మరో ఫిలిం కంపెనీ వాళ్ళను పట్టుకున్నాను. ఆ డైరెక్టరు చాలా మంచివాడు. ఐక్కపలచగా పొడుగ్గా వుంటాడు. బలేచలాకీ అయిన వాడు. ఆయన నా వాయిద్యం విని నాలుక కరుచుకుని 'అయ్యో ! పాపం చాలా దూరంనించి వచ్చావు! మొన్ననే ఓ ఫిడలిష్టుని పెట్టుకున్నాం. రెండో ఫిడలిష్టు గూడా కావలసి వస్తుంది. తర్వాత మీకు వ్రాస్తాను' అంటూ నా అడ్రసు ఆదీ వివరంగా వ్రాసుకున్నాడు. తప్పక జవాబు వస్తుంది. మనకు మద్రాసు ప్రయాణం తప్పదు" అని చెప్పాడు.

అయినా తన వాయిద్యాన్ని గురించి తాను పొగుడు కోవడమే గాని వాళ్ళకు నచ్చనట్లు, అతని మాటల వల్లనే తెలుస్తున్నది. గౌరి యేమనుకున్నదో గాని 'యెప్పటికో వాళ్ళు రాసేది' అని నిట్టూర్పు విడిచింది.

మద్రాసునుంచి జవాబు వస్తుందని యిద్దరూ ఎదురుచూస్తూనే వున్నారు. తర్వాత నాలుగు రోజులకు సాయంత్రం గరుడయ్య వసారాలో కూర్చుని ఫిడేలు వాయిస్తున్నాడు. గౌరి దగ్గరగా కూర్చుని ఆలకిస్తున్నది.

ఇంతట్లో ఓ స్త్రీ అక్కడకు వచ్చింది. ఆ స్త్రీని చూసేసరికి గరుడయ్య పెద్దపులిని చూసిన మేకపిల్లలా హడలిపొయ్యాడు. ఫిడేలు వాయిస్తున్న అతని వ్రేళ్ళు అలానే నిల్చిపోయినవి. ఆ స్త్రీ వయస్సు ముప్పైఏళ్ళ పైచిలుకు వుంటుంది. చామనచాయ శరీరం. యెరుపురంగు చీరకట్టుకుని వుంది. ముఖం చూస్తే కనుబొమలు చిట్లించుకుని మూతిముడుచుకుని క్రోధంతో నిండివుంది. 'యీ మనిషి ఎవరా ?' అనుకుంటున్నది గౌరి.

ఆ స్త్రీ గరుడయ్యకేసి చురచురా చూస్తూ "యిక్కడ వున్నావా ? మళ్లా దీన్నొకదాన్ని మరిగావా ! ఆ బొండాందగ్గిరికి వెళ్ళితే ఇక్కడికి ఇప్పుడు రావడంలేదంది. కాళ్ళన్నీ అరిగిపొయ్యేటట్లు తిరిగి తిరిగి వస్తున్నాను. పెళ్లాం బిడ్డలు యే గంగలో దూకినాసరే ! మళ్ళా దీన్నోదాన్ని పెట్టుకుని కులుకు తున్నావా ? నీకు ఇన్ని యేళ్ళు వచ్చినై దేనికి, తగలబెట్టనా ! జ్ఞానం వుండ నవసరంలా ! పొద్దుట్నించి ఇంటిమొఖం చూడలేదు. వచ్చిన డబ్బంతా ఇట్లా పాడుజేసి ఇంటికాడ పిల్లల్ని నన్నూ మాడుస్తున్నావా ! పెళ్ళీడుకొచ్చిన పిల్ల గొంతుమీద కూర్చుంటే నీకేపేం బుద్ధులు ? మళ్ళా పదిమందిలో తగుదునని

తిరుగుతావు" అంటూ ఇంటి పెంకులు ఎగిరిపొయ్యేటట్లు అరిచింది. ఆమె గొంతు అసలే పెద్దదేమో, ఆ కేకలకు ఇల్లంతా దద్దరిల్లిపోయింది.

గరుడయ్య చేతిలో ఫిడేలు అక్కడ పడవేసి నిలబడి పిల్లిలా "ఎందుకట్లా అరుస్తావు, వస్తున్నాపద" అంటూ అక్కడ నిలవకుండా బయటికి జారుకున్నాడు. ఆవిడ వాక్ప్రవాహానికి తట్టుకోలేక గౌరి ముందుగానే ఇంట్లోకి తప్పుకుంది.

అప్పుడు ఆవిడ "అరుస్తానా, యింకా అరుస్తానా ! నా కడుపు మండిపోతుంటే! నువ్వెక్కడ తయారువద్దావే మాయదారిముండ ! యెవరికొంపలు తియ్యాలని కూర్చున్నావు ?...." అని గౌరిమీద గూడా అరిచి వెళ్ళిపోయింది.

ఆవిడ వేసిన కేకలకు, ఆవిడ వెళ్ళిన కాసేపటి వరకూ యిల్లు ప్రతిధ్వనించడం తగ్గలేదు.

౧౪

తర్వాత ఏణ్ణర్థం గడిచిపోయింది. అది కార్తీకమాసం. రాధాకృష్ణ ఉదయానే కాలకృత్యాలు తీర్చుకుని, డాబాపైన తన గదిలో కిటికీదగ్గర నిలుచున్నాడు. ఇంకా చలితగ్గలేదు. రాధాకృష్ణ చలిబనీను తొడుక్కుని వున్నాడు. అప్పుడే బాలసూర్యుని లేతకిరణాలు కిటికీలోనించి లోపలికి పడుతున్నవి. రాత్రి మంచుకు తడిసిన కొబ్బరిచెట్టు ఆకులు సూర్యకిరణాలు పడి మెరిసిపోతున్నవి. పెరట్లో పూలచెట్లనిండా పూలువిచ్చి కన్నులపండువగా వున్నది. రాజ్యలక్ష్మమ్మగారు పూలమొక్కల ఇవతలగా బక్కెట్లో చీరను నీళ్ళ తీస్తున్నది. అవతలవాళ్ళ దొడ్లో పాకలోవున్న గుర్రానికి సోములు దగ్గర నిలబడి యెవరిచేతనో మాలీసు చేయిస్తున్నాడు. వీధిలో జనం కాలువలు, దుప్పట్లతోనే వెచ్చవెచ్చటి కాఫీకోసం హోటళ్ళకు పరిగెత్తేవాళ్ళు, కూరలకోసం మార్కెట్టు కెళ్ళేవాళ్ళు వెళ్ళుతున్నారు. ఓ వితంతువు తడిబట్టతోనే మడినీళ్లు పట్టుకెళ్ళుతున్నది. ముసలమ్మలు వీధిగుమ్మాల్లో ఎండపొడలో కూర్చుని చలికాచుకుంటున్నారు. అవతల ఓ యింటిప్రక్క పిల్లలు చలిమంటలువేసి చలికాచుకుని కేరింతలు కొట్టుకుంటూ దాన్ని చల్లార్పుతున్నారు. రమఅన్న వాళ్ళ మేడపైన ఎండలో కూర్చుని పళ్ళు తోముతున్నాడు.

అలా చూస్తున్న రాధాకృష్ణకు చప్పున యేదో గుర్తుకురాగా యివతలకు వచ్చి డ్రాయరుముందు కుర్చీలో కూర్చుని పుస్తకంతెరచి యేదో వ్రాసుకోవడం మొదలుపెట్టాడు. రాధాకృష్ణ ఇంటరుపాసై యిప్పుడు బి. ఏ. చదువుతున్నాడు. అట్లా వ్రాసుకుంటున్న రాధాకృష్ణకు కిందనుంచి రాజ్యలక్ష్మమ్మగారి పిలుపు వినరాగా రాధాకృష్ణ వ్రాయడం ఆపి చేతిలోకలం వ్రాయుబల్లమీదపెట్టి కిందికి దిగివెళ్ళాడు. రాజ్యలక్ష్మమ్మగారు గుమ్మంలో నిలబడివుంది. రాధాకృష్ణ 'దేనికి అమ్మా' అని అడిగాడు.

రాజ్యలక్ష్మమ్మగారు "యివాళ కార్తీకపౌర్ణమి నాయనా! నోమునోచుకుంటున్నాంకదూ! నీకు తలంటి పోస్తా రా. ఇవాళ ఉపవాసంవుండి సాయంత్రం శివాలయానికి వెళ్ళివచ్చి వ్రతం చేసుకుని భోజనం చెయ్యాలి" అని చెప్పింది.

లక్ష్మణరావుగారు స్నానంచేసి బట్టలువేసుకుని కచేరిహాల్లో కూర్చుని వార్తాపత్రిక చూస్తున్నాడు. కల్యాణి అప్పుడే స్నానంచేసి బట్టలువేసుకుని వెంట్రుకలతడి పీల్చడానికి తలకు గుడ్డచుట్టుకుని లోపల గుమ్మంలో నిలుచుని వుంది.

రాధాకృష్ణ స్నానంచేసి తల తుడుచుకుని బట్టలువేసుకునే అంతలో రాజ్యలక్ష్మమ్మగారు ఐదురూపాయల కాగితం యిచ్చి 'బజారుకు కోటప్పనువెంట బెట్టుకువెళ్ళి జామపళ్ళూ, సీతాఫలాలూ, పట్టుకురా నాయనా! ప్రొద్దున్నే అయితే మంచిపళ్ళు వుంటవి" అని చెప్పింది.

రాధాకృష్ణ కోటప్పను తీసుకుని బజారుకు బయలుదేరాడు. పూర్వ స్మృతులు గుర్తుకు రాగా అతని మనసు ఆందోళనతో నిండివుంది. యిట్లాగే కార్తీకమాసం. అప్పుడు తన తండ్రిగూడా వున్నాడు. తనకు తొమ్మిదేళ్ళు వుంటవి. శశి చిన్నపిల్ల. అమ్మ యిట్లాగే తనకు తలంటి నీళ్ళుపోసి 'యివాళ కార్తీకసోమవారం వుంటున్నాం. అన్నం తినకూడదు నాయనా!' అని చెప్పింది. మొదట తాను బులపాటంగా ఉపవాసం వుండాలనుకున్నా భోజనం వేళ అయ్యేటప్పటికి తాను వుండలేకపొయ్యాడు. అప్పుడు అమ్మ కొని దాచి వుంచిన జామపళ్ళూ, సీతాఫలాలు తినమని యిచ్చింది. తన ఆకలి అమ్మకు తెలుసు. తాను వుండలేవని ముందుగానే పళ్ళు కొని వుంచింది. ఇట్లా కంటికి రెప్పలాగా తనను కాపాడిన అమ్మ యిప్పుడెక్కడుందో! తనను కాసేపు

చూడందీ వుండ లేని అమ్మ-బడినించి రావడం కొంచెం ఆలస్యం అయితే తహతహలాడిపోతూ తనకు యెదురువచ్చే అమ్మ తనకోసం ఎంత ఆటమ టించి పోతున్నదో! తండ్రి పోయినా తనను చూసుకుని ప్రాణాలు నిలుపు కుని, తాను ప్రయోజకుడై తనను వుద్ధరిస్తాడని, తనమీద యెన్నో ఆశలు పెట్టుకున్న అమ్మ యిప్పుడు యేకష్టాలు పడుతున్నదో. అమ్మ! బంధువుల యిళ్ళల్లో లేదు. అమ్మ యేపనీ చేసి యెరుగదు. యేపనీ చేతగాదుగూడా. ఎట్లా బ్రతుకుతున్నదో యేమో! తనచెల్లెలు అన్నానికి కాస్త ఆలస్యమైతే వుండ లేదు. గోలచేస్తుంది. యెక్కడవుంది యేం అవస్థలు పడుతున్నారో! యీ జీవి తంలో అమ్మను కలుసుకునే యోగం తనకు లేదా? పశు పక్ష్యాదులకూ, వాటి సంతానానికీ సంబంధం చిన్నప్పటివరకే. పశువులకు పాలు వదిలేటంతవరకూ. పక్షులకు రెక్కలు వచ్చేటంతవరకే వాటి తల్లీ బిడ్డల బాంధవ్యం. తర్వాత వేటికవే! తల్లీలేదు! బిడ్డాలేదు! యీ విశాలప్రపంచంలో కలసిపోతవి. తన స్థితిగూడా అంతే అయింది.

రాధాకృష్ణ మార్కెటు చేరుకున్నాడు. అక్కడ జనం సందడి సందడిగా వుంది. యిరువైపులా దుకాణాలు పెట్టుకుని కూర్చున్నారు. జామపళ్ళు బళ్ళతో రాసులుపోసి వున్నవి. సీతాఫలాలుమాత్రం రెండుమూడుచోట్ల వున్నవి. బేరం చేసి కొనుక్కునేవాళ్ళు కొనుక్కెళ్ళుతున్నారు. ఆ కొట్లముందు బిచ్చగాళ్ళు 'చిన్నకాయ ఒకటివ్వు బాబూ' అని గోలపెడుతున్నారు. రాధాకృష్ణ బేరంఆడి జామపండ్లు, సీతాఫలాలు కోటప్పదగ్గర వున్న సంచిలో వేయిస్తున్నాడు.

"ఓ జానికమ్మా!"

ఆ కేకకు అతని జీవనాడులు ఝంగున ప్రతిధ్వనించినవి. ఉగ్గుపాలతో తనలో జీర్ణించిన ఆపేరు రేయింబవళ్ళు పలవరిస్తున ఆ అమృతాక్షరాలు తన చెవుల పడేసరికి అతని పంచప్రాణాలు లేచివచ్చినవి. వెనక్కు తిరిగి దేవు లాడుకున్నాడు. యేముంది? అక్కడ యెవరో యెవర్నో పిలుచుకుంటున్నారు.

రాధాకృష్ణ కొట్టువాళ్ళకు డబ్బులిచ్చి కోటప్పచేత సంచి పట్టించుకుని బయలుదేరాడు. పదిఅడుగులు వేశాడో లేదో వెనకనించి 'రాధాకృష్ణా!' అన్న పిలుపు వినరాగా తిరిగిచూశాడు. పద్మనాభం వస్తున్నాడు. అతణ్ణి చూసి రాధా కృష్ణ నిలబడ్డాడు.

"ఏమిటోయ్ ! లాడూ, బీడూ వేసుకెళ్ళుతున్నావు ?" అని అడిగాడు పద్మనాభం.

"ఇవ్వాళ కార్తీక పౌర్ణమి కదూ:" అన్నాడు రాధాకృష్ణ.

"అయితే ఉపవాసం వుండి, ఖుసన్నీ మెక్కేస్తారన్నమాట!" అన్నాడు పద్మనాభం.

"దేవుడికోయ్ !" అన్నాడు రాధాకృష్ణ.

"దేవుడిది పేరు; మంచినోరు. యీ వుపవాసాలు వుండేవాళ్ళ సంగతి నాకు తెలుసు. మా బామ్మ ప్రతి ఏకాదశికి వుపవాసం అంటూవుండి శేరు వేపుడుపిండి చిమకూ, దోసకూ పోకుండా గుటకాయ స్వాహా చేస్తుంది." అన్నాడు పద్మనాభం.

"సరే కాని ! నిన్న వస్తానని మళ్ళా కంటికి కనిపించలేదేం ?" అని అడిగాడు రాధాకృష్ణ.

"ఒకచోటికి వెళ్ళవలసి వచ్చింది. ఓ స్నేహితుడు నువ్వు అనర్గళంగా మాట్లాడ గలవు. నాకు కాస్త సహాయపడాలని బలవంతపెట్టి నన్ను వెంటబెట్టు కొని ఓ ఆఫీసరు దగ్గరికి తీసుకెళ్ళాడు. అతడు దండలు కట్టుకుని కిక్కుమన కుండా ఆఫీసరు యెదుట నిలబడ్డాడు. నేనే అతని లెక్కలు చూపించి ఆఫీసరు అడిగిన దానికల్లా ఇంగ్లీషులో సమాధానాలు యిస్తుంటే ఆ ఆఫీసరు దంగై పోయి ఈ వుద్దండుడు యెవర్రా ! అన్నట్టు నాకేసి చూడ్డం మొదలు పెట్టాడు. అతడు అడిగిందానికల్లా తడువుకోకుండా ఏకొదమ్ముగ సమాధానం చెప్పాను. నేను చెప్పిన సమాధానాలకు ఆఫీసరు తృప్తిపడి లెక్క పుస్తకంమీద సంతకం పెట్టి యిచ్చేశాడు. బ్రతుకు జీవుడా అని బయటపడ్డాం. యిక బయటికి వచ్చిన తర్వాత ఆ స్నేహితుడు 'నువ్వుండబట్టి యివ్వాళ ఒడ్డున పడ్డాను. లేకపోతే ఆఫీసరు యెన్ని తిప్పలు పెట్టేవాడో' అంటూ గణ్ణం గడిచి బయటపడ్డట్టు పర మానంద భరితుడయ్యాడు." అని పద్మనాభం చెప్పే అంతలో వాళ్ళు నడుస్తూ రోడ్డుమలుపు తిరిగారు. ఇంతలో పార్థసారధి యెదురుపడ్డాడు.

"ఏం ! అలాముఖం వాడిపోయింది. పత్రికనించి కథేమన్నా తిరిగి వచ్చిందా ?" అని అడిగాడు పద్మనాభం.

పార్థసారధి వాళ్ళ సహాధ్యాయి. అప్పుడప్పుడూ కథలూ, గేయాలూ వ్రాస్తూ వుంటాడు. పద్మనాభం అడిగిన ప్రశ్నకు 'కాదోయి! తలకాయ నొప్పేసుకుంది' అన్నాడు.

"అయితే కొత్త కథేదో బుర్రలో తిరుగుతుందన్నమాట!" అన్నాడు పద్మనాభం.

"కాదోయ్! నీ అసాధ్యంకూలా. రాత్రి నిద్రకాచాను." అన్నాడు పార్థ సారధి.

"ఇంకేం; యే కథాసాహిత్యాన్నో వల్లిస్తున్నావన్న మాట!" అన్నాడు.

"అదీకాదోయ్! నీకు యెప్పుడూ అదే గొడవ. నాటకం చూశాను. మా వీధిలో రాత్రి పిల్లలు ఆడారు" అని చెప్పాడు పార్థసారధి.

"అదా సంగతి, ఆ మాటే ముందుచెపితే యిన్ని ప్రశ్నలు రాకపోనుగా! అయితే యెక్కడికి బయలుదేరావు?" అని అడిగాడు పద్మనాభం.

"కాఫీ తాగడానికి. ఇంతకుముందే లేచాను" అంటూ పార్థసారథి వెళ్ళిపోతూవుంటే పద్మనాభం అతణ్ణి వెనక్కిపిలిచి "యివాళ సాయంత్రం నాలుగింటికి కలుస్తావా?" అని అడిగాడు.

పార్థసారధి "అట్లాగే!" అన్నాడు.

పద్మనాభం "ఖచ్చితంగా నాలుగుగంటలకు యింటివద్ద వుండు; నేను మీ యింటికి వస్తాను" అని చెప్పగా పార్థసారధి వెళ్ళిపొయ్యాడు.

రాధాకృష్ణ, పద్మనాభం మాట్లాడుకుంటూ నడుస్తున్నంతలో తమయిల్లు సమీపించడంవల్ల 'వస్తానోయ్!' అని పద్మనాభంతో చెప్పి రాధాకృష్ణ కోటప్పతో యింట్లోకి వెళ్ళిపొయ్యాడు.

మధ్యహాల్లో తుంగచాపమీద కూర్చుని రాజ్యలక్ష్మమ్మగారూ, కల్యాణీ ప్రమిదెల్లోకి వత్తులు చేస్తున్నారు. నాగరత్నం వీళ్ళల్లో కలిసి యేపనీ చేయదు. ఆమెదోవ వేరు. ఆమె లేనిపని కల్పించుకుని "ఈ కెమ్మాలు యిట్లా చిలుంపట్టి వున్నవి. ఇవి ఇట్లా వుండవలసిందేనా? వీటిల్లో దీపారాధన యెట్లా చేస్తారు;" అని సణుగుతూ దీపపుకెమ్మాలు బయటికి తీసుకొచ్చి తోమడం మొదలుపెట్టింది. నిజానికి ఆ కెమ్మాలు పనిమనిషి తోమవలసినవి. పనిమనిషి తోముతుందని రాజ్యలక్ష్మమ్మగారు వూరుకుంది. నాగరత్నం అట్లా కెమ్మాలు తోముతూవుంటే

రాజ్యలక్ష్మమ్మగారు చూసి వూరుకుంది. ఔనన్నా కోపమే, కాదన్నా కోపమే! ఆవిడ యేపనిచేసినా రాజ్యలక్ష్మమ్మగారు వాగ్వాదం పెరుగుతుందని యేమీ అనదు.

ఇంతలో రాధాకృష్ణ బజారునించి కోటప్పచేత పంపు పట్టించుకురాగా రాజ్యలక్ష్మమ్మగారు రాధాకృష్ణతో "అవి లోపలపెట్టించు నాయనా!" అని చెప్పింది.

"రాజ్యలక్ష్మమ్మ! యెక్కడున్నారు? యెవరూ పలకరేం! ఓ రాజలక్ష్మమ్మా! విన్నేనమ్మా!" అంటూ ఓ ముసలమ్మ ఆవరణలో సాబా గడపలో వుండి కేకపెట్టగా రాజ్యలక్ష్మమ్మ బయటికివెళ్ళి "యేమిటి అమ్మమ్మా?" అని అడిగింది.

"యివాళ కార్తీకపౌర్ణమికదు! పౌర్ణమి వుంటున్నాం! కాసిని పూలుపెడుదురూ? మా ఆవిడ అడిగి తీసుకురమ్మంది" అని చెప్పగా రాజ్యలక్ష్మమ్మగారు "అట్లా వెళ్ళి కోసుకో అమ్మమ్మా!" అని చెప్పింది.

"అయ్యో! నా మీదే పెట్టావూ! చెట్లు అక్కడ వత్తుగా వుంటవి. పురుగూపుట్రా యేమన్నా వుంటయ్యేమో!" అనుకుంటూ చెట్లదగ్గరకు వెళ్ళి పూలు కోసుకుంటున్నది.

ఆ ముసలమ్మకు అరవై డెభై ఏళ్ళుంటవి. అతిచాదస్తం. దేన్ని చూసినా భయం. యెవరైనా ఆమెను ఆటలు పట్టించడానికి బూజులాంటివి మీదవేస్తే 'ఓయమ్మా!' అంటూ గంతులుపెడుతుంది. ఆమె వీధిన వెళ్ళుతూవుంటే పిల్లలు వెంటపడి ఆటలుపట్టిస్తూ వుంటారు. ఆమె పెళాపెళా తిట్టిపేసినకొద్దీ వాళ్ళ ఉత్సాహం యినుమడించి మరింత రెచ్చిపోతూ వుంటారు. అట్లా పూలు కోస్తున్న ముసలమ్మ 'చచ్చానో నాయనా!' అంటూ పెడబొబ్బ పెట్టింది. కోటప్పా, రాధాకృష్ణా పరిగెత్తుకుంటూ అక్కడకు వెళ్ళారు. ముసలమ్మ "అమ్మో! యింకేముంది!! యింకేముంది!" అని చిందులు పెడుతోంది.

"ఏమిటి అవ్వా?" అని రాధాకృష్ణ అడిగాడు.

"పాము నాయనా పాము! యెరక్కపోయివచ్చాను. యింకేముంది! యింకేముంది" అని ఆమె క్షోభలో అమె వున్నది.

కోటప్ప. రాధాకృష్ణ అదంతా కలియ జూచారుగానీ యేమీ కనిపించలేదు. తొండ ఒకటి కనిపించింది.

"పాముకాదు; యేమీకాదు. యీ తొండతోక చూసి ముసలమ్మ భ్రమ పడి వుంటుంది" అన్నాడు రాధాకృష్ణ.

కోటప్పకు ముసలమ్మ సంగతి బాగా తెలుసు. "దీని తలకాయ. యిక్కడెక్కడ పాములుంటై. యెండి నేల అద్దంలాగా వుంటే! నేను గమ్మత్తుచాత్తా గాని మీరట్టా సూత్తావుండండి!" అని మెల్లిగా రాధాకృష్ణతో చెప్పి "నిజంగా పామే ముసలమ్మా! అయ్యో! యింకేముందది!!" అనేసరికి ముసలమ్మ "అయ్యో! దేవుడా చేతికిగూడా తగిలింది. కరిచిందేమో!" అంటూ శోకాలు పెట్టడం ప్రారంభించింది.

ఆ గల్లంతుకు రాజ్యలక్ష్మమ్మగారూ, కల్యాణీ కచేరీహాల్లో వున్నవాళ్ళంతా అక్కడకు పరిగెత్తుకుని వచ్చారు. సంగతి విని అంతా కడుపుచెక్కలయ్యే టట్టు నవ్వారు - రాజ్యలక్ష్మమ్మగారు "వాళ్ళువిన్ను ఆటలు పట్టించటానికి అట్లా చెప్పారు. పామూలేదు, యేమీలేదు" అని చెపితే ముసలమ్మ ఆ మాటలు నమ్మదే! 'నేను కళ్ళారా చూశాను' అంటూ గల్లంతుచేస్తుంది. అక్కడున్న వాళ్ళంతా 'నువ్వు చూసింది తొండమ్మా తల్లి!' అని ఆమెకు నచ్చచెప్పేసరికి వాళ్ళ తాతలు దిగివచ్చారు.

దీపాలు పెట్టాక కుటుంబసైతంగా లక్ష్మణరావుగారుసహా అంతా శివాలయానికి వెళ్ళారు. అక్కడ జనం కిటకిటలాడిపోతున్నారు. దేదీప్యమానంగా ఆలయంనిండా యెక్కడ చూసినా ప్రమిదెల్లో దీపాలు వెలుగుతున్నవి. లోపలికి వెళ్ళేటందుకు సందుచిక్కడంలేదు; జనం తొక్కుళ్ళాడుతున్నారు. రాజ్యలక్ష్మమ్మగారూ, వాళ్ళూ లోనికివెళ్ళేటందుకు వీల్లేక బయటనిలుచున్నారు. రాధాకృష్ణ నందీశ్వరుడి దగ్గరగా నిలుచున్నాడు. ఆ జనంలో అంతా స్త్రీలే. మగవాళ్ళు తక్కువ. ఆ సమూహంలో తనతల్లి కనిపిస్తుందేమోనని అతని ఆశ! యెక్కడ పదిమంది కనిపించినా అప్రయత్నంగా అతనికళ్ళు తల్లిని వెదుక్కుంటవి. చిన్నప్పుడు అమ్మ తనవూరి శివాలయంలో తనను యెత్తుకుని పైన వ్రేలాడుతున్న గంటను కొట్టించింది. అర్చకుడు, తనకు శఠగోపురం పెట్టకపోతే అమ్మ అడిగి పెట్టించింది.

నిజానికి అమ్మ తర్వాత అమ్మలాంటిది రాజ్యలక్ష్మిగారు! తానంటే యెంతో ప్రేమగా వుంటుంది. ఆమెకు చెయ్యెత్తి దణ్ణంపెట్టవచ్చు: ఆ రోజున తనను లక్ష్మణరావుగారు కాపాడకపోతే తాను యేంకాను? ఆ దంపతులిద్దరూ తన పాలిటి దేవతలు! విద్యా, బుద్ధులు చెప్పించి తనను కన్నబిడ్డకంటే యెను మిక్కిలిగా చూసుకుంటున్నారు. వారి ఋణం యెప్పటికి తీర్చుకోగలనో!

జనం సందుకాగా రాజ్యలక్ష్మమ్మగారితో పాటు రాధాకృష్ణగూడా ఆల యంలోకి వెళ్ళాడు. లోనికివెళ్ళి స్వామిని దర్శించుకుని వచ్చేటప్పుడు రాధా కృష్ణకు ఆవరణలో నందీశ్వరుడి దగ్గరగా భారతి కనిపించింది. వాళ్ళ అమ్మా వాళ్ళు హారతి పళ్ళెం చేత్తోపుచ్చుకుని లోనికి వెళ్ళేటందుకు వీలుకాక అక్కడ నిలుచుని వున్నారు. రాధాకృష్ణ వాళ్ళనుచూసి రాజ్యలక్ష్మమ్మగారితో పాటు యింటికి వచ్చేశాడు. బ్రాహ్మడు వచ్చి మంత్రాలూ అవీ చదివి వ్రతకథలుచెప్పి వాళ్ళ భోజనాలు అయ్యేటప్పటికి రాత్రి తొమ్మిది దాటింది.

మర్నాడు రాధాకృష్ణకు మెళుకువ వచ్చేసరికి కిటికీలోనించి సూర్యకిర ణాలు లోపల పడుతున్నవి. ఎండవచ్చిందే అనుకుంటూ త్వరత్వరగా కిందికి దిగి వెళ్ళాడు. వాటికి రెండుగొడ్ల పాడి. కాఫీ యింట్లోనే కాచుకుంటారు. రాధాకృష్ణ కాలకృత్యాలు తీర్చుకుని కాఫీతాగి డాబామైకి వచ్చి తన గదిలో కూర్చుని పుస్తకం చదువుకుంటున్నాడు.

ఇంతట్లో కల్యాణి చేత్తో పుస్తకం పట్టుకువచ్చింది. కల్యాణి స్కూలు ఫైనలు ప్యాసై ఇప్పుడు ఇంటరు చదువుతున్నది. రాధాకృష్ణకు పుస్తకం విప్పి చూపిస్తూ "దీని మీనింగేమిటి? అర్థం కావడంలేదు. మా లెక్చరరు తొందర తొందరగా చెప్పుకెళతాడు. అర్థంకాదు, ఏమీకాదు" అంది.

"మీకు యీ పాఠాలకు వచ్చేదెవరు?" అని అడిగాడు రాధాకృష్ణ.

"బక్కపలచగా, పొడుగ్గా వుంటాడు. శ్రీరామమూర్తిగామాలు ఆయన పేరు."

"ఆయన మాకు లోగడ లెక్కలకు వచ్చేవాడు. ఆయన అంతే. వివ రంగా చెప్పడు. దడబిడా చెప్పుకెళతాడు" అంటూ రాధాకృష్ణ పుస్తకం చూపి దాని అర్థం విడమర్చి చెప్పాడు.

కిందనించి 'చెలియా కనరావా, నిరాశబూని పోయితివా' సోములు పాట వినవస్తున్నది.

ఇంతట్లో రమ వచ్చి "ఓహో! కల్యాణిగూడా వున్నదే!" అంటూ అక్కడ వాల్చిన మడతమంచంమీద కూర్చుంది. రమకు ఇంటరులో గ్రూపు పోవడంవల్ల కాలేజి మానేసి ఇంటివద్దనే చదువుతున్నది. 'ఏం, నిన్న నువ్వటు కనిపించనేలేదు?' రాధాకృష్ణను ఉద్దేశించి అడిగింది.

"నిన్న యెక్కడికీ కదల్లేదు. పౌర్ణమికదు! వుపవాసం వున్నాం" అన్నాడు రాధాకృష్ణ.

"ఉపవాసం వుండి పుణ్యం సంపాయించుకుంటున్నావన్నమాట!"

"ఉపవాసం వుంటేనే పుణ్యం వస్తుందా?"

"వస్తుందనేగా వుండడం!"

"మీరు ఉపవాసం ఉండలా?" అని అడిగింది కల్యాణి.

"యెవరుంటారు-యెక్కడో ముసలమ్మలు వుంటారుగాని!"

"మీ అమ్మ వుండదా?" అని అడిగింది కల్యాణి.

"దానికి తిన్నదాక తొందర. కాస్త వేళమించిందంటే కళ్ళు తిరుగుతున్నయని గొడవ చేస్తుంది."

"మీ నాన్న గొప్ప అడ్వకేటు - మీకేం కర్మం వుపవాసం వుండాలని" అన్నాడు రాధాకృష్ణ.

కల్యాణి నవ్వింది.

"నిజంగా మేం వుండలేం. నాలుగు కూరలులేంది మా కసలు తిన్నట్టే వుండదు. యెప్పుడైనా ఓ కూర తక్కువచేస్తే మా నాన్నగారు వంటమనిషి మీద కేకలు వేస్తారు" అంది రమ.

రాధాకృష్ణ నవ్వి "అందుకనే దేశంలో ఆహార పదార్థాల కొరత యేర్పడ్డది" అన్నాడు.

కల్యాణి, రమా యిద్దరూ నవ్వారు.

"అయితే రమా మార్చిలో మళ్ళా పరీక్షకు కూర్చుంటావా?" అని అడిగాడు రాధాకృష్ణ.

"కూర్చుంటాను. నాన్నగారు శ్రద్ధగా చదవమని చెప్తున్నారు."

ఇంతలో కోటప్ప వచ్చి "అయ్యగారు రమ్మంటుందారు" అని రాధాకృష్ణతో చెప్పాడు.

"వస్తా రమా!" అంటూ రాధాకృష్ణ లేచాడు.

"అయితే నేను గూడా వస్తా. సాయంత్రం అటు వస్తావుకదూ?" లేచి నిలుచుని అడిగింది రమ.

"వస్తాలే!" అంటూ రాధాకృష్ణ కిందికి దిగివెళ్ళాడు. ఆ వెంటనే రమ, కల్యాణి గూడా కిందికి దిగారు.

ఆ సాయంత్రం రాధాకృష్ణ కాలేజినించి వస్తూ రమ యింటికి వెళ్ళాడు. అది రెండంతస్తుల మేడ. కింద అంతస్థుకు 'యం. కమలనాథయ్య, బి. యె. బి. యల్., అడ్వకేటు' అని బోర్డు కట్టివుంది. రాధాకృష్ణ లోనికి వెళ్ళేసరికి కమలనాథయ్యగారు కచేరిహాల్లో కూర్చుని యేవో పుస్తకం తిరగవేస్తున్నారు. దగ్గరగా రెండు పెద్ద పెద్ద పుస్తకాల బీరువాలు, ముందుపైపున కొన్ని కుర్చీలు వేసివున్నవి. పుస్తకం తిరగవేస్తున్న కమలనాథయ్యగారు లోనికి వెళ్ళుతున్న రాధాకృష్ణను తలయెత్తిచూచి "ఏమోయ్ కనిపించడంలేదు:" అన్నారు.

"వస్తూనే వున్నానండి!" అన్నాడు రాధాకృష్ణ నిలబడి.

"అమ్మాయి మళ్ళా మార్చిలో పరీక్షకు కూర్చుంటుంది. నువ్వేమో వద్దెక్కావు: నీ సహాధ్యాయి గూడా కాస్త వద్దెక్కవద్దూ: అప్పుడప్పుడు వచ్చి యోగక్షేమాలు విచారిస్తూ వుండు. బడిమానేసింది కదా అని వూరుకోబోకు" అన్నాడు కమలనాథయ్యగారు.

రాధాకృష్ణ చిరునవ్వు జవాబుగా యిచ్చి లోనికి వెళ్ళాడు. మధ్యహాల్లో యెవరో చీరలు పట్టుకురాగా వాటి నాణ్యం పరిశీలిస్తున్న రమ తల్లి, శాంతమ్మ రాధాకృష్ణను చూసి ఆప్యాయంగా "రమ డాబాపైన వుంది: వెళ్ళు నాయనా" అని చెప్పింది.

రాధాకృష్ణ మెట్లెక్కి డాబాపైకి వెళ్ళాడు. రమ గదిని సమీపించి "రమాదేవిగారూ, లోనికి రావచ్చునా?" అన్నాడు.

"ఓ, రాధాకృష్ణ! రా, రా." అని ఆహ్వానించింది: డ్రాయరుముందు కూర్చుని యేదో వ్రాసుకుంటున్న రమ.

రాధాకృష్ణ లోనికివెళ్ళి అక్కడ వున్న కుర్చీలో కూర్చుంటూ "యేమిటో వ్రాస్తున్నావు?" అన్నాడు.

"ఈ లెక్క యెన్నిసార్లు వేసినా సరిఅయిన అన్సరు రావడంలేదు. మొండికేసింది." అంది.

"ఏది, యిట్లా చూపించు!" అని రాధాకృష్ణ రమ వేస్తున్న లెక్కచూసి అది చెయ్యవలసిన విధానం చెప్పాడు.

ఇంతలో రమ తమ్ముడు, ఐదారేళ్ళవాడు బూరవూదుకుంటూ, అక్కడకు రాగా "వెధవ! అల్లరి చేశావంటే చంపలు పగులుతై" అంది రమ.

అక్కడవుంటే అక్క కొడుతుం దని వాడు లోపలనించి గది బయటికి వచ్చి వూదటం మొదలుపెట్టాడు. అప్పుడు రమ "ఛా వెధవ! చెప్పేదినీకాదూ! చెవులు పోతుంటే!"అంటూ చివాల్న కుర్చీలోనుంచి లేచేసరికి వాడు కొడుతుందని భయపడి కిందికి పరుగుపెట్టాడు.

వాళ్ళు అవీ యివీ మాట్లాడుకుంటూవుండగా రెండు కప్పులతో కాఫీ, రెండు ప్లేట్లతో టిఫిను వచ్చింది. "పుచ్చుకో రాధాకృష్ణా!" అంది రమ.

ఇద్దరూ వాటిని ఖాళీచేశారు. తర్వాత కాసేపటికి రాధాకృష్ణ "వస్తా రమా" అంటూ లేచాడు. రమగూడా లేచి రాధాకృష్ణను కిందవరకూ సాగనంపింది.

రాధాకృష్ణ యింటికివచ్చి కాసేపు ఏదో వ్రాసుకుని దీపాలు పెట్టగానే పుస్తకం తీసుకుని రావుగారి యింటికి వెళ్ళాడు. రావుగారు వాళ్ళ కాలేజి లెక్చరరు. వాళ్ళకు లెఖ్ఖలకు వస్తాడు. ఆ వీధి చివరనే వారియిల్లు. రాధాకృష్ణ తరచు వారియింటికివెళ్ళి తెలియని విషయాలు వారిని అడిగి తెలుసుకుంటూ వుంటాడు. రాధాకృష్ణ వెళ్ళేసరికి ముందువసారాలో రావుగారికీ, మరి ఒకరికీ చర్చ జరుగుతూవుంది. రాధాకృష్ణ మంచి రసకుందాయంలో వెళ్ళాడు. వెళ్ళి వాళ్ళదగ్గరగా వున్న కుర్చీలో కూర్చున్నాడు.

"మీరన్నట్టు మనవాళ్ళు ముక్కు మూసుకుని జపతపాలు చెయ్యడం మోక్షంకోసం. మోక్షమంటే ఏమిటి? స్వర్గంలో రంభతో క్రీడించడమే కదు!" అంటున్నాడు రావుగారు.

"భౌతికవాదానికీ, ఆధ్యాత్మిక వాదానికీ అక్కడే తేడా. భౌతికవాదం ఇక్కడే సుఖం అనుభవించాలంటుంది; ఆధ్యాత్మికవాదం పరలోకంలో సుఖం అనుభవించాలంటుంది" అంటున్నాడు అవతల కూర్చున్నాయన.

"ఉభయులూ కోరుకునేది సుఖమేగదా; యిక్కడ అందుబాటులోవున్న సుఖాన్ని వదులుకుని యెక్కడో పరలోకంలో వుండని అందని పళ్ళకు అర్రులు చాచడం దేనికి?" అంటున్నాడు రావుగారు.

"ఇక్కడ సుఖం శాశ్వతమైందికాదు. పరలోకంలో సుఖం శాశ్వతమైంది" అంటున్నాడు అవతలాయన.

"పరలోకంలో సుఖం శాశ్వతమైందని కదా మీరంటున్నది; అది యిక్కడ భోగాలు విసర్జించి ముక్కు మూసుకుని జపతపాలు చేసినవాళ్ళకే సాధ్యమౌతుందనిగదా మీరనేది; శ్రీకృష్ణుడు గీతనుబోధించిన తత్వవేత్త. పదహారు వేలమంది గోపికలతో యిక్కడఅష్టయిశ్వర్యాలు అనుభవించలేదా? పరలోకంలో సుఖమనేది వుంటే ఆయన యెందుకు అలా చేస్తాడు" అంటున్నాడు రావుగారు.

"అక్కడే పొరబాటు పడుతున్నారు. శ్రీకృష్ణునికి పదహారు వేలమంది గోపికలు వున్నారంటే; దానికి అంతరార్ధం వున్నది. కాస్త లోతుకువెళ్ళితేనే గానీ అర్ధంకాదు" అంటున్నాడు అవతలాయన.

"అంతరార్థాలకేం. యేమైనా చెప్పవచ్చు. శ్రీకృష్ణుడుగానీ మరెవ్వరైనా గాని పరలోకంలో యెక్కడో సుఖపడదామని చూస్తూ చూస్తూ చేజేతులా యిక్కడవున్న సుఖాన్ని యెవరు వదులుకుంటారు" అంటున్నాడు రావుగారు.

"మీ ఇంగ్లీషు చదువుకున్నవారికి మేం చెప్పలేం" అంటూ ఆయన ఆ ప్రస్తావన కట్టిపెట్టి స్వంతవిషయాలేవో మాట్లాడుకుని వెళ్ళిపొయ్యాడు.

తర్వాత రాధాకృష్ణ రావుగారివల్ల పుస్తకంలో తన సందేహాలు అడిగి తెలుసుకుని యింటికి వచ్చేశాడు.

## ౧౫

తర్వాత రెండురోజులకు రాధాకృష్ణ ఉదయం కాలేజికి వెళ్ళుతూ వుండగా రావుగారి భార్య రాధాకృష్ణను పిలవగా లోనికి వెళ్ళాడు. రావుగారి భార్య రాధాకృష్ణను 'కూర్చో నాయనా!' అనగా రాధాకృష్ణ వసారాలో వున్న ఓ కుర్చీలో కూర్చున్నాడు.

"వారు యివ్వాళ వూళ్ళో లేరు. కలవుపెట్టి చుట్టాలయింటికి వెళ్ళారు. సరేకాని నాయనా, వారు కాలేజిదగ్గర యెవరితోనైనా మాట్లాడుతూవుంటారా?" అని అడిగింది.

'ఏమిటి యీామె యిట్లా అడుగుతుంది' అనుకుని రాధాకృష్ణ "ఎందుకు మాట్లాడరు? వారు మౌనంగా కూర్చునేరకం కాదు. అందరితోనూ బాగా మాట్లాడుతారు" అన్నాడు.

"అదికాదు నాయనా, నేననేది. ఆడవాళ్ళతో యెవరితోనైనా మాట్లాడుతారా?" అంది.

రాధాకృష్ణకు అప్పుడు ఆమెధోరణి అర్థమైంది. "ఏమోనండి, ఆడవాళ్ళతో మాట్లాడుతూవుండగా నేనెప్పుడూ చూడలేదు" అన్నాడు.

"అదికాదు నాయనా, ఓ ఆడమనిషి యర్రగా,బక్కపలచగా వుంటుంది; తల్లో పూలు అవీ పెట్టుకుని అప్పుడప్పుడూ మా గుమ్మంకేసి చూస్తూ యిటు వెళ్ళుతుంది. యెందుకా యీావిడ యిట్లా చూస్తూ వెళ్ళుతుందనుకున్నాను. ఒక రోజున వీధిగుమ్మంలో నిలుచుని వుండగా అదే సమయానికి ఆ మనిషి యిటు వెళ్ళుతూ వారితో మాట్లాడింది, 'ఆమనిషి యెవరండీ?' అని నేను వారితో అంటే 'నాకేం తెలుసు?' అన్నారు. 'యేమిటి ఆవిడతో మాట్లాడుతున్నారు' అని నేనడగ్గా 'నువ్వేమన్నా కలగంటున్నావా?' అన్నారు. యింకేమనను? నోరు మూసుకుని వూరుకున్నాను. మొన్న చిన్నమ్మాయీా, ఆయనా బజారుకు వెళ్ళితే బట్టలకొట్లో రెండు చీరలు కొన్నారట. అవి యింటికి తేలేదు. తర్వాత ఆసంగతి నాకు చిన్నమ్మాయి చెప్పింది. డబ్బంతా యిట్లా పాడు చేస్తున్నారు. ఇదివరకు జీతం తేగానే నాచేతికి యిచ్చేవారు. యిప్పుడు ఆయనే వాడుతున్నారు. యెవరెవరో బాకీలకు వచ్చి పోతూవుంటారు. వచ్చే డబ్బంతా యేంచేస్తున్నారో యేమో! బిడ్డలాగా వుంటావని నీతో చెపుతున్నా నాయనా!" అంటూ ఆమె కళ్ళనీళ్ళ పర్యంతం అయింది.

"కాలేజీవేళ అవుతుందండీ" అంటూ రాధాకృష్ణ అంతటితో తెముల్చుకుని వెళ్ళిపొయ్యాడు.

ఆ సాయంత్రం కాలేజీ వదిలిపెట్టగానే రాధాకృష్ణ, చంద్రం నడుస్తున్నారు. 'యివాళ పికౄరుకు వెడదాం' అన్నాడు రాధాకృష్ణ.

"ఏ పిక్చరుకూ?" అని అడిగాడు చంద్రం.

"దేనికో దానికి" అన్నాడు రాధాకృష్ణ.

"సరే, నేనింటికి వెళ్ళి భోజనం అదీ చేసుకుని సైకిల్‌మీద వస్తాను. రెండో ఆటకి వెళదాం."

"భోజనానికి యేమొచ్చెలేవోయ్. పదతాపదరా వెళ్ళావదం. రెండో ఆటకు నిద్రదండగ."

ఇంతలో వాళ్ళు రోడ్డు మలుపు తిరిగారు. ఆరోడ్డు వత్రికి జాస్తి. వచ్చే పొయ్యే జనానికీ, గుర్రంబళ్ళకూ, రిక్షాలకూ ఏసుగూ విరామం లేదు. రోడ్డు ప్రక్క పెట్టెదుకాణంలో సోడాలు మోగుతున్నవి. పల్లెపడుచులు కొందరు తాము తెచ్చిన కూరలూ అవీ అమ్ముకుని, ఆ డబ్బుతో వెచ్చాలు అవీ కొనుక్కుని, మూటలు నెత్తిమీద పెట్టుకుని యిళ్ళకు వెళ్ళుతున్నారు. జనంతో క్రిక్కిరిసిన గుర్రంబండి నగ పెటపెటలాడగా బండివాడు బండిఆపి జనాన్ని దింపుతున్నాడు. అందమైన అమ్మాయిలు యిద్దరు వాలుజడలు వేసుకుని చేత్తో పుస్తకాలు పట్టుకుని వెళ్ళుతున్నారు. రోడ్డుప్రక్క కొట్లో ఓ లావుపాటాయన అరటిపళ్ళు కొని ఒకదానితర్వాత వకటి అక్కడే తినివేస్తున్నాడు.

రాధాకృష్ణ, చంద్రం రోడ్డుప్రక్కగా నడిచే పోతున్నారు. చంద్రం అన్నాడు: "నిన్న యేం జరిగిందనుకున్నావు! ఆదివారం అవటంవల్ల యింటి వద్దనే వున్నానుగా! నాకు పిల్లనిస్తామంటూ యెవరెవరో వస్తున్నారట. అది వరకే మాఅమ్మ నాతో చెప్పింది. నిన్న యేమయింది! యింట్లో కూర్చుని నేను చదువుకుంటూ వుండగా మానాన్న వచ్చి 'వకరు నీకు పిల్లనిస్తామని తిరుగుతున్నార్రా. ఆస్తి, అదీ బాగా వున్నవాళ్ళు. సాంప్రదాయం మంచిది, కట్నంగూడా యిస్తామంటున్నారు. మా అందరికీ యిష్టమైంది" అని చెప్పాడు. అప్పుడు నాకు ఆశ్చర్యం వేసింది. ఆస్తిసంగతి చెప్పాడు, సాంప్రదాయాన్ని గురించి చెప్పాడు. కట్నంగురించి చెప్పాడు. కానీ పిల్లసంగతి చెప్పడేం! పిల్ల యెటువంటిదైనా ఫరవాలేదన్నమాట! పిల్లను గురించిన ఆలోచనే వాళ్ళకు వున్నట్టు లేదు. వాళ్ళకు కావలసింది సాంప్రదాయం, డబ్బు!"

"ఏమని సమాధానం చెప్పావు?" అని అడిగాడు రాధాకృష్ణ.

"బి. ఎ. పూర్తికాంది అసలు నాకు పెళ్ళి చేసుకోవాలని లేదుగా! యిప్పుడు నేను చేసుకోనని చెప్పాను. అప్పుడు మానాన్న 'ఎందుకు చేసుకో

వురా? అన్నప్పుడల్లా మంచి సంబంధాలు దొరుకుతయ్యా! కట్నంగూడా యిస్తామంటున్నారు. మనమేమో తగ్గులో వున్నవాళ్ళం. గొప్పింటివాళ్ళు వచ్చి పిల్లనిస్తామంటుంటే యెందుకు కాదనాలి?' అన్నాడు."

"కట్నం ఎంత?" అని అడిగాడు రాధాకృష్ణ.

"కట్నం ఎంతో తెలియదు. నేను ఊఁ అంటే ఇక కట్నం విషయమై బేరం ఆడతారన్నమాట!" అన్నాడు చంద్రం.

ఇంతలో వెనకనించి పద్మనాభం వచ్చి కలుసుకుని "యేమిటోయ్! యింకా యిక్కడే వున్నారు? పిల్లినడకలు నడుస్తూ వెళ్ళుతున్నారన్నమాట!" అన్నాడు.

"మీయింటివైపు వెళ్ళావుకదూ?" అన్నాడు రాధాకృష్ణ.

"ఇంటికి నే వెళుతూవుంటే కొంతదూరం వెళ్ళాక ఓపని గుర్తువచ్చి యింటికిపోయి మళ్ళా తిరిగిరావడం దేనికని మావాళ్ళ యింటికి వెళ్ళుతున్నాను" అన్నాడు పద్మనాభం.

రాధాకృష్ణ "సరే, మీనాన్నకు ఆఖరుకు యేంచెప్పావు?" అని అడిగాడు చంద్రాన్ని.

"చెప్పేదేముంది? చదువు పూర్తి అయ్యేవరకూ చేసుకోనని ఖండితంగా చెప్పేశాను" అన్నాడు చంద్రం.

"చంద్రానికేమన్నా సంబంధాలు వచ్చినయ్యా యేమిటి?" అని అడిగాడు పద్మనాభం.

"ఏదో సంబంధం వచ్చిందట" అన్నాడు రాధాకృష్ణ.

"ఏమోయ్, చంద్రం! యిప్పుడు చేసుకోవా యేమిటి?" అని అడిగాడు పద్మనాభం.

"ఇప్పుడేం తొందరొచ్చింది?" అన్నాడు చంద్రం.

"మార్కెట్లో కట్నాలకు మాంచి డిమాండుగా వుందిలే! అయితే నాదో సలహా! కట్నం కావలిస్తే పిల్లను చూడనవసరంలేదు; పిల్ల కావలసివస్తే కట్నం చూడనవసరంలేదు" అన్నాడు పద్మనాభం.

"అంతేనంటావా!" అన్నాడు రాధాకృష్ణ.

"అంతే! మార్కెట్లో మంచిసరుకు నిల్వనిస్తారా? ఎవరో అప్పుడే తన్నుకెళతారు. ఖర్చు పడకుండా నిల్వవున్న సరుక్కి యీ మెరుగులన్నీ! ఆవిడ నెత్తిన రూపాయలమూట పెడితేనేగాని యింట్లోనించి కదిలివెళ్ళదు. మాపేటలో యేమైంది! ఓ అమ్మాయి వుంది; వగులుచూస్తే కాత్రి కల్లోకొస్తుంది. వాళ్ళు డబ్బుగలవాళ్ళు. ఆ అమ్మాయికి పెళ్ళిచెయ్యాలని మెన్నో ప్రయత్నాలు చేశారు కానీ లాభంలేకపోయింది. ఆఖరుకు వాళ్ళు ఆ అమ్మాయిని యిరవై వేల రూపాయల కుప్పమీద కూర్చోబెట్టేసరికి ఆ అమ్మాయి అందవికారం కప్పేసి రంభలా కనిపించగా యెవరో అమాంతం తన్నుకెళ్ళారు" అన్నాడు పద్మనాభం.

"పిల్ల అందంగావుంటే కట్నం రావనా నీ వుద్దేశం?" అని అడిగాడు రాధాకృష్ణ.

"రాదు! పిల్ల అందంగావుంటే వాళ్ళదగ్గిర డబ్బుండదు. యెలా కట్నం వస్తుంది? డబ్బుగలవాళ్ళ దగ్గర చూద్దామా; అందమైన పిల్లలు వుండరు!" అన్నాడు పద్మనాభం.

"డబ్బుగలవాళ్ళ దగ్గర మాత్రం యెందుకు మంచి పిల్లలు వుండరోయ్?" అన్నాడు రాధాకృష్ణ.

"సాధారణంగా వుండరు. యెక్కడో ఒకళ్ళు వున్నారంటే అది లెక్కలోదికాదు. డబ్బుగలవాళ్ళ యిళ్ళలో ఆడపిల్లలు అందంగా వుండరు, మొగపిల్లలకు చదువు సరీగా అబ్బదు. ఒక్కొక్కడు ఒక్కో క్లాసులో నాలుగేళ్ళు మూడేళ్ళు దండయాత్రలు చేస్తూవుంటాడు" అన్నాడు పద్మనాభం.

"నీదంతా విపరీతమోయ్! పరీక్ష తప్పడానికి కూడా డబ్బే కారణమా?" అని అడిగాడు రాధాకృష్ణ.

"ఆహా, డబ్బే కారణం. వాళ్ళు పిల్లల్ని పెంచడంలోనే గారాబంపెట్టడం వల్ల ఆగతాయిగా తయారవుతారు. వాళ్ళను చదవేస్తే చేతినిండా డబ్బుచిక్కడం వల్ల జల్సాలమీద వున్న సరదా చదువుమీదలేక దండయాత్రలు చేస్తూ వుంటారు" అన్నాడు పద్మనాభం.

"ఇంతకీరేపు నువ్వు పిల్లనే చూస్తావో; కట్నాన్నే చూస్తావో చూడాలి!" అన్నాడు రాధాకృష్ణ.

"ఓ చూద్దువుగానిలే! అదే మావాళ్ళ యిల్లు" అంటూ పద్మనాభం వెళ్ళి పోయాడు.

"రాధాకృష్ణ, చంద్రం ప్రక్కవీధి మలుపు తిరిగారు. ఆ వీధంతా కాపురంచేసే యిళ్లు. షాపులేమీ లేవు. కొందరు గృహిణులు గుమ్మాలముందు సందెకసువు చిమ్ముకుంటున్నారు. కొందరు స్త్రీలు రాత్రికి వంటప్రయత్నం చేస్తూవుండడంవల్ల ఇళ్ళల్లోనించి సన్నగా పొగ బైటికి వస్తూవుంది. ఎండ తగ్గిపోవడంవల్ల చలిగాలి ప్రారంభించింది. వృద్ధుడైన సూర్యుడు చలికి ఎర్రటి శాలువా కప్పుకుని గృహోన్ముఖుడయ్యాడు. రాధాకృష్ణ, చంద్రం అయిదారిళ్లు దాటాక తలవని తలంపుగా అవ్వా, భారతీ కనిపించారు. యిద్దరూ ముందు నడిచి వెళ్ళుతున్నారు. రాధాకృష్ణ, చంద్రం వాళ్ళను సమీపించారు. భారతి మొఖం కళకళ్లాడుతూ ఉండేదల్లా యెందుకో చిన్నబోయి వున్నది. 'అవ్వా యెక్కడినుంచి వస్తున్నారు?' అని అడిగాడు రాధాకృష్ణ.

"మవ్వా నాయనా, మా వాళ్ళ యింటికి వెళ్ళివస్తున్నాం. అమ్మాయి పెళ్ళి వారంరోజుల్లోకి వచ్చింది. యిప్పటినించి యత్నాలు చేసుకోవాలిగా నాయనా! ఆ విషయాలు మాట్లాడటానికి మావాళ్ళ యింటికి వెళ్ళివస్తున్నాం. యిప్పుడు నాకు బొత్తిగా చూపు తగ్గిపోయింది నాయనా! దూరపుచూపు కనిపించదు.అమ్మాయిని వెంటబెట్టుకుని వెళ్ళివస్తున్నాను" అని చెప్పింది.

పెళ్ళనగానే కళకళలాడుతూ వుండవలసిన అమ్మాయి యిలా వున్నదేం! యీమధ్య యేమన్నా జ్వరంపడ్డదేమో అనుకుని "ఏవూరిచ్చారు అవ్వా?" అని అడిగాడు రాధాకృష్ణ.

"వూళ్ళోనే నాయనా! వాళ్ళకు బజార్లో బట్టలకొట్టు అదీ వుంది వాళ్లు కాపురం వుంటున్న యిల్లుకాక మరో డాబా వుంది. అద్దెలు చాలావస్తవి. స్థితి పరులే!" అని చెప్పింది అవ్వ.

"కుర్రవాడు యేంచదువుకున్నాడు?" అని అడిగాడు రాధాకృష్ణ.

"కుర్రవాడు కాదునాయనా, పెద్దవాడే! యెక్కువ యీడుపోయినవాడు కాదు!" అంది అవ్వ.

"అయితే రెండో సంబంధమా?" అని అడిగాడు రాధాకృష్ణ.

వీళ్ళట్లా మాట్లాడుకుంటూ వుండగా భారతి వెనక్కి తగ్గి కొంచెం దూరంగా నడిచి వస్తున్నది. రాధాకృష్ణ అడిగిన ప్రశ్నకు అవ్వ:

"అవును నాయనా! వున్నవాళ్ళే కాకుంటా మంచి సాంప్రదీకులు. ఒకళ్ళ జోలికీ, వకళ్ళ తెరువుకూ వచ్చేవాళ్ళు కాదు. వాళ్ళ వ్యాపారమేమిటో, వాళ్ళేమిటో. పిల్ల సుఖపడుతుందని యిచ్చాం'' అని చెప్పింది.

రాధాకృష్ణకు కడుపులో చెయ్యిపెట్టి కలచినట్లయింది. ఆ అమ్మాయి యెందుకట్లా వున్నదో అప్పుడతనికి అర్థమైంది. "అతనికి యెన్నేళ్ళుంటవి?'' అని అడిగాడు.

"ఏమంత యీడుపోయినవాడు కాదు నాయనా! అతడు ఎంత మంచి మంచివాడనుకున్నావు! మరి ఒకళ్ళకైతే కట్నాలూ, కానుకలూ యెదురు పెట్టాలా? పెదవాళ్ళ మవిచెప్పి మన చేతిది కానీ తగలకుండా మనకయ్యే ఖర్చులుగూడా అతడే భరిస్తానన్నాడు. యివన్నీ మా కోడలికేం తెలుసు! రెండో సంబంధమని ఒకరోజల్లా అన్నం తినకుండా మా వాడిమీద అలిగి పడు కుంది" అని చెప్పింది.

అప్పుడు రాధాకృష్ణ ఈడుపోయినవాడు కాబట్టే యెక్కడా పిల్లనిచ్చే వాళ్ళు దొరక్క యింకా వీళ్ళకే యెదురుపెడుతున్నాడని మనసులో అనుకుని- "ఏం అవ్వా! ఆఖరుకు యిట్లా చేశారు?" అని అడిగాడు.

"ఏం చెయ్యాలి నాయనా! యెవర్ని కదిలించినా జాస్తి కట్నాలమీద కూర్చున్నారాయే! యెక్కడనించి తేము. కట్నాలిచ్చి చేసిన పెళ్ళిళ్ళుమాత్రం సరిగా వుంటున్నయ్యా? వాడు సరిగా యేలీ యేలక—యేదో తినా, కుడవా వున్నవాళ్ళు-పిల్ల సుఖపడుతుందని యిచ్చాం" అంది అవ్వ.

ఇక ఈమెతో యేంమాట్లాడితే యేంలాభం అనుకుని రాధాకృష్ణ "వస్తా అవ్వా!" అన్నాడు.

అప్పుడు భారతి అతనికేసి దీనంగా చూసిన చూపులు అతణ్ణి కలచివేసి నవి. కటికివాడి కత్తికింది వున్న మేక ఆఖరి క్షణంలో చూసే చూపులవి. ఆ చూపులు అతని గుండెలను ద్రవింపజేసినవి.

రాధాకృష్ణ, చంద్రం ముందుకు వెళ్ళిపొయ్యారు.

"ఆ అమ్మాయిని చూశావా? లోగడ వాళ్ళింటికి వెళ్ళితే నన్ను చేసుకో మన్నారని నీతో చెప్పానే; యీ అమ్మాయే!" అన్నాడు రాధాకృష్ణ.

"అట్లాగా! అయితే యీ అమ్మాయిని నే నెరుగుదును. యీ అమ్మాయి తాతగారి యిల్లు మా వూరే" అన్నాడు చంద్రం.

"అట్లాగా! యీ అమ్మాయి మా చెల్లెలు మాదిరిగానే వుంటుంది. అందు వల్ల సోదరిభావంతో వాళ్ళింటికి వెళ్ళేవాడిని. యిప్పుడు యేంచేశారో చూశావా! బంగారంవంటి బిడ్డను ఓ ముసలివాడికి కట్టపెట్టారు."

"మీరనుకునే మాటలు వింటూనే వున్నా"

"కళకళ్ళాడుతూవుండే ఆ అమ్మాయి ముఖం యెలా చిన్నబోయిందో చూశావా! యిష్టంలేనిపెళ్ళి!"

"రూపమూ అదీ చాలా మంచిఅమ్మాయి"

"రూపమే కాదు; బాగా చదువుకుంది. ఆ అమ్మాయికి హిందీకూడా వచ్చు. అల్లికం పని ఎంతో నేర్పుగా చేస్తుంది. అటువంటి తెలివిగల అమ్మా యిని ఓ ముసిలివాడికి కట్టపెట్టారంటే నాకెంతో బాధగా వుంది"

"నీకేగాదు-నాక్కూడా కష్టంగానే వుంది. ఆ అమ్మాయిని నేను చిన్న ప్పటినించి యెరుగుదును. ఇక ఆ అమ్మాయి జీవితం యేముంది?"

"సుఖపడుతుందని యిచ్చామంటుంది అవ్వ. కేవలం డబ్బువలనే సుఖ పడుతుందని వాళ్ళ వుద్దేశం. భర్త యిష్టంలేక జీవితం దుఃఖభాజనమైనప్పుడు డబ్బు ఆ అమ్మాయికేం సుఖాన్నివ్వగలదు?"

"అంతేమరి! యీడూ, జోడూ సరిగా వున్నప్పుడే జీవితం సంతో షంగా వెళ్ళబుచ్చ గలుగుతారు."

"కట్నాలకు ఆశపడి అటువంటి అమ్మాయిని యువకులెవరూ చేసుకో లేదంటే యేమనుకోవాలి?"

"కేవలం కట్నాల కాశపడడంవల్ల యువకులు చేసుకోలేదంటానికి వీల్లేదు. చేసుకుంటామని వచ్చినవాళ్ళు వీళ్ళకు నచ్చకపోవచ్చు. యువకుడే బీద వాడున్నాడనుకో; వాడికిస్తారా! ముందు డబ్బును చూసిగాని పిల్లనివ్వరు"

"అట్లాగాకూడా కావచ్చు. యింతకీ తల్లితండ్రులు ఆ అమ్మాయి జీవి తాన్ని ధ్వంసం చేశారు."

ఇంతలో యిల్లు సమీపించడంవల్ల రాధాకృష్ణ, చంద్రం యిద్దరూ లోనికి వెళ్ళారు. ప్రొద్దు కూకటానికి యెంతో వ్యవధి లేదు. చీకటి తరుముకొస్తూ వుంది. చెట్లమీద పక్షులు తమ సంతానాన్ని కలుసుకుని హర్షధ్వానాలు చేస్తున్నవి.

రాధాకృష్ణ, చంద్రం డాబాపైకి వెళ్ళి పుస్తకాలు గదిలో పడవేసి సినిమాకి వెళ్ళిపొయ్యారు.

వాళ్ళు సినిమానించి వచ్చేసరికి తొమ్మిది దాటింది. చలి బాగా విడులు తున్నది. లక్ష్మణరావుగారు భోజనంచేసి ఉన్నిబనీను వేసుకుని కచేరీహాల్లో ఏకాంతంగా కుర్చీలో కూర్చుని పట్టపగల్లాగా వున్న ఎలక్ట్రిక్ దీపపు కాంతిలో యేవో కాగితాలు చూసుకుంటున్నారు. వాళ్ళిద్దరూ లోనికి వెళ్ళారు. చంద్రం వారి యింట్లో అదివరకు రాధాకృష్ణతోపాటు నాలుగైదుసార్లు భోజనం చేసివున్నాడు. ఎంతమంది వెళ్ళినా వారింట్లో భోజనానికేమీ కొరత వుండదు. రాజ్యలక్ష్మమ్మగారు యిద్దరికీ భోజనం వడ్డించగా తిని చేతులు కడుక్కుని యిద్దరూ డాబాపైకి వెళ్ళిపొయ్యారు. డాబాపైకి వెళ్ళి స్విచ్చివేసి గదిలో చెరో కుర్చీలో కూర్చున్నారు.

రాధాకృష్ణ మనసు వ్యాకులంగా వుంది. భారతి దీనవదనమే అతని కళ్ళల్లో మెదులుతూ వుంది. ఆ అమ్మాయిని గురించిన ఆలోచనే అతని బుర్రలో పనిచేస్తున్నది. సినిమాలో కథగూడా అతని ఆవేదనను ద్విగుణీకృతం చేసింది. ఉమ అనే అమ్మాయి ఒక యువకుణ్ణి ప్రేమిస్తుంది. ఉమ తల్లితండ్రులు ఆ యువకుడికి ఉమను యివ్వడానికి యిష్టపడక మరి వకరికి యిచ్చి పెళ్ళిచేస్తే ఉమ ఆత్మహత్య చేసుకుంటుంది. కేవలం భారతి కథ అది కాకపోయినా సామ్యంమటుకు లేకపోలేదు. సినిమా చూస్తున్నంతసేపూ భారతే అతని దృక్పథంలో మెదులుతున్నది. ఆఖరకు కళ్ళనీళ్ళతో హాల్లోనించి బైటికి వచ్చాడు రాధాకృష్ణ, అప్పటినించి అదే ఆలోచన. లోకంలో యిష్టంలేని పెళ్ళిళ్ళు చేయడంవల్ల యిట్లా యెన్ని ఆత్మహత్యలు జరగటంలేదు! అందులో భారతిని యిచ్చింది వయసుమళ్ళినవాడికి. యిక ఆ అమ్మాయి ఏం నిలుస్తుంది. యే అఘాయిత్యమైనా చేసుకోవచ్చు; లేదా దుఃఖంతో కృశించి, కృశించి నీళ్ళకారైనాపోవచ్చు. ఆ అమ్మాయి ముఖం చూస్తేనే అర్థమౌతుంది; ఆ

అమ్మాయి బ్రతికి బాగా వుండాలంటే, వక్కటే మార్గం! యీపెళ్ళి తప్పించి వెయ్యాలి! నిజంగా తన చెల్లెలికే యిటువంటి సంబంధం చేస్తే తాను చూస్తూ వూరుకోగలడా? యీ ఆలోచనతో అతని బుర్ర వేడెక్కిపోతున్నది.

ఎదురుగా గోడమీద బల్లి దీపపుకాంతిలో పురుగులను వేటాడుతూ వుంది.

"ఆ అమ్మాయిని గురించే నాకు ఆందోళనగా వున్నదోయ్ చంద్రం! యిష్టంలేని పెళ్లి యెన్ని అనర్థాలనైనా తెచ్చిపెట్టవచ్చు. జీవితంమీద విరక్తి పుట్టి యే అఘాయిత్యానికైనా తలపడితే యేముంది. ఆ అమ్మాయి ముఖం చూస్తే నాకట్లా అనిపిస్తున్నది" అన్నాడు రాధాకృష్ణ.

"నిజమే మరి. యిష్టంలేని పెళ్లి" అన్నాడు చంద్రం.

"యీపెళ్లి ఆపించివెయ్యాలోయ్!"

"మనకెలా సాధ్యమౌతుంది? తల్లితండ్రులు యిష్టమై చేస్తున్నాక."

"తల్లికి యిష్టం లేదు. తల్లి ఆలిగి పడుకుందని ఇందాక అవ్వ చెప్పింది కదూ. పిల్లకా అసలే యిష్టంలేదు. యిక తండ్రి బలవంతంమీద చేస్తున్నారు. ఆపివేయడం యేమంత కష్టమైన పనికాదు!"

"ముందు యిష్టం లేకపోయినా తర్వాత అంతా ఆమోదించి చేస్తున్నట్టేగా!"

"ఏం ఆమోదించటం. యిష్టం లేకపోయినా విధిలేక వూరుకోవడం. పెళ్లి ఆగిపోయిందంటే సంతోషిస్తారు."

"ఏవిధంగా ఆపివేయించ వచ్చుని నీ వుద్దేశ్యం?"

"వుంది చెపుతాను!"

"అట్లయితే ఆపివేయడం మంచిదే!"

"అయితే ఓ సందేహం. పెళ్ళి ఆపివేయిద్దామనుకో! తర్వాత కట్నాల మీద కూర్చుని! యువకులెవరూ చేసుకోడానికి రాకపోతే, వీళ్ళేమో కట్నానికి తూగరాయె."

"అదా, నీ సందేహం! యువకులంతా కట్నాలమీద కూర్చున్నారన టానికి వీల్లేదు. ఆర్థికపుష్టిలేని యువకులు ఆ అమ్మాయిని చూసి చేసుకోవాలని

ఉవ్విళ్ళూరి మనకెందు కిస్తార్లే అనుకుని విరమించుకున్నవాళ్ళు యెంతమంది వున్నారో మరి! పారచూస్తే డబ్బుగలవాళ్ళకంటేగూడా డబ్బులేని వాళ్ళలో మంచి యువకులు దొరుకుతారు" అన్నాడు.

"దొరకరనికాదు. అసలే కట్నాలు వేలం వెర్రిగా వుందే యెవరైనా గాని ఆ సమయానికి చెయ్యి చాచకుండా వుంటారా అని"

"నీకు అటువంటి సందేహం వద్దు. కట్నాలమీద ఆశ, డబ్బుగలవాళ్ళకే గాని డబ్బులేని వాళ్ళకు అట్టే వుండదు!"

"ఆ అమ్మాయిని చేసుకోడానికేం! యెవరైనా కళ్ళ కద్దుకుని చేసుకుంటారు యెవరుదాకో దేనికి; మాదగ్గర డబ్బులేదు. ఆ అమ్మాయిని నాకు గనుక యిస్తే బంగారంలాగా చేసుకుంటాను" అన్నాడు.

రాధాకృష్ణ చివాలున కుర్చీలోనుంచి లేచి చంద్రంచెయ్యి పట్టుకుని ఊపుతూ "యెటువంటి సంతోషకరమైనమాటవిన్నానోయ్! నీకు యివ్వడానికేం బంగారంలాగా యిస్తారు. డబ్బెందుకు - బుద్ధిమంతుడివి. బి. ఎ. చదువుతున్న వాడివి! నీకంటే మంచి సంబంధం యెక్కడ దొరుకుతుంది! నీకిప్పించే భారం నాది. అయితే చూశావు; నీకు మీవాళ్ళు యెట్లయినా సంబంధాలు వెదుకు తున్నారుగదా! ఈ అమ్మాయిని చేసుకోమని చెపుదామనుకున్నాను, గానీ మళ్ళా ఈ విషయాల్లో వాళ్ళకు యిష్టమయితేనే తప్ప ఒకళ్ళు కలగజేసుకోగూడదని ఊరుకున్నాను" అన్నాడు.

"ఆ అమ్మాయి తాతగారియిల్లు మా యింటిదగ్గరే. ఆ అమ్మాయి తరుచు తాతగారింటికి వస్తూవుండేది. నిజం చెప్పొద్దు, ఆ అమ్మాయిని చూసినప్పుడల్లా యిటువంటి అందమైన అమ్మాయి నా జీవితంలో భార్యగా దొరుకుతే యెంత బాగుంటుంది-అని మనసులో అనుకునేవాణ్ణి" అన్నాడు.

"సరే చాలా సంతోషం! యిక ఆ పెళ్ళి అగే వుపాయం చూడాలి. రేపు పద్మనాభంతోగూడా కలిసి మాట్లాడదాం"

అప్పుడు పదకొండు దాటింది. ఆ గదిలో మంచం ఒకటే వుండడం వల్ల గుమ్మం బయట గోడకుపెట్టివున్న మడతమంచం తెచ్చి లోపల వాల్చి రాధాకృష్ణ రెండు మంచాలమీద దిబ్బా, పక్కలూ వేశాడు.

మర్నాడు ఉదయానే ఇద్దరూ కాలకృత్యాలు తీర్చుకుని కాఫీతాగి యేవో కాసేపు క్లాసుపుస్తకాలు చదువుకుని భోజనంచేసి రోజూకంటే పెందలాడే కాలేజికి వెళ్ళిపొయ్యారు.

వీళ్ల వెళ్ళేసరికి ఒక్కొక్కవిద్యార్థే చేరుకుంటున్నారు. వీళ్లవెళ్ళిన పదినిమిషాలకల్లా పద్మనాభం వచ్చాడు. రాధాకృష్ణ, చంద్రం పద్మనాభాన్ని కాలేజిప్రక్క చెట్టుదగ్గరికి తీసుకెళ్ళారు. ముగ్గురూ చెట్టుకింద కూర్చున్నారు.

రాధాకృష్ణ సంగతంతా చెప్పి "వరుడేపేరు రాఘవయ్యట. నేను రాత్రి సినిమాహాలుదగ్గర ఒకళ్ళను అడిగి తెలుసుకున్నాను. బజార్లో బట్టలకొట్టు వున్నదట" అన్నాడు.

"ఓ, అతడా! నే నెరుగుదును. వాళ్ళకొట్లో మేం బట్టలుకొంటూ వుంటాం. తలంతా నెరిసింది. నల్లగా, లావుగా వుంటాడు" అన్నాడు పద్మనాభం.

"తల్లికీ, పిల్లకూ అసలే యిష్టంలేదు. తండ్రి బలవంతాన చేస్తున్నాడు. ఈ పెళ్ళి ఆపేమార్గం యేమిటి?" అని అడిగాడు రాధాకృష్ణ.

"మంచిపని చెయ్యడానికి మనమెప్పుడూ సిద్ధమే! యేమోయ్ చంద్రం! నువ్వా అమ్మాయిని చేసుకునే మాట నిజమేనా? ఆఖరుకు మావాళ్ళు వప్పుకోలేదని వప్పులో కాలేస్తావా?" అని అడిగాడు పద్మనాభం.

"అదంతా యేమీలేదు. తప్పక చేసుకుంటాను!" అన్నాడు చంద్రం.

"మీ నాన్నా, అమ్మా యిష్టపడకపోతే?" అని అడిగాడు పద్మనాభం.

"ఎందుకు యిష్టపడరు? పిల్ల కులంతక్కువదనా! గోత్రం తక్కువదనా!" అన్నాడు చంద్రం.

"అందుకు కాదోయ్. కట్నం యేమీ రాలదుగా!" అన్నాడు పద్మనాభం.

"వాళ్ళకు కావలసింది కట్నం అనుకో. నాకు కావలసింది పిల్ల. ఇందులో యెవరి యిష్టం నెగ్గాలి? జీవితాంతంవరకూ అనుభవించేది నేను. వాళ్ళుకాదు. అదిగూడా కాకుండా 'నీ చదువుకు అంతడబ్బు పోశాం, యింత డబ్బుపోశాం' అని అది కట్నంవల్ల రావాలనుకునేటందుకైనా వీల్లేదు. వా బలవంతాన నాతిప్పలు నేను పడి చదువుకుంటున్నాను" అన్నాడు చంద్రం.

"అయితే ఘట్టివాడివే. యిక ఆ పెళ్ళి ఆగే మార్గం చూడాలి" అన్నాడు పద్మనాభం.

"యిప్పుడు చంద్రం చేసుకుంటాడంటే వాళ్లు ఆ సంబంధం వదులు కుంటారా?" అన్నాడు రాధాకృష్ణ.

లగ్గాలు పెట్టుకున్నారు గనుక యిప్పుడు లాభంలేదు. యేదో యుక్తి చేత ఆపవలసిందే. పిల్లచేత నేను చేసుకోనని అనిపించడం. పిల్ల యిష్టంమీద పిల్లను రహస్యంగా తీసుకెళ్ళి చేసుకోవడం-యిట్లా యెన్నో జరిగినవి గానీ అవన్నీ వేరు. యిప్పుడు మనం వరుడు తనకై తాను విరమించుకునేటట్లు చేస్తే సరిపోతుంది. వరుడి సంగతి నాకు బాగా తెలుసు. పరమ ఛాందసుడు. సంస్కారమంటే యేమిటో తెలియదు. కొట్టుతప్పితే బయట ప్రపంచంతో అతడికేమీ సంబంధంలేదు" అని పద్మనాభం చెప్తూ వుండగా కాలేజి గంట మోగటంవల్ల ముగ్గురూ లేచి వెళ్లిపొయ్యారు.

కాలేజి వదిలిపెట్టగానే రాధాకృష్ణ, పద్మనాభం, చంద్రం ముగ్గురూ నడిచి వెళ్ళిపోతున్నారు.

"రాఘవయ్యను యింటివద్ద వున్నప్పుడు కలవడం మంచిది. బహుశా ఆతడిప్పుడు కొట్టువద్దనే వుండవచ్చు" అన్నాడు పద్మనాభం.

"వాళ్ళ యిల్లు నీకు తెలుసా?" అని అడిగాడు రాధాకృష్ణ.

"నాకు తెలియదు. సరే, కొట్టువద్దకు వెళ్ళితే అన్నీ తేలతవి. వాళ్ళ యిల్లెక్కడోగూడా అడిగి తెలుసుకోవచ్చు" అన్నాడు పద్మనాభం.

ముగ్గురూ పెద్దబజారులో వున్న రాఘవయ్య బట్టలకొట్టువద్దకు వెళ్ళి 'అతడు కొట్లో వున్నాడా' అని తెలుసుకోగా యింటికి వెళ్ళాడని తెలిసింది. యిల్లెక్కడో అడిగి తెలుసుకుని ముగ్గురూ రాఘవయ్య యింటికి బయలు దేరారు. కొన్ని బజార్లు నడిచి రాఘవయ్య యింటి సమీపానికి వచ్చాక అక్కడ ఎవరిదో డాబా వుండగా పద్మనాభం 'మీరిద్దరూ యిక్కడ కూర్చోండి. అంతా వెళ్ళితే బాగుండదు. నేను వెళ్లి మాట్లాడి వస్తా' నని చెప్పి తాను బయలుదేరాడు.

అది డాబా. పద్మనాభం 'రాఘవయ్యగారు వున్నారా' అంటూ లోపికి వెళ్ళగా ఆ మాటలు విని అవతల ఓ గదిలోనించి రాఘవయ్య వచ్చి మీరా"

రాండిబాబూ" అంటూ పాతకుర్చీ ఒకటి తెచ్చివేసి "మావాళ్ళేం మీకు బేరం కుదరనివ్వలేదా ? యిప్పుడే ఇంటికి వచ్చాను. యెవరికెట్లా యివ్వాలో వాళ్ళకు సరీగా తెలియదులెండి. కొత్త కొత్త షర్టింగులూ అవీ వచ్చినవి. కొంచెం సేపట్లో కొట్టుదగ్గరకు వస్తా" అని యేకరువుపెట్టాడు.

పద్మనాభం కుర్చీలో కూర్చుని "వ్యాపారంరో మదుపులు మీకు తెలిసినట్టు వాళ్ళకేం తెలుసు! మీ చేతిమీదుగా యిస్తేనేగాని మాకు నమ్మకం వుండదు సుమండి ! మీకు, మాకు యెన్నాళ్ళనించి ఖాతా"....అని ఆ మాటా ఈమాటా చెప్పి అన్నట్టు "మీ పెళ్ళట ! యెప్పుడు" అని అడిగాడు.

"ఇంకా వారంరోజులు వుందండి" అని అన్నాడు రాఘవయ్య.

"ఆ అమ్మాయిని నేను యెరుగుదునులేండి ! ఆ అమ్మాయి మీ ఇంటికి వచ్చిందంటే మీ ఇల్లంతా కళకళ్ళాడుతూ వుంటుంది'' అన్నాడు.

యీ మెచ్చుకోలుకు అతని ముఖంలో చిరునవ్వు మొలకెత్తింది, "ఏదో మంచిపిల్లని యిష్టపడ్డాను" అన్నాడు.

"మంచిపిల్లని మెల్లిగా అంటారేం ! ఆ అమ్మాయివస్తే మీ ఇల్లు కళకళ్ళాడమే కాదు, వాళ్ళూ వీళ్ళూ వస్తూ సందడి సందడిగాగూడా వుంటుంది'' అన్నాడు పద్మనాభం.

ఆ మాటతో రాఘవయ్య ముఖంలో చిరునవ్వు మాయమైంది. అసలే తన నీడ చూసుకుని భయపడే రకం. "వాళ్ళూ వీళ్ళూ రావడమేంటి ?" అని అడిగాడు.

"ఆ అమ్మాయి స్నేహితులు ! ఆ అమ్మాయి చదువుకుందిలేండి ! యెప్పుడూ స్నేహితులతో తిరుగుతూ వుంటుంది" అన్నాడు పద్మనాభం.

యీ మాటతో అతడు గుడ్లుతేలవేశాడు. కొంప మునిగినట్టు "స్నేహితులే !'' అన్నాడు.

"మంచి భావాలుగల అమ్మాయిలేండి ! ఒక స్నేహితులేమిటి; మీటింగులకూ వాట్లకూ వెళ్ళి ఒకోసారి ప్రొద్దుపోయిగూడా ఇంటికి వస్తూవుంటుంది" అన్నాడు పద్మనాభం.

"అదా సంగతి ! చెప్పారుకారు ?" అన్నాడు రాఘవయ్య.

"అలా విస్తుపోతారేం? మీకు మంచి అమ్మాయిని కోరుకున్నప్పుడు కొత్త సంస్కారాన్ని కూడా అలవర్చుకోవాలి. డబ్బుగలవాళ్ళు, మీకేం! యేది కావాలంటే అది నిమిషాలమీద తెచ్చి కట్టివెయ్యగలరు. రేపు ఓ గుర్రాన్నికొంటా రనుకోండి! దానిమీద స్వారీచేసే నేర్పు అలవర్చుకోవాలా? అది మిట్టలూ పల్లాలూ తిప్పుతుంది. అన్నిటినీ సమర్థించుకోవాలి!" అన్నాడు పద్మనాభం.

ఈ మాటలన్నీ అవతలవుండి వింటున్న ఓ వితంతువు ఆయనకు చెల్లెలవుతుందో ఏమౌతుందో; బయటికి వచ్చి "ఆ పిల్ల పగలబాటు చూసి ఇది కాపురంచేస్తుందా అని నేనప్పుడే అనుకున్నాను. మాకేం పిల్లలు దొరక్క పొయ్యారా! వెయ్యిమీద వెయ్యిపోసి యింకోపిల్లను చేసుకుంటాం" అని తీగెలు తీసింది.

"యింకా నయం. ముందుగా దేవుడిలాగావచ్చి చెప్పారు!" అన్నాడు రాఘవయ్య.

తన పథకం పారినందుకు పద్మనాభం లోలోన సంతోషపడుతూ "వస్తానండీ! యింతకీ వచ్చిన సంగతి మరచాను. కొట్టువగ్గరకు వస్తారు కదూ?" అంటూ బయట పడ్డాడు.

పద్మనాభం తనకోసం యెదురు చూస్తున్న మిత్రులిద్దర్నీ కలుసుకుని అవతలవాళ్లు అన్నమాటలు చెప్పుకుని నవ్వుకుంటూ నడవసాగారు.

* * *

పెళ్ళి రేపనగా అవతల వాళ్ళు విరమించుకొన్నట్టు తెలిసి శివయ్య కుటుంబం కుప్పగూలిపొయ్యారు. గిట్టక యిరుగు పొరుగువాళ్ళు ఎవరో పుల్లలు వేశారని పేరు పెట్టకుండా శివయ్య, వాళ్లను తిట్టాడు. పెళ్ళి తప్పిపోయినందుకు భారతి సంతోషించింది. రమణమ్మ ముందు ఆ సంబంధానికి యిష్టపడక పోయినా వాళ్ళు విరమించుకున్నారని తెలిసేటప్పటికి కూతురికి పెళ్ళయ్యే యోగం లేదుగామాలని విచారపడ్డది. యిక అవ్వ పిల్ల పెళ్లి చూసుకునే గీత, తనకు లేదని చీదివేసింది.

ఆ మూడవరోజున శివయ్య వసారాలో బల్లమీద కూర్చున్నాడు. రమణమ్మ, అవ్వ గుమ్మందగ్గరగా కూర్చుని ముగ్గురూ యేదో మాట్లాడుకుంటున్నారు. భారతి లోపల కూర్చుని పుస్తకం చదువుకుంటున్నది.

ఇంతలో రాధాకృష్ణ, పద్మనాభం, చంద్ర ముగ్గురూ వచ్చారు. వాళ్ళు రావడంచూసి శివయ్య బల్లమీదనుంచి లేచాడు. రమణమ్మ వాళ్ళను చూసి లోనికివెళ్ళింది. వాళ్ళు ముగ్గురూ త్రిమూర్తుల్లా బల్లమీద కూర్చున్నారు.

రాధాకృష్ణ అవ్వను పరామర్శ చేశాక 'చంద్రం, భారతిని చేసుకుంటా డ'ని చెప్పాడు.

ముందు ఆ అమ్మాయిని రాధాకృష్ణ చేసుకుంటాడని వాళ్ళు యెన్నో ఆశలు పెట్టుకోగా అవన్నీ వృథా అయినందున రాధాకృష్ణ యిప్పుడు చెప్పిన మాటమీద వాళ్ళకేమీ విశ్వాసం కలగలేదు. శివయ్య అసలే రాఘవయ్యే సంబంధంగూడా చిట్లిపోయిందని విసుగులో వున్నాడేమో; రాధాకృష్ణ చెప్పిన మాటలకు "నువ్వు చేసుకున్నావు-ఇక ఆ అబ్బాయి చేసుకుంటాడు" అన్నాడు యీసడింపుగా.

అప్పుడు రాధాకృష్ణ తాను వాళ్ళయింటికి అన్నిసార్లు వచ్చింది చేసుకో టానికి కాదనీ, తన తల్లీ చెల్లెలు యెక్కడున్నారో తెలియక విచారపడుతున్న తాను తన చెల్లెలిని పోలివుండడంవల్ల ఆ అమ్మాయిని చూడ్డానికి మాత్రం వచ్చాననీ మొదలైన సంగతులు జాలిగా చెప్పుకున్నాడు. ఆమీద పద్మనాభం, చంద్రం బి. ఏ. చదువుకుంటున్నాడనీ, అతని యోగ్యతలూ అవీ చెప్పాడు.

ఇంట్లోవుండి ఇవన్నీ ఆలకిస్తున్న రమణమ్మ గుమ్మంలోకివచ్చి "నువ్వు రామయ్య మామకొడుకువి కదు అబ్బాయి ?" అని అడిగింది, చంద్రాన్ని ఉద్దే శించి.

అవును" అన్నాడు చంద్రం.

రమణమ్మ పుట్టిల్లు దగ్గరలోనే వాళ్ళయిల్లు కావడంలో మొదటినించీ వాళ్ళ సంగతులన్నీ ఆమెకు బాగా తెలుసు. చంద్రం చదువుకుంటున్నాడని గూడా ఆమెకు తెలుసు. వాస్తవం తెలుసుకునేటప్పటికి అదివరకు చిన్నపోయిన వాళ్ళ ముఖాలన్నీ అంతలో కళకళ్ళాడినవి.

యెప్పుడో యెందుకని అప్పుడే భారతికి చంద్రాన్ని చూపించి 'నీ కిష్ట మేనా అమ్మాయి ?' అని అడిగాడు. భారతి చంద్రాన్ని యెరుగును. అదివరకు యెన్నోసార్లు చూసివున్నది. అడిగిన ప్రశ్నకు ఆ అమ్మాయి సిగ్గుతో చిరు

నవ్వు సమాధానంగా యిచ్చింది. అంతటితో 'తథాస్తు' అనుకుని ముగ్గురూ లేచారు.

౧౭

తర్వాత దాదాపు నెలరోజులకు ఒకనాటి సాయంత్రం రాధాకృష్ణ, పార్థసారధి, పద్మనాభం యింటికి వెళ్ళుతున్నారు. రోడ్డుదాటి డొంకనే నడుస్తున్నారు. అదంతా ఖాళీప్రదేశం. అందులో యెవరో కుర్రవాళ్ళు పశువులను మేపుకుంటున్నారు. చెట్లమీద పక్షుల అరుపులు వినవస్తున్నవి. యిద్దరూ సరివితోటదగ్గరికి వచ్చేటప్పటికి రాధాకృష్ణకు ఆరోజు రాత్రి అక్కడ జరిగిన ఘటన గుర్తువచ్చింది. అప్పటినించి రాధాకృష్ణ ప్రొద్దుకూకి అటు వెళ్ళడం మానివేశాడు. యెప్పుడైనా పద్మనాభం యింటికి వెళ్ళదలుచుకుంటే పగలే వెళ్ళి వస్తున్నాడు. యిద్దరూ సరివితోటదాటి నడుస్తున్నారు.

యిళ్ళ సమీపంలోకి వచ్చాక దారిలో పద్మనాభం కనిపించాడు. అక్కడ కొందరు కుర్రాళ్ళు చెడుగుడు ఆడుతూవుండగా పద్మనాభం మరికొందరు దగ్గర నిలబడి చూస్తున్నారు. రాధాకృష్ణ, పార్థసారధిగూడా కాసేపు నిలబడి చూసి ముగ్గురూ కలసి పద్మనాభం యింటికి బయలుదేరారు. దారిలో ఓ గుమ్మం ముందు అరుస్తున్న బిచ్చగాడిని లోపలనించి ఒకతను కర్రపుచ్చుకుని వచ్చి "గాడిదకొడకా, మొండికేస్తావా!" అంటూ వాణ్ణి తరుముతున్నాడు.

ఆ యిల్లు దాటాక పద్మనాభం "చూశారా, అతణ్ణి! మనిషి పిచ్చివాడిలా వున్నాడు. అతనిదగ్గర లక్షరూపాయలపైన డబ్బుంది. ఊళ్ళోవున్న యిల్లు యెక్కువ అద్దెలకు యిచ్చుకుని యిక్కడ యిల్లు వేసుకుని కాపురం వుంటున్నాడు. అంతవుందన్న మాటేగాని పిల్లికి బిచ్చం పెట్టడు. ఇంట్లో ఆడంగులు పచ్చళ్ళు సహా అమ్ముతారు. అసలు అతడు పదేళ్ళక్రిందట దక్షిణాదినించి వచ్చి మొదట మట్టితట్టలు మోశాడట. తర్వాత అదృష్టం యెత్తుకుంది. అతనికి యిద్దరు కొడుకులు. చదువుకుంటున్నారు. వాళ్ళకు అంత కట్నాలిస్తాం; యింత కట్నాలిస్తామని యెవరెవరో వస్తున్నారు. ఇతడు వున్నదిచాలక వాళ్ళ మీదగూడా రాబట్టాలని అందకుండా కొండమీద కూర్చున్నాడు. అదృష్టవశాత్తు అతనికి ఆడపిల్లలు లేరోయ్; వుంటే యెవరో చెవిమెలేసి గుంజేవాళ్ళే!"

ఇట్లా చెప్పుతూవుండగా యెవరో యిద్దరు దృఢకాయులు బాగా కర్రలు పుచ్చుకుని పైనించి పరుగెత్తుకుంటూ వస్తూవుండడం చూసి రాధాకృష్ణ భయ పడి పొయ్యాడు. అక్కడ దాపులోనే ఆనాడు ఆ దుర్ఘటన జరగటం; తనమీద కుట్ర జరుగుతున్నది జాగ్రత్తగా వుండమని వాళ్ళు హెచ్చరించి వుండడంలో అతనికి భయం వేసింది.

ఇంతలో పైనించి పరిగెత్తుకుంటూ వస్తున్న వాళ్ళిద్దరూ వీళ్ళనుదాటి ముందు పరిగెత్తుకుపోతున్న పందిని తరుముకుంటూ. వెళ్ళారు. రాధాకృష్ణ మనసు అప్పుడు కుదుట పడ్డది.

పద్మనాభం యిల్లు సమీపించగా ముగ్గురూ లోనికి వెళ్ళారు

ముగ్గురూ కాస్సేపు మాట్లాడుకున్నాక రాధాకృష్ణ పద్మనాభాన్ని "అట్లా బజారుకొస్తావా ?'' అని అడగ్గా "యివ్వాళకిక యెక్కడికీ కదలదలుచుకో లేదోయ్" అని చెప్పాడు.

అప్పుడు రాధాకృష్ణ, పార్థసారధి బయలుదేరి రాజాకేఫ్‌లోకి వచ్చి, యిద్దరూ కాఫీతాగి బయటికి వచ్చారు. పార్థసారధి కిల్లీకొట్టుదగ్గర వ్రేలాడ గట్టిన ఒక వారపత్రిక కొని "యిక నేను వస్తానోయ్" అని రాధాకృష్ణతో చెప్పి వెళ్ళిపోగా రాధాకృష్ణ యింటికి బయలుదేరాడు.

దాదాపు పదిగజాల దూరం నడిచేటప్పటికి ప్రక్కకొట్లో పొగాకు కొంటున్న ఒకతను "యిదుగో అబ్బాయ్!" అని రాధాకృష్ణను కేకవేశాడు. రాధాకృష్ణ యెవర్నో అనుకుని తలవంచుకుని వెళ్ళిపోతున్నాడు. అతడు పొగాకు కొనుక్కుని యివతలకువచ్చి "యిదుగో అబ్బాయి విన్నే!" అని బిగ్గరగా కేకవేశాడు. అప్పుడు రాధాకృష్ణ వెనక్కు తిరిగిచూసి నిలబడ్డాడు. అతడు రాధాకృష్ణను సమీపించి "మీది కొల్లిపరకాదు అబ్బాయి!" అని అడిగాడు.

అతనికి నలభై యేళ్ళుంటవి. మనిషి నల్లగా దృఢంగావున్నాడు. చొక్కా, వుత్తరీయం వేసుకుని సీరుకావిపంచ కట్టుకున్నాడు. అప్పుడు రాధాకృష్ణకు వెనక కాఫీహోటల్లో జరిగిన సంగతి గుర్తుకు వచ్చింది. అప్పటినుంచీ రాధా కృష్ణకు అటు ప్రాంతం వాళ్ళంటే విశ్వాసం తగ్గిపోయింది. అతడు అడిగిన ప్రశ్నకు "అవును" అన్నాడు.

"అయితే అబ్బాయి, యిప్పుడు మీరు యీవూళ్ళో వుంటున్నారా? పాపం మీరు కొల్లిపర వదిలి చానాళ్ళయిందిగా! నన్ను మర్చిపొయ్యావా? గోపాలం అన్నని. మా గోపాలంతో సావాసంగా మాయింటికి వచ్చేవాడివి కదూ! యిప్పుడు యిక్కడ యేం చేస్తున్నావు?" అని అడిగాడు.

తాను ఏంచేస్తే యితడికెందుకు అనుకుని "యేమీ చెయ్యడంలా" అని రాధాకృష్ణ నడవసాగాడు.

అతడు రాధాకృష్ణని వదిలిపెట్టలేదు. వెంటనడుస్తూ "మీయిల్లెక్కడ" అని అడిగాడు.

తమ యిల్లుతో యితనికేం పని. ఆనాడు అతడుగూడా యిట్టాగే ఆరాలు తీశాడు. యితడుగూడా ఆజట్టులోవాడు కాడుగదా! అనుకుని "అటువైపు వుందిలే" అన్నాడు విసుగ్గా. రాధాకృష్ణ.

పోనీ రాధాకృష్ణ విముఖత్వంచూసి అతడు అంతటితోనన్నా వదిలి పెట్టాడా అంటే లేదు. నీ పెళ్ళయిందా? నీ చెల్లెలు పెళ్ళి చేశారా? యేమైనా నాలుగు డబ్బులు సంపాయించుకున్నారా? అని ప్రశ్నలువేస్తూ జీడిబంకలా పట్టుకున్నాడు.

ఇట్లా తనవెంటపడి తన నివాసం ఎక్కడో తెలుసుకోవాలన్న యెత్తుయి వుండవచ్చు. వీణ్ణి మరిపించే మార్గం యేమిటా? అని ఆలోచించి రాధాకృష్ణ ఆదారి తప్పించి ప్రక్కవీధినే నడవసాగాడు. అతడు రాధాకృష్ణను నీడలా వెంబ డిస్తూ ఆ ప్రశ్నలూ యీ ప్రశ్నలూవేసి ఆఖరుకు "నేను యీవూరు ఓపనిమీద వచ్చాను, వచ్చినపని కాలేదు. రైలు ఖర్చులకు డబ్బులు తరుగుపడేటట్లున్నవి. ఒక రూపాయి వుంటే యిద్దూ, అబ్బాయి, రేపు వచ్చినప్పుడు యిస్తాను" అని అడిగాడు.

తాను అనుమానపడకుండా నమ్మించడానికి యిదొక యెత్తుయి వుండ వచ్చు అనుకుని రాధాకృష్ణ "దగ్గరలేద"ని చెప్పాడు.

"బాబ్బాబు! దగ్గరలేకపోతే నీతో మీ ఇంటికివస్తా యివ్వు. లేకపోతే నేనిక్కడ ఇబ్బంది పడిపోతాను" అవడం సాగించాడు.

ఇవన్నీ తన నివాసం తెలుసుకునేటందుకు యెత్తులనుకుని రాధాకృష్ణ "ఇప్పుడు నేను ఇంటికి వెళ్ళడంలేదు, వేరేపనివుండి వెళ్ళుతున్నాను" అన్నాడు.

"ఇక్కడ యెరుగున్నవాళ్ళు యెవరూ లేరబ్బాయ్! అందువల్ల నిన్ను అడుగుతున్నాను. మీ ఇల్లెక్కడో చెప్పుపోనీ; అవిక్కి మీయింటి కొస్తాను" అన్నాడు.

రాధాకృష్ణ అనుమానం హెచ్చింది. "తప్పక యిదేదో వన్నాగడ! యెట్లా వీణ్ణి తప్పించుకునే మార్గం" అని అనుకుంటూ వుండగా ప్రక్కఇళ్ళ వరసలో ఓ గుమ్మంలో నిలుచున్న ఓ యువకుడు "ఏం రాధాకృష్ణ, మాబజారు కొచ్చావు? లోపలికిరా! నేనో చిత్రాన్ని వేశాను చూద్దువుగాని!" అని పిలిచాడు. ఆ యువకుడు రాధాకృష్ణతోపాటు స్కూల్ ఫైనల్ వరకూ చదువుకుని తర్వాత బడి మానేశాడు. అతడు చిత్రలేఖనం బాగా వెయ్యగలడు. అందులోనే అతడిప్పుడు కృషిచేస్తున్నాడు. అతడు పిలవగానే రాధాకృష్ణ వెంట వస్తున్నతణ్ణి వదిలించుకోవడానికి ఇదో మంచిఅవకాశం అనుకుని బ్రతుకు జీవుడా అని లోపలికి వెళ్ళాడు. లోపల ఆ యువకుడు వేసిన చిత్రాలు చూసి రాధాకృష్ణ అతడు బయట తనకోసం కాచుకుని కూర్చున్నాడో; లేక వెళ్ళాడో అనుకుంటూ వీధి గుమ్మంలోకివచ్చి చూచేసరికి అతడు లేడు. పీడ వదిలిపోయిందనుకుని రాధాకృష్ణ బయలుదేరి ఇల్లు సమీపించే అంతలో వాళ్ళయింటి ఇవతల సోములు ఇంటిముందు జనం గుంపుగా కూడివున్నారు. సోములూ, ఇంకొక అతడు కేకలు వేసుకుంటున్నారు. కేకలు వేసుకోవడమే కాదు; కచ్చెలు బిగించి దండలు చరుచుకుంటున్నారు. వీళ్ళెక్కడ కలియబడతారో అని, మూగినజనం అనుకుంటున్నారు. ఆ కేకలు వేస్తున్న రెండో అతడు సోములు అల్లుడు. "నా పెళ్ళాన్ని నాకు పంపమంటే యెందుకు పంపవు?" అంటున్నాడు.

"తాగొచ్చి దాన్ని యెమికలు యిరగతంతావుంటే నీకాడ యెట్టా చేత్తదిరా!" అంటున్నాడు సోములు.

"యెన్నిసార్లు దానీ రకతం కళ్ళసూశావు? బంగారంలాంటి బిడ్డని నీ యెదాన పెట్టాం" అంటున్నది సోములు భార్య.

"నా పెళ్ళాన్ని నేను కొట్టుకుంటా, నంపుకుంటా మీకెవర్లు అడిగేం దుకు?" అంటున్నాడు అల్లుడు.

మాటలు ముదిరి అల్లుడూ మామ వరసపోయి రావా మనవడు వరస లోకి దిగి ఇద్దరూ కలియబడటానికి సిద్ధమయ్యే అంతలో అక్కడ కూడిన జనం వాళ్ళను విడదీసి "యెందుకబ్బాయి అలా తొందరపడతావు? ఆడపిల్లను ఇంట్లో తెచ్చిపెట్టుకుని వాళ్ళ యేంచేసుకుంటారు? యేదో కోపతాపంతో పంప మని అన్నారనుకో; తర్వాత పంపక యేంచేస్తారు" అని అల్లుడితో చెప్పి యెవరికి చెప్పవలసిన మాటలు వాళ్ళకు చెప్పి పోట్లాట సర్దివేశారు.

అక్కడనుంచి కదిలి లోపలికి వెళ్ళి దాబామెట్లు యెక్కుతూవున్న రాధా కృష్ణను లక్ష్మణరావుగారు పిలవగా రాధాకృష్ణ కచేరీహాల్లోకి వెళ్ళాడు "ఇదేదో చూడబ్బాయి, చేటభారతంలాగా నాలుగుపేజీలు వుత్తరం: టపా ఇవాళ లేటుగా వచ్చింది" అంటూ లక్ష్మణరావుగారు కవరు ఒకటి రాధాకృష్ణకు ఇవ్వగా రాధాకృష్ణ అది "ఎరువుల కంపెనీనుంచి వచ్చింద" ని చెప్పి వుత్తరం చదివి తెలుగులో విడమర్చి చెప్పాడు.

అమర్నాడు ఆదివారం. రాధాకృష్ణ ఉదయం పదిగంటలకు రమ ఇంటికి వెళ్ళి తిరిగివస్తూ వుండగా నిన్న సాయంత్రం తనను వెంబడించిన మనిషి తమఇంటి గడపమెట్లు దిగుతున్నాడు. "అరె వీడితస్సాదియ్య! యెట్లాయినా ఇల్లు కనుక్కున్నాడు." అనుకుంటూ ఇల్లు సమీపించే అంతలో అతడు మెట్లు దిగి రెండడుగులువేసి, వస్తున్న రాధాకృష్ణనుచూసి ఆగి "ఏం అబ్బాయ్, ఇంటి దగ్గరలేవే యెక్కడికి వెళ్ళావు? లోపల కుర్చీలో కూర్చున్నాడే; ఆయన యెంత మంచివాడు? నిన్న నువ్వు వెళ్ళావే; వాళ్ళ ఇంటికి వెళ్ళి అడిగితే బొమ్మలుగీస్తున్న అబ్బాయి మీయిల్లెక్కడో చెప్పాడు. ఆమైన వెతుక్కుంటూ మీ ఇంటికి వచ్చి నువ్వు వున్నావేమోనని అడిగితే యెవరో మనిషి లేడని చెప్పాడు. అయ్యో లేకపోయెనే అని నేను కాళ్లు చేతులు చల్లపడి నిలుచుని వుండగా అవతల కుర్చీలో కూర్చుని కాగితాలు చూసుకుంటున్నాయన నన్ను పిలిచి 'మీదేవూరు. రాధాకృష్ణతో నీకేంపని?' అని అడిగాడు."

"నేను ఆ అబ్బాయిది మా వూరేలెండి. ఇక్కడికి పనిమీద వచ్చాను. వచ్చినపని కాలేదు. నిన్న ఆ అబ్బాయి బజార్లో కనబడితే వక రూపాయి అడి గాను. వుంటే ఇచ్చేవాడే, లేదు పాపం అని చెప్పాను.

"నువ్వు ముందుగానే నా సంగతి చెప్పివుంచావులాగుంది. అప్పుడు ఆయన మారుమాట్లాడకుండా జేబులోనించి రూపాయితీసి నాకిచ్చాడు. ఆయన మీ చుట్టమా ? నీకేమవుతాడు ?" అని అడిగాడు.

'మంచి ఘనకార్యం చేశావులే' అని రాధాకృష్ణ మనసులో అనుకుని "చుట్టమేలే !" అని చెప్పి అతణ్ణి వదిలించుకుని లోనికి వెళ్ళాడు. నిజంగా అతడు రూపాయి అవసరం ఉండి వచ్చాడా లేక ఇదంతా నటనా ! యేమో నమ్మకూడదు. ఆ రోజున కాఫీహోటల్లో అతడు యెంత లాలనగా మాట్లాడాడు. ఇతడు వాళ్ళతాలూకు మనిషి యెందుకు కాకూడదు. మోసం చెయ్యదలుచుకున్నవాడు అనేక వేషాలు వేస్తాడు. ఇతడు తనఇల్లు తెలుసుకుని అర్ధరాత్రి వేళ కిటికీ వూచలు లాగివేసి లోపల జొరబడడు కద ! ఇట్లా ఆలోచిస్తూ రాధాకృష్ణ గేటుదాటి కచేరిహాల్లోకి వెళ్ళాడు.

అక్కడ కూర్చునివున్న లక్ష్మణరావుగారు "ఏం రాధాకృష్ణా, మీవూరట నీకోసం యెవరో మనిషి వచ్చాడు, అమాయకుడిలా ఉన్నాడు" అని నవ్వాడు.

యీ విషయాలన్నీ లక్ష్మణరావుగారికి తెలియవు. అప్పుడు రాధాకృష్ణ "అతడు నాకు వస్తుంటే యెదురుపడ్డాడులెండి" అని చెప్పాడు.

ఆవాళ ఆదివారం అవడంవల్ల గుమాస్తాలు రాలేదు. లక్ష్మణరావుగారు, రాధాకృష్ణను ముఫర్జు తీసుకుని అందులో ఫలాన ఫలాన ఖాతాలుతీసి మనకు యెంత బాకీవున్నారో బేరీజువేసి చెప్పమనగా; రాధాకృష్ణ ముఫర్జు తీసుకుని లెక్కచెయ్యడంలో నిమగ్నుడయ్యాడు.

లోపలనించి రాజ్యలక్ష్మమ్మగారు "ఇట్లా ఓమాటు వస్తారూ !" అని లక్ష్మణరావుగారిని పిలవగా ఆయనలేచి లోనికి వెళ్ళాడు. మధ్యహాల్లో రాజ్యలక్ష్మమ్మగారు నిలుచుని వుంది. కళ్యాణి కుర్చీలో కూర్చుని 'భారతి' చదువుతో వుంది. లక్ష్మణరావుగారువెళ్ళి "ఏమిటి ?" అని అడిగాడు.

"మా పిన్ని వెళతానంటోంది. వచ్చి వారంరోజు లయిందమ్మా, యింటి వద్ద ఎలావున్నదో అని తొందరపడుతున్నది. రాకరాక యెన్నాళ్ళకో వచ్చింది. తవతతవకీ వస్తుందా ? చేస్తుందా ? చీరఒకటి తెప్పించండి, పెట్టి పంపుదాం" అని చెప్పింది రాజ్యలక్ష్మమ్మగారు.

"ఇవాళ ఆదివారం కొట్లుండవు - రేపు తెప్పిద్దాంలే !"

"పిల్లకు పరికిణీ గుడ్డ, జాకెట్టుగుడ్డ గూడా తెప్పించాలి"

"పరే రేపు తెప్పించవచ్చు."

"చూడండి, అమ్మాయిని చూడ్డానికి వాళ్ళు యెప్పుడు వస్తారో ?" అని అడిగింది.

"మీవాడు మొన్న వ్రాయడం మంచిరోజు చూసి నాలుగైదు రోజుల్లో వస్తారని వ్రాశాడు. యివాళ్ళో రేపో రావచ్చు"

"వాళ్ళు వస్తే పళ్ళూ అవీ తెప్పించాలి. అయితే కుర్రాడు యేం చదువుకున్నాడో ?" అంది.

"మనకేం తెలుసు? ఆ వివరాలన్నీ వ్రాయలేదు. వాళ్ళు వస్తేగాని తెలియదు."

లక్ష్మణరావుగారు కచేరీహాల్లోకి వెళ్ళిపొయ్యారు. రాధాకృష్ణ లెక్క బేరీజువేసి లక్ష్మణరావుగారికి చెప్పి ముఖర్జు మూసి బీరువాలో పెట్టి వేళకావడం వల్ల భోజనం చెయ్యడానికి లోనికి వెళ్ళాడు. కాళ్ళూ, చేతులూ కడుక్కొని అతడు వంటగదిలోకి వెళ్ళేసరికి అక్కడ కళ్యాణి భోజనం చేస్తున్నది. వంట మనిషి వడ్డించగా కల్యాణి అప్పుడే తినడం ప్రారంభించింది. రాధాకృష్ణ వెళ్ళి కళ్యాణికి కొంచెం దూరంలో పీట వేసుకుని కూర్చున్నాడు.

"ఏం రాధాకృష్ణా, ఆదివారం పెందలాడే భోజనానికి వచ్చావు ?" అని అడిగింది కళ్యాణి.

"ఇవాళ లైబ్రరీకి వెళ్ళలేదు'' అని చెప్పాడు. ప్రతి ఆదివారం అతడు లైబ్రరీకి వెళ్ళి మంచి మంచి పుస్తకాలు చదువుకోవడం వాడుక.

వంటమనిషి విస్తరివేసి వడ్డించగా రాధాకృష్ణ తినడానికి ఉపక్రమించాడు. అతడు నాలుగైదు ముద్దలు తిన్నాక కళ్యాణి వంటమనిషిని వుద్దేశించి "సీతమ్మా, రాధాకృష్ణకు నెయ్యేది ?" అంది.

"నాకెందుకు" అని రాధాకృష్ణ తలవంచుకుని భోజనం చేస్తున్నాడు.

సీతమ్మ రాధాకృష్ణ అన్నమాట వినిపించుకోకుండానే "నెయ్యి కావాలా నాయనా, చచ్చిందాన్ని తక్కువవేళా కామాలు" అంటూ నెయ్యితప్పాళ పుచ్చుకుని గభాలున మళ్ళా రాధాకృష్ణ విస్తట్లో వడ్డించింది. కళ్యాణి కిల కిలా నవ్వింది.

"నాకెందుకు సీతమ్మా, మళ్ళావడ్డించావు? నేనుకాదు అడిగింది కళ్యాణి!" అన్నాడు రాధాకృష్ణ.

"కళ్యాణి నీకేనని చెప్పింది నాయనా!" అంది సీతమ్మ.

"నాకు కావలిస్తే నేను అడగనా! కళ్యాణికి కావలసి నా పేరు చెప్పింది. చూస్తావే, వడ్డించు!" అన్నాడు.

సీతమ్మ నెయ్యి తప్పాళ పుచ్చుకుని కళ్యాణికి వడ్డించబోగా "మంచి వాడివే సీతమ్మా నాకెందుకు? వడ్డించబోకు" అని చెయ్యి అడ్డుపెట్టింది.

"నాకైతే గఖాల్లు వడ్డించావు-మరి కళ్యాణికి వడ్డించవేం?" అన్నాడు రాధాకృష్ణ.

"యెవరికి కావాలో సీతమ్మకు తెలుసు. అంత మాత్రం తెలుసుకోలేదా సీతమ్మ"! అంది కళ్యాణి.

"నువ్వుకూడా కాస్త వడ్డించుకో అమ్మా!" అంది సీతమ్మ.

"వద్దువో! పులుసు పట్టుకురా!" అంది కల్యాణి.

సీతమ్మ కల్యాణికి పులుసు వడ్డించగా "నాకుగూడా పులుసు వడ్డించ" మన్నాడు రాధాకృష్ణ.

వాళ్ళు పులుసుతో తినడం అయ్యాక మారువడ్డించి యిద్దరికీ గడ్డపెరుగు తెచ్చి వడ్డించింది సీతమ్మ.

రాధాకృష్ణ భోజనం ముగించి "నువ్వు వెనకపడ్డావు కల్యాణి" అన్నాడు.

"నాదీ అయిపోయిందిగా! ఆరోగ్యశాస్త్రంలో యేంచెప్పి వుంది. నిదానంగా తినమని వుందా? తొందర తొందరగా తినమని వుందా?" అంది.

"అయితే ఆరోగ్య శాస్త్రాన్ని పాటిస్తున్నావన్న మాట" అన్నాడు రాధాకృష్ణ.

ఇంతలో కల్యాణి భోజనంగూడా కాగా యిద్దరూలేచి చేతులు కడుక్కున్నారు.

మధ్యాన్నం అందరిభోజనాలూ అయ్యాక నాగరత్నం దొడ్డిగుమ్మం దగ్గర పంచలో కూర్చోగా ఇంతలో పొరిగింటామె వచ్చింది. ఇక యిద్దరికీ లోకాభిరామాయణం ప్రారంభమైంది. యిందాక రాజ్యలక్ష్మమ్మగారు భర్తతో తన పిన్నికి చీరతెమ్మని చెప్పడం మొదలైనవి నాగరత్నం విని వున్నది.

వచ్చినామెతో "చూశావమ్మా, సాగించుకునేవాళ్ళు సాగించుకుంటారు. తన తరుపువాళ్ళు వస్తే చీరలూ, సారెలూ పెట్టి పంపుతుంది. మా తరుపువాళ్ళు యెవ రైనా కట్టుకోవచ్చారా, చుట్టుకోవచ్చారా! యెప్పుడూ యింటినిండా వాళ్ళతాలూకు వాళ్ళేగా! ఆమంద యెక్కడ తయారయిందో వదినలనీ, మరదళ్ళనీ, అన్న కొడుకులనీ. చెల్లెలు కూతుర్లనీ వచ్చిపడి యిల్లంతా దోస్తున్నారు. వాళ్ళు రాగానే యెక్కడలేని మర్యాదలు. పిండివంటలనీ పిడకవంటలనీ అబ్బో చెప్పటానికి వీల్లేదు. వాళ్ళుగనక యింట్లో అడుగు పెట్టారా దబ్బున వదలరు. పూటకో పిండివంటచేసి వెళ్ళి కూతుళ్ళలాగా పెంచుతూవుంటే యెలా వదుల తారు! వచ్చినవాళ్ళు వక బబువు బలిసిగాని యింటికి వెళ్ళరు. యేదైనా సాగు తూంటేసరి మొగుణ్ణి గుప్పెట్లో యిరికించుకుని యిష్టంవచ్చినట్లు ఆడుతున్నది" అని యేవేవో చెపుతూవుండగా;

ఇంతలో అక్కడికి యేదోపనివుండి కల్యాణి రావడంవల్ల నాగరత్నం ఆధోరణిమార్చి వేరే ప్రసంగంలోకి దించింది.

దాదాపు మూడుగంటలకు వీధిగుమ్మం ముందు కారుహారన్ మోగింది. అందులోనించి యిద్దరు స్త్రీలు, యిద్దరు పురుషులుదిగి లోపికి వెళ్ళారు. ఆడ వాళ్ళిద్దరూ సిల్కు చీరలు ధరించి ఆభరణాలు పెట్టుకుని వున్నారు. వచ్చిన వారినిచూసి లక్ష్మణరావుగారు, రాజ్యలక్ష్మమ్మగారు వారిని యెంతో సగౌరవంగా పరామర్శచేసి మధ్యహాల్లో కూర్చోబెట్టారు. వచ్చిన స్త్రీలలో ఒకామె నలభై యేళ్ళుంటవి, కుర్రవాడి తల్లికామాలు. మెడ తిరగకుండా నగలు, చేతులముందు మోచేతులవరకూ బంగారం గాజులున్నవి. వారు కాసేపు ఆమాట ఈమాట మాట్లాడి పిల్లను చూసుకున్నారు. కాబోయ్యే వియ్యపురాలు తాను ప్రత్యేకించి చెప్పినట్లుగాకుండా ఆమాట యీమాట మధ్య తన గొప్పలన్నీ చెప్పుకుంది. వాళ్ళకు చాలా బస్సులున్నవట. బజార్లో కమీషనుకొట్టు వుందట. అవరాలూ అవీ నిల్వబోస్తారట. బస్సులమీద, కమీషను కొట్టుమీద చాలా రాబడి వస్తుం దట. అదివరకు వున్న భూములు కాకుండా విరుదువచ్చిన లాభంపెట్టి వది కరాల మాగాణి కొన్నారట. వారి యింట్లో ఆడవాళ్ళకు మంచి సుఖమట. వంటకు,మనిషి, నీళ్ళు తెచ్చేటందుకు మనిషి, పక్కలు వేసేటందుకు మనిషి. ఆడవాళ్ళు పూచికపుల్ల యెత్తి అవతల పెట్టేపని లేదట. తన పెద్ద కూతురికి

యిరవై వేలు కట్నం యిచ్చారట. చిన్న కూతురికి యిప్పుడే సంబంధాలు వస్తున్నాయట. యిప్పుడు తన కొడుకు పెళ్ళి, ఆ అమ్మాయి పెళ్ళి వక్కసారే చేస్తారట. యిప్పుడు వ్యాపారమంతా దిద్దుకెళ్ళేది తన కొడుకేనట. తనకొడుకు యింకా చదువుకుంటాననంటే తండ్రి మనకు యింత వ్యాపారం అదీ వుండగా యింకా చదివి వకళ్ళక్రింద ఉద్యోగం చెయ్యవచ్చామా, మన వ్యాపారానికి యీ చదువు చాలు-అని కొడుకును వ్యాపారంమీద వుంచాడట. కొడుకు మంచి బుద్ధిమంతుడట. వుండమన్నచోట వుంటాడట-యేవేవో యేకరువు పెట్టింది.

రాజ్యలక్ష్మమ్మగారుచెప్పగా రాధాకృష్ణ బజారుకువెళ్ళి, పండ్లు తెచ్చాడు. వచ్చినవారికి పండ్లూ, కాఫీ యిచ్చారు.

వచ్చిన మగవాళ్ళలో ఒకాయన "అబ్బాయిగూడా మాతో వచ్చాడు. మా వాళ్ళ యింట్లో వున్నాడు. మీరువచ్చి చూసుకోవలసింద"ని చెప్పి వారు వెళ్ళి పొయ్యారు.

వెంటనే లక్ష్మణరావుగారు, రాజ్యలక్ష్మమ్మగారు కారు వేసుకుని కుర్ర వాడిని చూడడానికి వెళ్ళారు. కారు వాళ్ళ గుమ్మంముందు ఆపి భార్యా భర్త లిద్దరూ లోనికి వెళ్ళారు. యింటివారు వాళ్ళిద్దరినీ చాలా మర్యాదచేశారు. కాసేపు వారితో ఆ మాటా ఈ మాటా మాట్లాడి దంపతులిద్దరూ కుర్రవాణ్ని చూశారు. కుర్రవాడి రూపం నచ్చలేదు. అందులో చదువు తక్కువ. దంపతులిద్దరూ చప్పరించారు. వారికి ముందు నచ్చితేగదా తర్వాత వధువుకు నచ్చవలసింది; 'సరే మేం కబురుచేస్తాంలేండి!' అని చెప్పి యిద్దరూ ఇంటికి వచ్చేశారు.

ఆ సాయంత్రం రాధాకృష్ణ బజారుకువెళ్ళుతూ దారిలో రావుగారి ఇంటికి వెళ్ళాడు. రావుగారు లేదు, ఆయన భార్య పిల్లకు తల దువ్వుతూవుంది. పెద్ద పిల్ల యింటిముందున్న జాజిచెట్టుపూలు కోస్తూవుంది. ఆమె రాధాకృష్ణను చూసి 'కూర్చో నాయనా!' అంది.

రాధాకృష్ణ అక్కడ వున్న కుర్చీలో కూర్చుని "రావుగారు యెక్కడికి వెళ్ళారు?" అని అడిగాడు.

"యివాళ శలవుకదు, షికారువెళ్ళారు నాయనా!"అని చెప్పింది.

ఆమె నిమిషం ఆగి "చూశావా నాయనా! వారు అదివరకు సినిమాకు వెళ్ళితే మొదటి ఆటకే వెళ్ళేవారు. యిప్పుడు రెండో ఆటకని వంకపెట్టుకుని

వెళ్ళి ఎప్పుడో తెల్లవారు ఝామున ఇంటికి వస్తున్నారు. అదేమంటే కస్సుమని లేస్తారు. నోరెత్తేటందుకు వీల్లేదు. యేంచెప్పను నాయనా! డబ్బంతా పాడు చేస్తున్నారు. పిల్లాజెల్లా గంపెడు సంసారం. ఆయనకివేం బుద్ధులు!" అనిచెప్పి వాపోయింది.

ఆయన నిజంగా సినిమాకువెళ్ళి వుండవచ్చు. యీమెకు ఆయనమీద వున్న అనుమానంవల్ల అలా భావించి వుంటుంది. ఆడవాళ్ళకు అనుమానాలు జాస్తి! అని రాధాకృష్ణ మనస్సులో అనుకుని "వస్తానండి!" అని చెప్పి వెళ్ళిపొయ్యాడు.

రాధాకృష్ణ బజారునించి యింటికి వచ్చేసరికి రాత్రి ఎనిమిది గంటలయింది. భోజనంచేసి డాబాపైకి వెళ్ళాడు. చలిగాలి వీస్తోంది. తన గదిలో స్విచ్చివేసి దీపంవెలిగించి కుర్చీలో కూర్చున్నాడు. బయట చలిగా వున్నా లోపల వెచ్చగా వున్నది. పుస్తకం తీసుకుని చదువుకోవడం మొదలుపెట్టాడు.

"ఆడికి నస్తే పిల్లని పంపుతావేటి! యేసువంటి కూతలు కూశాడు" అవతలనించి సోములుగొంతు వినవస్తున్నది.

"కూశాడని పంపవా? ఆడపిల్లని యెన్నాలని యింట్లో పెట్టుకుంటావేటి?" అంటున్నది సోములు భార్య.

"ఆడిసేత తన్నులు తింటానికేగా పంపేది!"

"యేంచేత్తాం! యింట్లో వుంచుకుంటే నలుగురు యేమంటారు?"

"ఆడు చస్తే ఏంచేస్తా వేటి?"

"చెప్పేమాట యినవు, నీ మాటే నీకు."

"మిక్కిలి మిక్కిలి అరిశావా, నువ్వుకూడా పుట్టింటికి లగెత్తుతావు"

"ఆడు కొట్టాడని పెద్దోడంటావు, నువ్వుమటికి మంచోడువెట్టా! యిన్నేళ్ళొచ్చినా యిప్పటికీ చావకొడతావు!"

"అరిశావా మల్లా తగులత్తై!"

రాధాకృష్ణ కాసేపు చదువుకుని పుస్తకం పుచ్చుకుని చాలాసేపటివరకూ చదువుకుని తెరిచిన పుస్తకం తెరిచినట్టుగానే ఎదుర్రొమ్ముమీద పెట్టుకున్నాడు.

అర్ధరాత్రి అవుతుంది. డాబా అదిరిపొయ్యేటట్లు వికటాట్టహాసం చేస్తూ ఓ దృఢకాయుడు మంచందగ్గర నిలబడ్డాడు.

రాధాకృష్ణకు గుండెలవిసిపోయినవి. తాను అనుకున్నంత పనీ అయింది. యెట్లయినా వీడు కిటికీచువ్వలు వూడబెరికి వచ్చేశాడని ఖంగారుపడి పోతున్నాడు.

"నిన్న నువ్వు నీవెంట వచ్చి మీ యిల్లు తెలుసుకుంటానని నన్ను మరి పించడానికి యెన్ని యెత్తులు వేసిందీ నేను గ్రహించలేదనుకున్నావా? మీ ఇంటికి రూపాయి నిమిత్తం వచ్చింది నా దగ్గర డబ్బులేకనుకున్నావా? యిప్పు డెక్కడికి పోతావు, కాచుకో!" అంటూ మొల్లోవున్న కత్తిమీదికి చెయ్యి పోనిచ్చాడు.

రాధాకృష్ణ ఉలిక్కిపడి కళ్ళుతెరిచిచూస్తే యేముంది! యెవరూ లేరు. గదిలో పట్టపగల్లా దీపం వెలుగుతూవుంది. రొమ్ముమీదవున్న పుస్తకంఅట్లానేవుంది. 'అరె! దీపం ఆర్పివేయకుండానే నిద్రపట్టింది' అనుకుంటూ లేచి దీపం తీసి వేసి కిటికీ తలుపులుగూడా బిగించి పడుకున్నాడు.

౧౭

కమలనాథయ్యగారు భోజనంచేసి విశ్రాంతిగా మధ్యహాల్లో సోఫాలో కూర్చున్నారు. ఆయన ఎదురుగా శాంతమ్మగారు కుర్చీలో కూర్చుని "అమ్మాయి పెళ్ళి యీ యేడైనా చెయ్యకపోతే యెట్లాగు?" అంది.

"మంచి సంబంధాలు కనబడటంలేదు. అందులో యెవర్ని చూసినా కట్నాలమీద కూర్చుంటున్నారు" అన్నాడు కమలనాథయ్యగారు.

"మొన్న మీ పినతండ్రిగారు తెచ్చిన సంబంధాన్ని గురించి యేమం టారు?"

"యేమనే దేముంది! కుర్రవాడు చదువుకున్నవాడే ఆస్తీ అదీ వుందిగాని కుర్రవాడు నాకు నచ్చలేదు!"

"నల్లగా వున్నాడనా?"

"నల్లగావుండడం అట్లావుంచు. కుర్రవాడు ఆరోగ్యంగానన్నా వుండాలా! ముఖంచూస్తే ఏదో నలతగా వున్నట్టున్నది."

"కుర్రవాడు ఆరోగ్యంగా వుండి నచ్చితే చదువుండదు; చదువూ, ఆరోగ్యం రెండూవుంటే వాళ్ళకు ఆస్తి ఉండదు!"

"అన్నిటికంటే కుర్రవాడి ఆరోగ్యం ముఖ్యం!"

"అన్నీ ముఖ్యమే. కుర్రవాడు ఆరోగ్యంగా వుంటే చదువు లేకపోతే యిస్తామా! ఆస్తిలేకపోతే యిస్తామా!"

"ఆస్తి విషయమే యిప్పుడు పట్టుకుంది. కుర్రవాడు యెంత ఆస్తిగలవాడైతే అంత జాస్తి కట్నం అడిగేస్తున్నారు. ఇవతలవాళ్ళ తాహతునుబట్టి వీళ్ళు యివ్వగలరా లేదా అని చూడడంగూడా లేదు. ఆస్తిలేని సంబంధాలు కొంచెం రాయితీలో ఉన్నవి. వాళ్ళకు అంత దాహంలేదు."

"కట్నం తక్కువని ఆస్తిలేని వాళ్ళకు యిస్తే రేపు కుర్రవాడు సంపాయించేవాడైనా, కాకపోయినా మనం యెత్తుబడి పెట్టవలసిందేగా?"

"ఇప్పుడు ఆస్తి ఉన్నదని యిస్తే రేపు ఆస్తిపోతే యేం చేస్తావు?"

"భవిష్యత్తులో యేం జరుగుతుందో మనమెలా చెప్పగలంలెండి! ముందుగా మంచీ చెడ్డా చూసి యివ్వడం మన విధి"

"అదే నేనూ చెప్పేది. డబ్బుకంటే ముందు చూడవలసింది కుర్రవాడి ఆరోగ్యం, చదువు. ఆరోగ్యమూ చదువూ వుంటే రేపు ఒకనాటికి ఆస్తివున్నా లేకపోయినా యెట్లయినా బ్రతకగలడు?"

"అన్నీ చూడాలిలేండి! కాస్తో కూస్తో వెనక ఆదరువు అనేది లేకపోతే యెట్లా?"

"మీనాన్న నిన్ను నాకిచ్చేటప్పుడు మా దగ్గర యేముంది? నా చదువు చూసి ఇచ్చాడు. ఇప్పుడు రాణీలా మేడలో కుర్చీలో కూర్చుంటున్నావా?" అని నవ్వాడు.

"మా తాతగారు మంచి తెలిసినవాడులేండి! నా చిన్నతనంలో నన్ను చూసి 'మా శాంత అదృష్టవంతురాలు, అది కాలుపెట్టినచోట బంగారమవుతుంద'ని అంటూ వుండేవాడు"

"అంతేలే, కలిసివస్తే అర్ధాంగి అదృష్టం! కలిసి రాకపోతే మొగుడు వట్టి దద్దమ్మ!"

"మీకెవరు సమాధానం చెప్పగలరులేండి!"

"ఇంతకీ అమ్మాయి అభిప్రాయం యేమిటో తెలుసుకోలేదు. నాకో సంకల్పం వున్నది.—"

"ఏమిటది ?"

"అమ్మాయి అభిప్రాయం తెలుసుకున్నాక చెపుతాను. నువ్వు కాస్త అమ్మాయిని అడిగి ఆమె అభిప్రాయం యేమిటో తెలుసుకో !"

ఇంతలో గుమ్మంలోనించి "అయ్యగారు వున్నారా ?" అని యెవరో అడగ్గా కమలనాథయ్యగారు లేచివెళ్ళి "యేం శెట్టిగారు, ఇప్పుడొచ్చారు ?" అని అడిగాడు.

"రేపు వాయిదా కదుటండి ! సాక్షుల్ని యెవరెవర్ని హాజరుపెట్టాలో కనుక్కోడానికి వచ్చాను" అన్నాడు.

కమలనాథయ్యగారు అతనితో ఆ విషయాలు ముచ్చడించడం మొదలు పెట్టారు.

అమర్నాడు సాయంత్రం కచేరీ హాల్లోవున్న కమలనాథయ్యగారిని శాంతమ్మ పిలవగా లోనికి వెళ్ళారు.

"కూర్చోండి ! అమ్మాయిని అడిగాను" అంది శాంతమ్మ.

కమలనాథయ్యగారు సోఫాలో కూర్చుంటూ "అయితే యేమంది ?" అన్నాడు.

"ఆమె అభిప్రాయం రాధాకృష్ణమీద కనవర్చింది."

"భేష్ ! నా సంకల్పంగూడా అదె ! కుర్రవాడు స్ఫురద్రూపి, మంచి ఆరోగ్యవంతుడు. అందులో బి. ఎ. చదువుతున్నవాడు."

"కుర్రవాడు మంచివాడే కానివ్వండి; ఆధారం యేమీలేనివాడు. వకరి ఇంట్లో అభ్యాగతిగా వున్నవాడు !"

"ఇంకేం ఆధారం కావాలి ? అతని చదువే అతని ఆస్తి! రేపు ఉద్యోగం చేసుకుని బ్రతకగలరు. ఆమెకు నచ్చినవాణ్ని చెయ్యాలిగాని నచ్చనివాడికి కట్టబెట్టి పుట్టెడు ఐశ్వర్యంలో కూర్చోబెడితే మాత్రం ఆమెకు మనశ్శాంతి ఉంటుందా ?"

"సరే మీ ఇష్టం !"

ఇంతలో రాధాకృష్ణ వచ్చాడు. కమలనాథయ్యగారు మందహాసం చేస్తూ "రావోయ్ రాధాకృష్ణా ! అమ్మాయి డాబామైనవుంది !"

రాధాకృష్ణ యెకాయెకి డాబాపైకి వెళ్ళాడు. తన గదిలో కూర్చుని పుస్తకం చదువుకుంటున్న రమ, రాధాకృష్ణనుచూచి విప్పారిన ముఖంతో ఆహ్వానించింది. రాధాకృష్ణ రమ దగ్గరగా ఉన్న కుర్చీలో కూర్చుని "నావెల్ బాగా చదువుతున్నావా ?" అని అడిగాడు.

అదే చదువుతున్నాను" అంది రమ.

కాసేపు యేవోకబుర్లు చెప్పుకున్నాక రెండు కప్పులతో కాఫీ, రెండు ప్లేట్లతో ఫలహారాలు పైకి వచ్చినవి.

"మీయింటికి వస్తే యిదివకటి!"

"వకవాతేదులే! పుచ్చుకో ?" అంటూ డ్రాయరుమీదవున్న ప్లేటును రాధాకృష్ణవేపుకు జరిపింది రమ.

యిద్దరూ అవన్నీ ఖాళీచేశారు.

రమ మాటా మాటా సందర్భంలో "మావాళ్ల నా మేరేజి చెయ్యాలను కుంటున్నారు, రాధాకృష్ణ" అంది.

"ఓ, చాలా సంతోషం! కంగ్రాచ్యులేషన్సు!" అన్నాడు రాధాకృష్ణ.

ఆ మాటకు రమ చకితురాలైంది. రమకు కల్యాణి మొదలైన జత కత్తె లందరికంటే తాను అందంగా వుంటానని గర్వం. అందువల్ల రాధాకృష్ణ తనను ప్రేమిస్తున్నాడని నమ్మకం. పెళ్లిమాట యెత్తగానే అతడే అంచిస్తాడని తన అభిప్రాయం. రాధాకృష్ణవల్ల సరియైన సమాధానం రాకపోయేసరికి "మరి నీ వుద్దేశం యేమిటి ?" అని అడిగింది.

"నా వుద్దేశం యేముంది!" అన్నాడు రాధాకృష్ణ.

"అలాగంటావేం ? యిప్పుడు కలిసి మెలిసి వుంటున్నట్టుగానే ముందు భావిజీవితంలోగూడా మనిద్దరం కలిసి మెలిసి వుండాలని నా వాంఛ" అంది.

'ఓయి భగవంతుడా! తన విట్లావుందనివ్వకుండా తనమీద యిదేం దండయాత్ర' అని రాధాకృష్ణ మనసులో అనుకుని "యిప్పుడు కలిసి మెలిసి వుంటున్నామని భావిజీవితంలోగూడా కలిసి మెలిసి వుండాలని యేమిటి ?" అన్నాడు.

"ఇలా మాట్లాడతావు అనుకోలేదు. ఐతే నువ్వు ప్రేమించింది రంభయి వుండాలి!"

"రంభ ! నేనెవర్నీ ప్రేమించడంలేదు !"

"నంగనాచిలా మాట్లాడతావేం ! నేను నమ్ముతా ననుకుంటున్నావా ?"

"నమ్మూ; నమ్మకపో ! వున్న వాస్తవం అది. ప్రేమించటానికిగూడా తాహతు వుండాలి !"

"మనస్సు వేరైనప్పుడు అనేకం కప్పిపుచ్చుకోవచ్చు !"

"అయితే పొరపాటు పడుతున్నావు రమ ! జీవితంలో ప్రేమతప్ప పరిష్కరించుకోవలసినవి యేవీలేవా ? ముఖ్యమైనవి యెన్ని వున్నవి ? వకరి పంచనవుండి వారు అంత పెడితే తిని మనుగడ సాగిస్తున్న వాడికి ప్రేమించే తాహతు యెక్కడిది?" అన్నాడు.

"ప్రేమించటానికి యితర విషయాలకు సంబంధం యేమిటి ? మనసు కలిస్తే జంటపక్షుల్లా హాయిగా ప్రేమజీవితం గడపవచ్చును. నువ్వు లేనిపోని అల్పత్వాన్ని తెచ్చిపెట్టుకుంటున్నావు !"

"నా జీవితం ఓ యెడారిలాంటిది. తల్లినీ చెల్లెల్నీ కోల్పోయి వాళ్ళు యెక్కడున్నదీ యింతవరకూ తెలియక అలమటించిపోతున్న నాకు పెళ్ళెందుకు? వాళ్ళను తలుచుకుని విచారపడని రోజులేదు. నీ మాటను తిరస్కరించి నందుకు క్షమించు రమా!" అని రాధాకృష్ణ అంతటితో బయటపడ్డాడు.

రాధాకృష్ణ వాళ్ళయిల్లుదాటి నాలుగడుగులు వేసేటప్పటికి పద్మనాభం యెదురుపడి "మీ ఇంటికే వెళ్ళవస్తున్నానోయ్! అట్లా పార్కుకు వెళదాం రా!" అని రాధాకృష్ణను లాక్కెళ్ళాడు.

రాధాకృష్ణ ఇంటికి వచ్చేసరికి యేడుగంటలు దాటింది. తన గదిలో స్విచ్ వేసుకుని దీపం వెలిగించి కుర్చీలో కూర్చుని డ్రాయరుమీద ఏదో పాత వారపత్రిక వుండగా తిరగేస్తున్నాడు.

"మంచినీల బాయికాడ మల్లెపూల తోటకాడ ఉంగరాలే మరిసివత్తిమి కదరా! పెల్ మోహనరంగ" సోములుపాట వినవస్తున్నది.

"ఏం యియ్యాల పాటలు వత్తున్నయ్, తాగొచ్చావా ?" సోములుభార్య గొంతు.

"మన డబ్బులు కాదులేయే ! యియ్యాల ఏం జరిగిందనుకున్నావు !"

"అట్టాగే అంటావు! యేదో వంకపెట్టుకుని తాగొస్తేది :"

"నీ సోపే నీకు. చెప్పేది యినవేం : మన అల్లుడు కనబడ్డాడే :"

"యెక్కడేటి ?"

"యియ్యాల మంచిబాడిగ తోలినానే: ఏదో ఓ పావలాకాసు కడుపు పెట్టుకుందామని కొట్లోకి యెల్లానే! అక్కడ ఏం జరిగిందీ : మన అల్లుడు, ఇంకా యెవరెవల్లో కూచుని యేసుకుంటా వున్నారు. అల్లుడు నన్నుచూసి గలాసునిండా పట్టుకొచ్చి 'యేసుకో మావా' అన్నాడు.

"అప్పుడు నేను ఇతడి దగ్గిర యింత మరియాద వుండది - అయాల యెందుకు అట్టా అన్నానా అని మనసులో అనుకుని గలాసు తీసుకుని యేసుకున్నానే: అల్లుడు గుమ్ముచేసినాడు పో: అప్పుడు నేను 'అల్లుడా : మనకి మనకి తగాదా యెందుకు? అమ్మాయిని పంపించేత్తా. బుద్ధికలిగి యేలుకో' అని సెప్పానే."

"అయితే యెప్పుడొచ్చి తీసుకెళతానని చెప్పాడు ?"

"పలానా అప్పుడు వత్తానని చెప్పలేదు. రేపో యెల్లుండో రావొచ్చు: మన అల్లుడు చానా మంచోడే: యేమో అనుకున్నా! రేపుగనక వత్తే మన పూలకోడి వున్నదే దాన్నికోసి మరియాద సెయ్యాలి :"

ఆ మాటలు వినేసరికి రాధాకృష్ణకు నవ్వొచ్చింది. ఇంతలో కిందనించి లక్ష్మణరావుగారు కేకవెయ్యగా రాధాకృష్ణ కిందకుదిగి వెళ్ళాడు.

* * *

తర్వాత నాలుగురోజులకు కాలేజి వదిలిపెట్టాక రాధాకృష్ణ, చంద్రం, పార్థసారధి మాట్లాడుకుంటూ వస్తూ పెట్రోలుబంకు దగ్గర చంద్రం విడిపొయ్యాడు. అక్కడనించి రాధాకృష్ణ, పార్థసారధి కలిసి పార్థసారధి ఇంటికి వెళ్ళారు.

పార్థసారధి తన రచనలను చదివి వినిపించడంలో కొంచెం ఆలస్యమైంది. రాధాకృష్ణ పార్థసారధితో చెప్పి ఇంటికి బయలుదేరాడు.

ప్రొద్దుకూకటానికి యెంతో వ్యవధిలేదు. చీకటి వెలుతురుతో పెనుగులాడుతోంది. కాలేజీనించి పార్థసారధి ఇంటికంటే అక్కడనించి తన యిల్లే దూరం. రాధాకృష్ణ ఆ బజారుమలుపు తిరిగి ఓ సందులోనించి నడుస్తున్నాడు.

రోడ్డు యెక్కడానికి ఆ సందు దాటాలి. ఆ సందులో ఇళ్ళు అట్టేలేవు. ఎవరివో దొడ్డివాకిళ్ళు వున్నవి. యెడమప్రక్క యెవరిదో బారుగా ప్రహరీగోడ కట్ట బడిన ఖాళీస్థలం వున్నది. యెవరో యిద్దరు మనుషులు రాధాకృష్ణ వెనకనించి వడివడిగా నడిచివస్తున్నారు. ఒకడు యువకుడు; రెండోవాడికి నలభై యేళ్ళుం టవి. యిద్దరూ దృఢంగా వున్నారు. ఆ సందులో జనం యెవరూ మెదలటం లేదు. ఆ యిద్దరూ యిందాక కాలేజిదగ్గర తగిలారు. రాధాకృష్ణ, పార్థసారధి కాలేజిరోడ్డునే వస్తూవుంటే ఆ ఇద్దరూ ఇట్లాగే వాళ్ళవెనక వస్తున్నారు. ఇప్పుడు గూడా వాళ్ళే! జనం యెవరూ మెదలని ఆ సందులో తనను వెంబడించడంతో రాధాకృష్ణకు అనుమానంవేసింది. రాధాకృష్ణ సందు మధ్యలోకి వచ్చాడు. వాళ్లు వెనకనించి వడివడిగా వచ్చేస్తున్నారు. కొంచెం దూరంలో యెవరిదో పెంకు టిల్లు కనిపిస్తూ వుండగా రాధాకృష్ణ వడివడిగా వెళ్ళి ఆ యింట్లో జొరబడ్డాడు.

రాధాకృష్ణకు ఆ ఇంట్లో ఓ చిత్రమైన దృశ్యం గోచరించింది. రావు గారు మంచంమీద కూర్చుని ఓ యువతితో మాట్లాడుతున్నాడు. ఆ యువతి యెర్రగా బక్కపలచగా నాజూకుగా వుంది. యువతి పోలికలు ఆ రోజున రావు గారిభార్య చెప్పినట్లుగానే వున్నవి. రాధాకృష్ణ చూసి చకితుడయ్యాడు. తనను చూసి మాష్టరుగారు యేమనుకుంటాడో, యెందుకొచ్చావంటే ఏంచెప్పాలి అని తటపటాయిస్తున్నాడు.

ఇంతలో "ఏమోయ్ ఇట్లా వచ్చావు?" అని అడిగాడు రావుగారు.

అట్లా తనను యెవరో వెంటాడుతూ వుండగా వచ్చానంటే అసంద ర్భంగా వుంటుంది. ఆయన రహస్యాలన్నీ తెలుసుకోడానికి వచ్చి యేదో సాకు చెప్పినట్టుగా వుంటుంది- అనుకుని "వక స్నేహితుడు యిల్లు యీసందులోనే అనిచెప్పి వెతుకుతున్నానండీ!" అని చెప్పాడు.

"ఓహో! అట్లాగా!" అన్నాడు రావుగారు.

తాను ఆమాట చెప్పినప్పుడు అక్కడ ఆలస్యంచేస్తే యేం బాగుంటుంది? రాధాకృష్ణ వీధి గుమ్మంలోకివచ్చి అటూ యిటూ చూశాడు. వాళ్లు కనిపించ లేదు. తనకోసం యెక్కడైనా పొంచి వుండకూడదా- అనుకుని కాసేపు నిల బడ్డాడు. యింతలో ఆసందు పైనించి గుఱ్ఱంబండి వస్తున్నది. అందులో

యెవరూలేరు. ఖాళీగానే వున్నది. దగ్గరికి వచ్చాక చూస్తే ఆబండి సోములది. అప్పుడు రాధాకృష్ణకు ధైర్యం వచ్చింది. సోములు గుమ్మంలో నిలుచునివున్న రాధాకృష్ణనుచూసి "యేం అబ్బాయిగారు, యిక్కడ వున్నారు!" అని అడిగాడు.

"పనిమీద వచ్చాను సోములు!" అంటూ రాధాకృష్ణ బండియెక్కి యింటిదాకా పోనివ్వమన్నాడు.

సోములు బండితోలుతూ "ఇందాక బలేకూనీ జరిగిందండి!" అన్నాడు.

"యెక్కడా?" అని అడిగాడు ఆత్రంగా రాధాకృష్ణ.

"యీపేట సివర గుడిసిల దెగ్గిర. యిద్దరికే యేంకచ్చలు వున్నయ్యో! అతగాడు వత్తావుంటే యెనకమాలేవచ్చి పొడిపేసి ఆయిపులేకుండా పరిగెత్తేసినాడంట. అతగాడికి నలభైయేల్లుంటై. తెల్లబట్టలు యేసుకున్నాడు. బజాల్లో కొట్టు గూడా వున్నాదంట, అంతా రకతం! నేను యెల్లి సూసివచ్చినాను. ఇసుమంటియ్యి ఆడదాని మూలంగానే కదండి జరిగేది. అతగాడికి యెవరో అతుకుండి! అంతా సెప్పుకుంటున్నారు" అని చెప్పాడు సోములు.

బండి యిల్లు చేరగా రాధాకృష్ణ బండిదిగి లోనికి వెళ్ళిపొయ్యాడు.

## ౧౮

మాఘమాసం వచ్చింది. చలి తగ్గిపోయి ఎండలు ముదర నారంభించినవి. యీడువచ్చిన పిల్లలువుండి మంచి రోజుల కోసం యెదురుచూస్తున్న గృహస్థులు వాళ్లకు పెళ్లిళ్లు చేయనారంభించారు. మేళతాళాలతోనూ, పచ్చగా అలంకరించుకున్న పేరంటాళ్ల తోనూ, వీధులన్నీ కళకళ్లాడు తున్నవి.

ఆరోజు ఉదయాన రాధాకృష్ణ తన గదిలో కూర్చుని యేదో వ్రాసుకుంటూవుండగా పద్మనాభం వచ్చి "లేవోయ్! యింకా రాసుకుంటూ కూర్చున్నావు!" అన్నాడు.

"కూర్చోవోయ్! వెళదాం. యిప్పుడు ఎనిమిదేగా అయింది!" అన్నాడు రాధాకృష్ణ.

"తొమ్మిదింటికి లగ్నం. మనం నిక్కునీలిగి వెళ్ళేసరికి ఆవేళవుతుంది!" అన్నాడు పద్మనాభం.

"అయిపోయింది; వస్తున్నా!" అంటూ రాధాకృష్ణ తొందరతొందరగా వ్రాయడం ముగించి కిందకువెళ్ళి బట్టలువేసుకుని పైకిరాగా యిద్దరూకలిసి పార్థసారధి యింటికి వెళ్ళారు.

వీళ్లు వెళ్లేసరికి వారియిల్లంతా బంధువులతో కళకళ్లాడుతూవుంది. ఇంటి ఆవరణలో వేయబడిన పందిరికి పచ్చని తోరణాలు కట్టబడినవి. ఒకవేపు సన్నాయి మేళంమోగుతూవుంది. పార్థసారధి చెల్లెలు పెళ్ళి. అప్పుడే వివాహవేదిక మీదికి వధూవరులను తీసుకువచ్చి బ్రాహ్మణుడు మంత్రాలు చదువుతున్నాడు. వేదికకు ఒకప్రక్కన స్త్రీలు,వకప్రక్క పురుషులు కూర్చున్నారు. రాధాకృష్ణ, పద్మనాభం ఇంకాకొందరు మిత్రులు వేదికకు కొంచెందూరంగా కూర్చున్నారు. వేదిక అవతలప్రక్క కూర్చున్న స్త్రీలలో ఓ అమ్మాయిని రాధాకృష్ణచూశాడు. వయసు పదిహేను- పదహారేళ్లుంటవి. అంతా తన చెల్లెలు శశి మాదిరిగానే వున్నది. తన చెల్లెలు యిక్కడ కెందుకొస్తుంది? భారతివచ్చిందేమో అనుకున్నాడు.

బ్రాహ్మణుడు సూత్రధారణ చేయించి కట్నాలు చదివించడం మొదలు పెట్టాడు.

రాధాకృష్ణ కళ్ళన్నీ ఆ అమ్మాయి మీదనే వున్నవి. భారతి అనుకుందామంటే కొన్నిస్వల్పతేడాలు కనిపిస్తున్నవి. భారతి కొంచెం బొద్దుగా వున్నట్లుంటుంది. యెత్తు నరిలోకూడా కొంచెం తేడావుంది. భారతి కూడాకాదు. యెవరో అమ్మాయి. మనుషులను పోలినవాళ్ళు వుంటారు- అనుకున్నాడు.

కట్నాలు ముగిసి తలంబ్రాలు పోసుకోవడం గూడాకాగా వధూవరులను లేవతీశారు. అక్కడ కూర్చున్న పెద్దలంతా లేచారు. అప్పుడు పదకొండు దాటింది. 'అయ్యా! మీరంతా యెవరూ యిళ్ళకువెళ్ళవద్దు; వంటతయారయింది. యిక భోజనానికి కూర్చోవడమే తరువాయి!' అని పార్థసారధి తండ్రి అందర్నీ వుద్దేశించి చెప్పాడు.

పన్నెండు గంటలకల్లా మొదటిబంతి లేచింది. తర్వాత లోపలకూర్చుని మిగతా వున్నవారంతా భోంచేస్తున్నారు. రాధాకృష్ణ, పద్మనాభం భోజనంచేసి ఇంటిప్రక్క ఆవరణలో పందిరికింద బల్లమీద కూర్చున్నారు. వాళ్ళకు ఎదురుగా కొంచెందూరంలో వేపచెట్టుకింద చాపమీద కొందరు స్త్రీలుకూర్చుని తమల

పాకులు వేసుకుంటున్నారు. ఇందాకటి అమ్మాయిగూడా వాళ్ళల్లోకూర్చుని ఆకులు వేసుకుంటున్నది. రాధాకృష్ణ అటువైపే చూస్తున్నాడు. యెందుకో ఆ అమ్మాయి తనవేపేచూస్తున్నది. "శశిరేఖా, నాకు మన్నం ఎక్కువైంది. రెండు ఆకులు యివ్వవే" అని అవతల కూర్చున్న ఓ యువతి అడగ్గా, ఆ అమ్మాయి "ఎన్ని ఆకులు నములుతావేంటి!" అంటూ ఆకులు యిచ్చింది.

రాధాకృష్ణకు గుండెల్లో నించి ఆనందం పొంగుకొచ్చింది. తనచెల్లెలు పేరుగూడా అదే! ఆ అమ్మాయి గొంతు కూడా విన్నాడు. తన చెల్లెలి స్వరమే! ఆ అమ్మాయి దీక్షగా తనవైపే చూస్తున్నది. రాధాకృష్ణ చివాలున లేచి వక్క అంగలో అక్కడకు వెళ్ళి ఆనంద పారవశ్యంతో "శశీ!"అన్నాడు.

ఆ అమ్మాయి "అన్నయ్యా!"అంటూ లేచి, రాధాకృష్ణను, ఆలింగనంచేసుకుని డగ్గుత్తికతో "ఇన్నాళ్ళబట్టీ యెక్కడున్నావు అన్నయ్యా?" అంది.

రాధాకృష్ణ ఆ మాట వినిపించుకోకుండానే "అమ్మ యేది? అమ్మా నువ్వూ యెక్కడుంటున్నారు?" అని అడిగాడు.

"అమ్మలేదు" అనిరోదన స్వరంతో అంది శశి.

ఆ మాటలో అమంగళం ధ్వనించగా రాధాకృష్ణ కంపిత కంఠంతో "యేమైంది?" అని అడిగాడు.

"చచ్చిపోయింది!" అని బావురుమంది శశి.

పిడుగులాంటి ఆ వార్త వినేసరికి రాధాకృష్ణ కళ్ళు చీకట్లు కమ్మినవి. భూమి కంపించింది. ప్రళయం వచ్చినట్లయిందతనికి. అంతా అయోమయం అయిపోయింది. బాహ్యప్రపంచం యెదురుగావున్నా, చెట్లూ మనుషులూ ఇవ్వా యేమీ కనిపించడంలేదు. అంతా అంధకారం. పసిపిల్లవాడిలా వెక్కి వెక్కి యేడ్వనారంభించాడు. అక్కడవున్న వాళ్ళంతా విస్తుపోయి చూస్తున్నారు. ఇంతలో వెంకటనారాయణ, పద్మనాభం వచ్చి రాధాకృష్ణను ఓదార్చారు. కార్య భారంలో మునిగివున్న పార్థసారధిగూడా వచ్చి రాధాకృష్ణను పూరడించాడు. రాధాకృష్ణ దుఃఖం దిగమింగి "అమ్మ యెన్నాళ్ళయింది చనిపోయి?" అని అడిగాడు.

ఆ రోజున సత్రంలో తననువదిలి ఆత్మహత్య చేసుకున్న వృత్తాంతం అంతా చెప్పింది శశి.

అప్పుడు వెంకటనారాయణ యిలా అన్నాడు. "అబ్బాయి, జరిగిందేమో జరిగిపోయింది. మీరు దుఃఖపడితే ఏంలాభం! శశి మా యింట్లోనే వుంటున్నది. రామం గుంటూరులో ఇంటరు చదువుతున్నాడు. శశిగూడా మనవూళ్ళో ఫిఫ్తుఫారం వరకూ చదివింది. మీ చెల్లెలు యెక్కడున్నావో అని విన్నే యెప్పుడూ కలవరిస్తూ వుంటుంది. ఇవాళ చాలా సుదినం. మేమంతా నిన్నుగురించే అనుకుంటూవుంటాం!" అన్నాడు.

"యేమి సుదినం? అమ్మ లేకపోయినాక!" అని రాధాకృష్ణ పొంగి వచ్చే దుఃఖాన్ని ఆపుకుని కళ్ళవెంట కారుతున్న నీళ్ళు తుడుచుకున్నాడు.

తనతల్లి లేకపోయినా చెల్లెలూ తనూ ఈ వియోగానంతరం కలుసుకున్నందుకుగాను యిద్దరూ ఒకచోటవుండి కాలంవెళ్ళబుచ్చేటందుకు వీల్లేదు. పక్షుల్లాగా చెట్టుకొకళ్ళం అయిపోయ్యాం! అని మనసులో అనుకుని రాధాకృష్ణ కాసేపు చెల్లెలితో మాట్లాడి పద్మనాభంతో కలిసి ఇంటికి బయలుదేరాడు.

రాధాకృష్ణ బజారున నడుస్తున్నాడన్న మాటేగాని యిళ్ళూ, వాకిళ్ళూ, జనం అతనికేమీ గోచరించడంలేదు. అతనికి కనిపిస్తున్నదల్లా తల్లిస్వరూపం ఒకటే! అతనికాళ్ళు అతనికి తెలియకుండానే అడుగులు వడుతున్నవి. ఇద్దరూ మాట్లాడకుండా మౌనంగా నడుస్తున్నారు.

ఇల్లు సమీపించగా ఇద్దరూ లోనికి వెళ్ళారు. పద్మనాభం రాధాకృష్ణను అతని గదిలో దిగవిడిచి వెళ్ళిపొయ్యాడు.

గదిలో ఏకాంతంగాఉన్న రాధాకృష్ణకు దుఃఖమంతా ఒక్కసారి పెల్లుబికింది. తానంటే పంచప్రాణాలువదిలే అమ్మ తాను కనబడకపోవటంవల్ల దుఃఖభారంతో విరక్తి చేసుకుంది. తండ్రిపోయినా తానేదో పెద్దవాడై ఉద్ధరిస్తాడని తనమీద ఆశలన్నీ పెట్టుకున్న అమ్మ ఆఖరుకు తన మూలకంగానే కళ్ళు మూసింది. నవమాసాలు మోసి, ప్రేమతో పెంచిన అమ్మ తనవల్ల యేమీ అనుభవించకుండానే వెళ్ళిపోయింది. తండ్రే కరువయ్యాడనుకుంటే ఇప్పుడు తల్లికూడా కరువైంది. రాధాకృష్ణ యేడ్చి, యేడ్చి గోడకుపెట్టివున్న మంచం వాల్చుకుని పడుకున్నాడు.

రాత్రి ఎనిమిదిగంట లయింది. రోజూ అంతకుముందే భోజనానికివచ్చే రాధాకృష్ణ ఆవాళ రాలేదు. అదిన్నీ గాకుండా ఉదయం స్నేహితుని ఇంటికి పెళ్ళికి వెళతానని ఆమెతో చెప్పివెళ్ళిన దగ్గరనించీ రాధాకృష్ణ ఆమెకు కనిపించనే లేదు. ఎందువల్లనా అనుకుని రాజ్యలక్ష్మమ్మగారు డాబాపైకి వెళ్ళింది. రాధాకృష్ణ గదితలుపు తెరిచే వున్నవి. గాని దీపంలేదు. రాజ్యలక్ష్మమ్మగారు గదిలోకి వెళ్ళింది. రాధాకృష్ణ పడుకుని వున్నాడు. రాజ్యలక్ష్మమ్మగారు స్విచ్ వేసింది. రాధాకృష్ణ నిద్రపోతున్నాడు. భోజనం చెయ్యకుండానే నిద్రపోతున్నాడు. వంట్లో యేమైనా బాగోలేదా-అనుకుని తట్టి లేపింది.

రాధాకృష్ణ నిద్రలో సుఖానుభూతిలో వున్నాడు. మామూలుగా వాళ్ళఇంట్లో ఉన్నట్టు, బడినించి రాగానే తల్లి అతనికి దాచివుంచిన చిరుతిళ్ళు పెట్టినట్లు, లాలించి తనకు నెయ్యి కొసరి కొసరి వేసి అన్నంపెట్టినట్లు సుఖస్వప్నంలో వున్నాడు. రాజ్యలక్ష్మమ్మగారు లేపగా కళ్ళువిప్పి చూశాడు. యెదుట రాజ్యలక్ష్మమ్మగారు నిలుచుని "ఏం నాయనా! భోజనం చెయ్యకుండా పడుకున్నావు?" అంటూవుంది.

రాధాకృష్ణ లేచికూర్చుని దుఃఖంతో "అమ్మ చనిపోయింది!" అన్నాడు.

"ఎప్పుడు ? నీకెట్లా తెలిసింది ?" అని ఆదుర్దాగా అడిగింది రాజ్యలక్ష్మమ్మగారు.

"మా చెల్లెలు కనిపించి చెప్పింది ?"

"ఎక్కడ కనిపించింది ?"

"పార్థసారధి ఇంటికివెళ్ళితే అక్కడ కనిపించింది. పెళ్ళికొడుకు తరుపున అక్కడకు వచ్చారు" అని చెప్పాడు.

"దుఃఖపడకోకు నాయనా ! జరిగిపోయిం దానికి యేంచేస్తాం ?" అని ఓదార్చి "అన్నం తిందువుగాని రా నాయనా !" అంది.

"నాకు ఆకలిగా లేదు" అన్నాడు రాధాకృష్ణ.

"లే నాయనా ! ఒకముద్దతిని పద్దువుగాని- జరిగిపోయిం దానికి విచారపడుతూకూర్చుంటే యేంలాభం !" అని బ్రతిమలాడి రాధాకృష్ణను కిందకు తీసుకువెళ్ళి విస్తరివేసి వడ్డించింది. వడ్డిస్తూ "మీ చెల్లెళ్ళు యిక్కడకు తీసుకురాకపోయ్యావా నాయనా! వాళ్ళకోసం పాపంయెన్నాళ్ళనించి వలవరిస్తున్నావు!"

అంది. రాధాకృష్ణ అందుకు బదులు చెప్పకుండా అయినట్టు పోయినట్టు రెండు ముద్దలు తిని లేచి చెయ్యి కడుక్కుని డాబాపైకి వెళ్ళిపొయ్యాడు.

మర్నాడుదయం రాధాకృష్ణ కాఫీకి రాకపొయ్యేసరికి రాజ్యలక్ష్మమ్మగారు డాబాపైకివెళ్ళి చూసింది. రాధాకృష్ణ మంచంమీద పడుకుని వున్నాడు. ఒళ్ళు పట్టుకుని చూస్తే వేగిపోతున్నది. రాజ్యలక్ష్మమ్మగారు కిందకుదిగి లక్ష్మణరావు గారితో చెప్పింది.

కాసేపటికి లక్ష్మణరావుగారు, ఇంటి డాక్టరు కలిసి డాబాపైకి వెళ్ళారు. రాధాకృష్ణను పరీక్షించి "నా వెంట మనిషిని పంపండి- మందిచ్చి పంపుతాను. ఏ జ్వరమైందీ రేపటికిగాని తెలియదు. బార్లీ, పళ్ళరసం యిస్తూవుండండి"అని చెప్పి వెళ్ళిపొయ్యాడు.

తొమ్మిది గంటలకు పద్మనాభం వచ్చాడు. రాధాకృష్ణ వళ్ళుపట్టుకుని చూసి "ఏమిటోయ్ జ్వరం తెచ్చిపెట్టుకున్నావు? డాక్టరుకు చూపించాలి!" అన్నాడు.

"ఇంతకుముందే డాక్టరుచూసి వెళ్ళాడు" అని చెప్పాడు రాధాకృష్ణ.

"ఏ జ్వరం అని చెప్పాడు?"

"చెప్పలేదు. మందిచ్చి పంపుతానన్నాడు. కాలేజీకి నాలుగు రోజులు శలవు చీటీరాయి. సంతకం పెడతాను" అన్నాడు.

పద్మనాభం శలవుచీటీ వ్రాయగా రాధాకృష్ణ సంతకం పెట్టాడు. "సరే నాకు కాలేజివేళవుతున్నది; నువ్వు డాక్టరుచెప్పిన ప్రకారం శ్రద్ధగా మందు తాగు" అనిచెప్పి చీటీ తీసుకుని పద్మనాభం వెళ్ళిపొయ్యాడు.

ఆ సాయంత్రం చంద్రంవచ్చాడు. రాధాకృష్ణకు జ్వరంతగ్గక పోవడం వల్ల చంద్రం యింటికి వెళ్ళకుండా అక్కడనే వుండిపొయ్యాడు.

మర్నాడు ఉదయానికికూడా జ్వరంతగ్గలేదు. డాక్టరువచ్చి చూచి "మలేరియా యేమో అనుకున్నాను గాని అదికాదు. యింకా రెండురోజులు చూస్తేగాని యేజ్వరమైందీ నిర్ణయించటానికి వీల్లేదు" అనిచెప్పి ఓకాగితంమీద ఏదోమందువ్రాసి యిచ్చి ఆమందు తెచ్చి మూడుపూటలూ వాడమని చెప్పి వెళ్లిపొయ్యాడు.

అమర్నాథుగూడా జ్వరం తగ్గుముఖం పట్టలేదు. రాజ్యలక్ష్మమ్మగారు కాలుగాలిన పిల్లిలాగా పైకీ కిందికీ తిరుగుతున్నది. చంద్రం అవసరదాకావుండి కాలేజీవేళ కాగా వెళ్లిపొయ్యాడు. రాధాకృష్ణ అప్పుడే కొద్దిగా పండ్లరసం తాగి కళ్లుమూసుకుని పడుకున్నాడు. యింతలో చల్లటి హస్తస్పర్శ తగలడంవల్ల రాధాకృష్ణ కళ్లుతెరచి చూశాడు. కల్యాణి మంచందగ్గర నిలుచుని "యింకా జ్వరంతగ్గుముఖంపట్టలేదు. డాక్టరు యెప్పటికి తగ్గుతుందనిచెప్పాడు" అని అడిగింది.

"ఫలానా అప్పుడు తగ్గుతుందని చెప్పలేదు" రాధాకృష్ణ మెల్లిగా అన్నాడు.

"మంచందగ్గర గ్లాసులో పళ్లరసం అలాగేవుంది. తాగలేదేం? "అంది.

"కొద్దిగా తాగాను"

"పళ్లరసమైనా తాగకపోతే యెట్లా" అంటూ కల్యాణి గ్లాసుతీసుకుని యివ్వబోయింది.

"కొంచెంఆగి తాగుతాను" అని రాధాకృష్ణ వారించాడు.

తర్వాత రెండురోజులకు రాధాకృష్ణకు జ్వరంతగ్గింది. డాక్టరు వచ్చిచూసి "అప్పుడే అన్నం పెట్టవద్దు. రెండురోజులవరకూ పళ్లరసం, జావమీదనే వుంచవలసింద"ని చెప్పివెళ్లిపొయ్యాడు.

రాధాకృష్ణ తర్వాత వారంరోజులకుగాని కోలుకోలేదు. మళ్ళా కాలేజీకి వెళ్ళడం ప్రారంభించాడు. కాని ఇదివరకువున్న ఉత్సాహం అతనిలో కనిపించడం లేదు. యెప్పుడూ యేదో పరధ్యానంగా వుంటున్నాడు.

## ౧౫

గౌరి పరిస్థితులు తారుమారైనవి. ఇప్పుడు గరుడయ్యగూడా రావడం లేదు. ఎవరెవరో వచ్చిపోతున్నారు. క్రూరజంతువు ముందుగా వళువునువేసి తనకు కావలసిన మెరుగు బొరుగైనవి తిని చక్కాపోతుంది. మిగతా కళేబరాన్ని కొన్ని జీవరాసులు వాటి వాటి బలాబలాలనుబట్టి ఒకదాని తర్వాత ఒకటి స్వాంతం అయ్యేవరకూ పీక్కుతింటవి. అంతేఅయింది గౌరి పరిస్థితిగూడా. ఆమె శరీరంలో ఆరోగ్యం చెడి దుర్గతి ప్రారంభమైంది. ఒకరోజు లేస్తే ఒక

రోజు లేవడంలేదు. మందులకు, వాటికి తనదగ్గర కాస్తో కూస్తో వున్నడబ్బు ఆఖరై పోయింది.

ఒకరోజున గౌరి మూలుగుతూ పడుకుంది. సాయంత్రావికల్లా ముస్తాబై గుమ్మంలో నిలుచునేది-అవాళ్ళ;బైటికి రాలేదు. లోపలనే పడుకునివుంది. ఆ పడక పడక మర్నాడుగూడా లేవలేదు. ఆమెకు ఆలనా పాలనా అలకించే వాళ్ళెవరున్నారు? గౌరి పరిస్థితి చూసి పొరిగింటి వెంకటమ్మ ఆ రోజున జావ కాచి పోసింది. ఆ మర్నాటికి వ్యాధి వుధృతం హెచ్చింది. మంచంమీదనించి కాలు కిందపెట్టలేని పరిస్థితి యేర్పడ్డది. గౌరికి పరిచర్యచేసే వాళ్ళెవరున్నారు. వెంకటమ్మ బండిమాట్లాడి మెల్లిగా గౌరిని యెక్కించి అసుపత్రిలో చేర్చి వచ్చింది.

గౌరి నాలుగుమాసాలు అసుపత్రిలో వుంది. రుగ్మత చాలాభాగం తగ్గి పోయిందిగాని బాగాలేచి తిరిగే సత్తువలేదు. డాక్టరు గౌరిని డిశ్చార్జి చేశాడు. గౌరి యింకా కొన్నిరోజులు వుంటానన్నా వాళ్ళు వొప్పుకోలేదు. గౌరి ఆరోజు ఉదయం పదిగంటలకు అసుపత్రినించి బయటికి వచ్చింది. 'యిప్పుడు తాను యెక్కడికి వెళ్ళాలి?' అనాలోచితంగా రోడ్డునే నడుస్తున్నది. ఇప్పుడు ఆమె రూపు మారిపోయింది. వెనకటికీ యిప్పటికీ యేమాత్రం పోలికలేదు. యెర్రగా వుండే శరీరం నల్లబడిపోయింది. శరీరం శుష్కించి యెముకలు బైటపడినవి. వయసంతాపోయి ముసలితనం ఆవహించినట్లయింది. వెనక తానువున్న ఇంటి దగ్గరకువచ్చింది. ఆ యింట్లో యెవరోవుంటున్నారు. వెంకటమ్మ ఖాళీచేసి వెళ్ళి పోయినట్టు తెలిసింది. అక్కడనించి నడవసాగింది. కొంతదూరంపోయి కాళ్ల నొప్పులు వెయ్యగా ఓ డాబా పంచలో కూర్చుంది. అప్పుడు మధ్యాన్నం పన్నెండు గంటలవుతుంది. ఆమెకు ఆకలివేస్తున్నది. చూద్దామా, తన చేతిలో చిల్లిగవ్వ లేదు. అలానే కూర్చుంది. ఆ యింట్లోనించి కమ్మటి తిరగబోతవాసనలు ఆమె నోరు వూరించినవి. యింతలో లోపలనించి కుర్రవాడు యెనిమిది తొమ్మిదే ళ్ళుంటవి, కుక్కపిల్లను యెత్తుకువచ్చి వసారాలో వున్న బల్లమీద కూర్చుని చేతిలోవున్న రొట్టెముక్కను తినిపిస్తున్నాడు. యెదురుగా చెట్టుకొమ్మమీద కాకి జామపండు ముక్కుతో పొడుచుకుని తింటూవుంది. యింతలో లోపల

లేచినప్రాణం అవటంవల్ల ఆకలి విపరీతంగా వేస్తున్నది. గౌరి ఆశతో "కాస్త అన్నం పెడతారమ్మా"అని అడిగింది.

ఆ స్త్రీ "అన్నంలేదు గిన్నంలేదు వెళ్ళు," అంటూ గిరుక్కున తిరిగి లోనికి వెళ్ళిపోయింది. గౌరి అక్కడనించి లేచి మెల్లిగా అడుగులువేస్తూ నడుస్తున్నది. బజారువెంట యెందరో నస్తూపోతూ వున్నారు. యిదివరకు తన చుట్టూ తిరిగి తన ప్రాపకాన్ని సంపాయించిన యిద్దరు ముగ్గురు కనిపించి తననుచూసి తొలిగిపొయ్యారు. ఓ గుమ్మంలోనించి ఓ యువతి విస్తరాకులు పట్టుకుని బయట దబ్బాలో పడవేస్తున్నది. గౌరి ఆ గుమ్మంముందు నిలిచి ఆ యువతిని "కాస్త అన్నం పెడతారా అమ్మా!" అని అడిగింది.

"ఎందులో వెయ్యమన్నావూ? యేమీ తెచ్చుకోకుండా లింగు లింగు మంటూ వస్తే!" అంది ఆ యువతి.

తన బ్రతుకు ఈ స్థితికి వచ్చిందా అని గౌరి కళ్ళవెంట బొట బొట నీళ్ళుకారినవి. అక్కడనించి కదిలి అతిథులకు అభ్యాగతులకు ఆశ్రయమిచ్చే సత్రంలోకి చేరుకుంది. అక్కడ కొంతమంది యాత్రికులు పొయ్యిలు పెట్టుకుని అన్నం వండుకుంటున్నారు. కొంతమంది బిచ్చగాళ్ళు వూళ్ళో మాధాకవళం అడిగి తెచ్చుకుని తింటున్నారు. గౌరి సత్రం పంచలో కూచుంది. ఆమెకు ఆకలిచేత ప్రాణం సుడివడిపోతున్నది. గౌరికి కొంచెం ప్రక్కగా ఓ తాత వూళ్ళో తెచ్చుకున్న మధూకరం భోజనంచేసి తంబూర మీటుకుంటూ శ్రుతికలిపి "ఈ జన్మమిక దుర్లభమురా" అనే తత్వం పాడుతున్నాడు.

గౌరి కాసేపు కూర్చుని కళ్ళు తిరుగుతూవుంటే పడుకుంది. తాత ఆ తత్వం పాడి గౌరిని చూసి "యేవూరమ్మాయి మీది?" అని అడిగాడు.

"యీ వూరే!" అని చెప్పింది గౌరి.

"యీ వూరైతే సత్రంలోవచ్చి పడుకున్నావేం అమ్మాయి?" అని అడిగాడు.

గౌరి జవాబు చెప్పలేదు. గౌరి వునికిచూసి యెవరో పాపం బ్రతికిచెడిన అమ్మాయిలాగా వుంది. అనుకుని "మీ వాళ్ళెవరూ లేరా అమ్మాయి?" అని అడిగాడు తాత.

"లేదు!" అని క్లుప్తంగా బదులుచెప్పింది గౌరి.

"అయితే అన్నం తిన్నావా అమ్మా?" అని అడిగాడు జాలిగా.

తనకు కనిపించిన ఇంతమంది జనంలోనూ తనను అప్యాయంగా పలకరించి తన యోగక్షేమాలు అడిగింది తాతవక్కడే! అయితే తనకిప్పుడు తిండి కావాలి. తాత తనకేం సహాయం చెయ్యగలడు. డబ్బులేనివాళ్ళకు జాలి అధికమేమో అని తన అనుభవాన్నిబట్టి మనసులో అనుకుని తాత అడిగిన ప్రశ్నకు "లేదు" అని బదులు చెప్పింది.

"అయ్యో తల్లి! ఎంత యిబ్బందిలోవుండి యిక్కడికొచ్చావో! అకాలం అయిపోయింది. యింకా భోజనం చెయ్యలేదా అమ్మా! నా దగ్గర అన్నం, పులుసువుంది. ఇందాక ఒకవీధిలో సంతర్పణ దగ్గర నాకు అన్నం అదీ చాలా పెట్టారు. నేను తినగా పాత్రలో ఇంకా మనిషిఅన్నం వుంది. నేనూ బ్రతికి చెడ్డవాణ్ణి. శుచిగా వుంటాను. లేచి తినమ్మా!" అనిచెప్పి తాత అవతల ఒకర్ని ఆకు అడిగితెచ్చి గౌరికి భోజనం పెట్టాడు.

## ౨౦

చైత్ర మాసం వచ్చింది. ఒకరోజున లక్ష్మణరావుగారు ఎక్కడికో వెళ్లడానికని కారువచ్చి గుమ్మంలో సిద్ధంగావుండగా యింతలో కల్యాణికి రాజమండ్రినించి ఓసంబంధం వచ్చింది. ఐదారుగురు లోనికివచ్చారు. లక్ష్మణరావుగారికి కావలసినంత ఆస్థివుంది. మగపిల్లలులేరు. వున్నది యిద్దరు ఆడపిల్లలు. అందువల్ల కల్యాణిని చేసుకుంటామని తమకై తామే వస్తున్నారు. వెళ్లడానికి సిద్ధంగావున్న లక్ష్మణరావుగారు వచ్చినవారిని చూసి ఆగి వారిని సగౌరవంగా మధ్యహాల్లో కూర్చోబెట్టి మర్యాదచేశారు. వరుడుగూడా వధువును చూసుకోడానికి వాళ్ల వెంటనే వచ్చాడు. వరుడికి ఇరవై:యిరవైరెండేళ్లుంటవి. యెర్రగా అందంగా వున్నాడు. నూటయాభై రూపాయల జీతంమీద వుద్యోగం చేస్తున్నాడట. కొద్దో గొప్పో ఆస్థిగూడావుంది. లక్ష్మణరావుగారికి, రాజ్యలక్ష్మమ్మగారికి వరుడునచ్చాడు. వధువును చూపించగా వరుడికి నచ్చింది. ఇక వధువు ఇష్టంతీసుకోవాలి, కల్యాణిని తల్లిదండ్రులు లోనికి తీసుకువెళ్లి అడగ్గా "నేను చేసుకోన"ని చెప్పింది. అంతటితో లక్ష్మణరావు గారు వాళ్లకేదో సమా

ధానంచెప్పి పంపివేశాడు. వారటువెళ్లిపోవడంతోనే లక్ష్మణరావుగారు గుమ్మంలో తనకోసం వేచివున్న కారెక్కి వెళ్లిపొయ్యారు.

అమర్నాడు ఉదయం లక్ష్మణరావుగారు కచేరీ హాల్లో కూర్చుని వుండగా సైకిల్ మీద పోష్టు జవానువచ్చి ఓ ఎక్స్ప్రెస్ టెలిగ్రాం బట్వాడా చేసి వెళ్లి పొయ్యాడు. లక్ష్మణరావుగారు వుత్తరం చదువుకుని లోనికి పట్టుకువెళ్లి మధ్య హాల్లోవున్న రాజ్యలక్ష్మమ్మగారితో "గన్నవరంనుంచి అల్లుడు వుత్తరంరాశాడు. రేపు కుర్రవాడి ఉపనయనమట. రావలసిందని రాశాడు. ముహూర్తం త్వరలో కుదరటం వల్ల ఎక్స్ప్రెస్ డెలివరిరాశాడు" అనిచెప్పాడు.

"అట్లాగండి, అల్లుడు మొన్న వచ్చినప్పుడు కుర్రవాడి ఉపనయనం చెయ్యదలచాం, ముహూర్తంపెట్టి మీకు కబురుచేస్తాం తప్పక రావలసిందని చెప్పివెళ్ళాడుకదు; ఇంకేం; మనిషిని పంపకుండా ఉత్తరం రాశాడు:" అన్నది రాజ్యలక్ష్మమ్మగారు.

"సరే, అమ్మాయీ-నువ్వూ వెళ్ళండి !" అన్నాడు లక్ష్మణరావుగారు.

"రేపు ముహూర్తం ఎన్నింటికి ?"

"ఉదయం పదిగంటల కని వ్రాశాడు"

"మమ్మల్ని యెప్పుడు బయలుదేరమన్నారు ?"

"మనకారు మేజస్ట్రేటుగారు పట్టుకెళ్ళారు. రాగానే వెళ్ళుదురుగాని" అని చెప్పి లక్ష్మణరావుగారు కచేరీహాల్లోకి వెళ్ళిపొయ్యాడు.

అనుకున్న వేళకు కారు అందకపోవడంవల్ల మర్నాడు ఉదయం లక్ష్మణ రావుగారు భార్యతో "కారు ఇంకా రాలేదు. ఆయన కేంపునించి యింకా రానట్టుంది. రైలుకు వెళ్లండి. ముహూర్తం లోపలనే అక్కడకు చేరతారు. బండి వేళగూడా కావచ్చింది. జనం వత్తిడిగా వుంటుంది; రాధాకృష్ణను తీసుకు వెళ్లండి. టిక్కెట్లూ అవీ ఇప్పించి రైలు యెక్కించేటందుకు వుంటాడు" అని చెప్పగా వెంటనే రాధాకృష్ణను తీసుకుని రాజ్యలక్ష్మమ్మగారు; కల్యాణి రైలు స్టేషనుకువెళ్ళి రైలెక్కి గన్నవరం చేరుకున్నారు. బండి గన్నవరం చేరేటప్ప టికి తొమ్మిది దాటింది.

బండిదిగి ముగ్గురూ జట్కా మాట్లాడుకుని కూతురుగారింటికి బయలు దేరారు. బండి వాళ్ళయింటిముందు ఆగింది. బండివాడికి బాడుగయిచ్చి ముగ్గురూ లోనికి వెళ్ళారు.

అది నవీనపద్ధతులతో అందంగా కట్టిన డాబా. వీళ్ళు వెళ్ళేసరికి ఇల్లంతా బంధువులతో కళకళ్ళాడుతూ ఉన్నది. రాజ్యలక్ష్మమ్మగారు, కళ్యాణి సరాసరి లోనికి వెళ్ళిపొయ్యారు. డాబాముందు వసారాలో కొన్ని కుర్చీలు వేసివున్నవి. వాటిమీద కొందరు కూర్చుని ఉన్నారు. వారి సరసన రాధాకృష్ణ ఓ కుర్చీలో కూర్చున్నాడు.

మధ్యహాల్లో ఉపనయన క్రతువు ప్రారంభమైంది. బ్రాహ్మలు మంత్రాలు పఠిస్తున్నారు. చుట్టూ పెద్దలూ, పేరంటాళ్ళూ కూర్చున్నారు. మధ్యహాలు అవతల భాగంలో వంటప్రయత్నాలు జరుగుతున్నవి. యేపని చేసేవాళ్ళు ఆ పని చేస్తున్నారు.

ముందువసారాలో కూర్చునివున్న రాధాకృష్ణకు లోపలనించి "జానకమ్మా!" అన్నపేరు వినవచ్చింది. లోపలవున్న వాళ్ళలో యెవరో పిలుచుకుంటున్నారు. ఆపేరు వినేసరికి రాధాకృష్ణకు తనతల్లి స్మృతిపథంలోకి వచ్చింది. ఆ పేరుతో తన తల్లిని ఆప్యాయంగా అంతా పిలిచేవాళ్ళు. తనతల్లి చచ్చి యే స్వర్గానవుందో; తనకోసం అటమటించి కళ్ళుమూసిన అమ్మ స్వర్గాన గూడా తనమీద భ్రాంతి వదిలి విశ్రాంతిగా వుండగలుగుతుందా ? వట్టిది. రేయింబవళ్ళూ తననే పలవరిస్తూ వుండాలి. 'అమ్మా !' అని నోరారా పిలుచుకునే భాగ్యం తనకులేదు. తాను యెంతపాపం చేశాడో ! ఈ ఆలోచనలతో రాధాకృష్ణ విచారంలో మునిగిపొయ్యాడు.

ఉపనయనం జరిగిపోయింది. అంతా భోజనాలకు కూర్చున్నారు. మగవాళ్ళంతా మధ్యహాల్లో కూర్చున్నారు. వడ్డన ప్రారంభమైంది. పిండివంటలు తినడం అయ్యాక అన్నం కూరలూ వడ్డన జరిగింది. అన్నం సగం తినడం అయ్యాక పులుసువచ్చింది. కావలసినవాళ్ళు వడ్డించుకుంటున్నారు. వడ్డనచేసే వాళ్ళకు లోపలనించీ పులుసు అందివ్వడానికి వచ్చిన ఓ స్త్రీని భోజనంచేస్తున్న రాధాకృష్ణ చూశాడు. తైలసంస్కారంలేక రేగినజుట్టు, చౌకపాటు రకం చీర, నల్లకప్పువేసిన శరీరం.యెవరో పనిమనిషిలాగా వున్నది. అయితే ఆ స్త్రీలో

తనతల్లి పోలికలు కొన్ని కనిపించినవి. తనతల్లి బ్రతికివుండా? ఈ అభాగ్యుడికి అంత అదృష్టమా! ఆమె చనిపోయి యెన్ని సంవత్సరాలైందో: అమ్మ యిలా యెందుకు వుండేది? యర్రటి శరీరచ్ఛాయ. వేలముడి వేసుకొని లక్ష్మీదేవిలా యెంతోబాగా వుండేది. తనతల్లి స్వరూపం అతని కళ్ళల్లో మెదల కొచ్చింది.

భోజనాలైపోయినవి. రాధాకృష్ణ చెయ్యి కడుక్కొని దాబాప్రక్క అవరణలో వేయబడిన కుర్చీలో కూర్చున్నాడు. దాదాముందు వసారాలో భోజనానికి కూర్చోవడంవల్ల అక్కడవున్న కుర్చీలన్నీ యిక్కడ చేర్చారు. అక్కడ ఉన్న అన్ని కుర్చీలనిండా యెవరెవరో కూర్చున్నారు. రాధాకృష్ణ గోడదగ్గరగా వున్న కుర్చీలో కూర్చున్నాడు. గోడఅవతల వంటగది. ఆ గదిలోనించి యెవరెవరో స్త్రీలు మాట్లాడుకుంటున్న మాటలు వినవస్తున్నవి. అందులో ఒకగొంతు తాను ఎప్పుడో విన్నట్టు స్ఫురించింది.

ఎక్కడ విన్నానా అని పారచూసుకోగా లోగడ తనతల్లి స్వరంగూడా అలానే వుండేది. రాధాకృష్ణ చప్పునలేచి కిటికీలోనించి లోనికి చూశాడు. అక్కడ వంటపాత్రల దగ్గర ముగ్గురు స్త్రీలు కూర్చుని మాట్లాడుకుంటున్నారు. యిదాక వడ్డనదగ్గర పులుసు అందించిన స్త్రీగూడా అందులో వుంది. ఆ స్త్రీ తనదగ్గరవున్న స్త్రీలతో యేదో చెప్పుకుని కంటతడి పెట్టుకుంటూవుంది. ఆ గొంతు తాను భూమిమీద వడ్డదగ్గరనించీ కాకుండా గర్భంలో వున్నప్పటినించీ గూడా తనలో జీర్ణించిన స్వరం అది. అమ్మ చచ్చిపోలేదు! నిజంగా అమ్మే! అతని హృదయం ఆనందంతో పొంగిపోయింది. ఒక్క అంగలో లోనికి తిరిగివెళ్ళాడు.

రాధాకృష్ణ వెళ్ళేసరికి ఆమె కళ్ళుతుడుచుకుంటూ "యిందాకటి బంతిలో కూర్చున్న యెవరో అబ్బాయి - అంతా మా రాధాకృష్ణలాగానే వున్నాడ"ని వాళ్ళతో చెపుతూవుంది. రాధాకృష్ణ ఆనందపారవశ్యంలో "అమ్మా! నేనే మీ రాధాకృష్ణను!" అంటూ ఆమె దగ్గరికి వెళ్ళాడు.

ఆమె తన్మయత్వంతో "నువ్వేనటరా నా తండ్రి! నీ కోసం యెంతదుఃఖ పడుతున్నాను! ఇన్నాళ్ళబట్టి యెక్కడున్నావు?" అంటూ బిడ్డను మనసారా ఆలింగనం చేసుకుంది.

ఇక తల్లీబిడ్డల ఆనందాన్ని వర్ణించటానికి మాటలులేవు.

"ఇన్నాళ్లబట్టి యెక్కడున్నావమ్మా? నీకోసం యెంత చింతపడుతున్నాను!" అన్నాడు రాధాకృష్ణ.

"నువ్వు కనిపించినందుకు చాలా సంతోషంగానీ ఒక విచారంనాయనా! నువ్వు తప్పిపోయిన కొద్దిరోజులకే అమ్మాయిగూడా తప్పిపోయింది. యేమయిందో యేమో!" అంది జానికమ్మ.

"అమ్మాయి మొన్న నాకు కనిపించిందమ్మా - యెక్కడికీ పోలేదు. వెంకటనారాయణగారింట్లో సుఖంగావుంది!" అన్నాడు.

ఆమాటకు జానికమ్మ పొంగిపోతూ "అట్లాగా నాయనా! అదే పదివేలు! మీయిద్దరికోసం నేనుదుఃఖపడని రోజులేదు. మీయిద్దరి క్షేమంకంటే నాకుకావలిసిందేమిటి? యివాళ యెంతసుదినం! భగవంతుడు రక్షించాడు!" అంది.

"శశి నిన్నుగురించి ఓదుర్వార్త చెప్పింది. అప్పటినించి నేను పడ్డచింత అంతా యింతాకాదు" అన్నాడు.

"అవునునాయనా, అనేక కష్టాలు పడ్డాను. మళ్లా మిమ్మల్ని చూసుకునే యోగ్యతవుండి భగవంతుడు కాపాడాడు!" అంది.

ఇంతలో రాజ్యలక్ష్మమ్మగారు, కల్యాణి అక్కడకువచ్చారు. రాధాకృష్ణ "నీతర్వాత నన్నుఅన్ని విధాల కాపాడిన రెండో తల్లి!"అంటూరాజ్య లక్ష్మమ్మగారిని తల్లికి పరిచయంచేశాడు.

అప్పుడు రాజ్యలక్ష్మమ్మగారు "యీమేనా నీ తల్లి! నీకోసం పాపం రాధాకృష్ణ యెంతవిచార పడుతున్నాడమ్మా!" అంది.

ఆ మాటలకు జానికమ్మ "వాడికి నేను కాదు తల్లిని. మీరే! యేలోటు తానివ్వకుండా బిడ్డకంటే యినుమిక్కిలిగా సాకారు!" అని ఆమె రెండు చేతులూ పట్టుకుంది.

"నీ అదృష్టం మంచిదమ్మా! రాధాకృష్ణ ఎంత బుద్ధిమంతుడు! బిడ్డలా మాళోకలిసి పోయ్యాడు" అంది రాజ్యలక్ష్మమ్మగారు.

"అదంతా మీ చలవే నమ్మ!" అంది జానికమ్మ. "మొన్న రాధాకృష్ణ

అన్నం నీళ్లగూడా సరిగా ముట్టడంలేదు" అన్నది రాజ్యలక్ష్మమ్మగారు.
అవన్నీమాకు కనిరోజులు. కనిపట్టుకని అన్నితిప్పలుపెట్టింది" అంది జానికమ్మ.

ఇంతలో రాజ్యలక్ష్మమ్మగారి పెద్దకుమార్తె శ్యామల అక్కడకు వచ్చి "యిక్కడ యెవరు భోజనం చెయ్యాలి? జానికమ్మా! మీరు ముగ్గురూ కూర్చుందురుగాని రాండి!" అని పిలిచి హాలునిండిగా వెళ్ళిపోయింది.

"లే అమ్మా! వెళ్ళి భోజనంచేసిరా!" అన్నాడు రాధాకృష్ణ.

జానికమ్మకు ఆ సంతోషంలో భోజనం చెయ్యాలనిగూడా అనిపించడం లేదు. కుమారుడు చెప్పగా భోజనానికి లేచివెళ్ళింది. రాధాకృష్ణ పసిపిల్లవానిలా తల్లిని వదిలిపెట్టడంలేదు. ఆమెవెంటనే వుంటున్నాడు.

ఆ మర్నాడు రాజ్యలక్ష్మమ్మగారు యింటికి బయలుదేరుతూ జానికమ్మతో "పాపం మీరు యిన్ని రోజులకు కలుసుకున్నారు. రాధాకృష్ణతోపాటు నాలుగురోజులు వుండివద్దువుగాని రమ్మ"నిచెప్పగా జానికమ్మతో సహా అంతా బయలుదేరి వెళ్ళిపొయ్యారు.

ఇల్లు చేరుకోగానే రాధాకృష్ణ కొల్లిపరకు వెంకటనారాయణగారికి ఇట్లా తనతల్లి వచ్చింది; తన చెల్లెల్ని వెంటబెట్టుకుని తీసుకురమ్మని ఉత్తరం వ్రాయగా మూడోనాటికల్లా శశి వచ్చింది. శశి తల్లిని ఆలింగనం చేసుకుని ఆనందబాష్పాలు రాల్చింది. శశి వెంటవచ్చిన వెంకట నారాయణగారితో రాధాకృష్ణ"అమ్మాయి రెండురోజులు వుంటుంది. నేను తీసుకువచ్చి దిగపెడతాన"ని చెప్పగా వెంకటనారాయణ వెళ్ళిపొయ్యాడు.

ముగ్గురూ డాబామైన రాధాకృష్ణ గదిలో కూర్చుని వాళ్ళ వాళ్ళకు జరిగిన సంగతులు చెప్పుకోడంలో ప్రొద్దు యెటుపోయిందీ తెలియలేదు.

రాధాకృష్ణతల్లి వచ్చిందన్న వార్త విని ఆ సాయంత్రం పద్మనాభం, చంద్రం, పార్థసారధి ముగ్గురూ వచ్చారు. అప్పుడు రాధాకృష్ణ "వీళ్ళంతా నా స్నేహితుల"ని వాళ్ళను తల్లికి యెరుకపర్చగా ఆమె సంతోషించింది.

తర్వాత నాలుగురోజులకు ఉదయంపూట లక్ష్మణరావుగారు కచేరిహాల్లో కూర్చుని వుండగా ఒక ఆసామివచ్చి "లక్ష్మణరావుగారు మీరేనండి!" అని అడిగాడు.

"నేనే ! ఏమిట పని?" అని అడిగారు లక్ష్మణరావుగారు.

ఆ ఆసామి వయసు యాభై ఏళ్ళుంటవి. ఇస్త్రీ బట్టలు వేసుకుని జరీ పేటు కండువా వాల్లెవాటుగా వేసుకున్నాడు. లక్ష్మణరావుగారికి యెదురుగా ఉన్న కుర్చీలో కూర్చుని "పనివుండే వచ్చాను! రాధాకృష్ణ అనే అబ్బాయి మీ దగ్గరే ఉంటున్నాడుకదు! కొంచెం పిలుస్తారు-మాట్లాడాలి" అన్నాడు.

అప్పుడు లక్ష్మణరావుగారు రాధాకృష్ణను పిలవగా రాధాకృష్ణ వచ్చాడు.

ఆ ఆసామి రాధాకృష్ణను చూసి "యిదుగో అబ్బాయ్ ! నీతో ఓ విషయం చెప్పడానికి వచ్చాను. మీతండ్రి వుండగా మీతాలూకు పొలం మాగ్రామంలో ఒకళ్లకు సంక్రమించింది. అది మీతాతగారు సంపాయించిన ఆస్తి అవడంవల్ల ఆ ఆస్తిమీద మీతండ్రికేమీ హక్కులేదు. సర్వహక్కులు నీకే చెందుతవి. ఆ భూమికి యిప్పుడు మాంచిధరలు పెరిగినవి. ఆ ఆస్తిని వాళ్ల యెట్లయినా దక్కించుకోవాలనీ పాపం నిన్ను అంతం చెయ్యాలనీ చాలా ప్రయత్నాలుచేశారు. ఆ ఆస్తిని మీ తండ్రి నువ్వు మైనరుగావున్నప్పుడు పోగొట్టాడు కాబట్టి యిప్పుడు నీకుమైనరు వెళ్లిపోయింది. యిప్పుడు నువ్వు దావా వడవేస్తే ఆపొలం నీ స్వాధీన మౌతుంది. అంతా సుక్షేత్రమైన మాగాణి. అప్పుడు అంతధరలు లేవు. ఎకరం వెయ్యి రూపాయలు ధరకే వాళ్ళకు పోయింది. యిప్పుడు ఆపొలం ఎకరం నాలుగువేలు చేస్తుంది. లక్షరూపాయల పైచిలుకు ఆస్తి నీకు వస్తుంది. అవతల వాళ్ళు పరమ దుర్మార్గులు. గ్రామంలో వాళ్ళ కత్తికి యెదురుకత్తి లేదు. యేపనిచెయ్యడానికైనా వెను తీయరు. నిన్ను బెజవాడలో వకసారి, యిక్కడ వకటి రెండు సార్లు అయిపు లేకుండా చెయ్యడానికి ప్రయత్నించారు. గాని విఫలమై పోయింది. మాకూ, మాకూ వున్న కక్షలవల్ల యిలా చెపుతున్నాననీ అనుకోవద్దు. యిదంతా వాస్తవమైన విషయం. చట్టప్రకారం ఆ ఆస్తి నీకు తప్పక వస్తుంది" అనిచెప్పాడు.

అప్పుడు యివన్నీ ఆలకిస్తున్న లక్ష్మణరావు గారు "నువ్వు చెప్పింది నిజమే కావచ్చు. బెజవాడలో యీ అబ్బాయిని మేమే రక్షించాం," అని ఆ ఆసామిని అడిగి అవతలవాళ్ల అడ్రసు వివరంగా వ్రాసుకున్నాడు.

ఆసామి రాధాకృష్ణను మరొకసారి హెచ్చరించి లక్ష్మణరావు గారితో "పెద్దలు యీ విషయంలో మీరుగూడా కాస్త ఆలోచించమ''ని చెప్పి వెళ్లిపోయాడు.

అప్పుడు రాధాకృష్ణకు బెజవాడలోనూ, యిక్కడ ఆనాటి రాత్రి పద్మనాభం యింటి దగ్గరనించి వస్తూవుండగా జరిగిన దుర్ఘటనలు గుర్తుకువచ్చినవి. పొలం విషయం అతడు చిన్న పిల్లవాడై వుండగా జరిగింది కావడం వల్లి అతనికి తెలియదు. అప్పుడప్పుడు వెనక తమకు ఆస్తి వుండేదన్న సంగతి తల్లి చెప్పుతూవుండగా మాత్రం వినివున్నాడు.

అప్పుడు లక్ష్మణరావు గారు "ఏంరా రాధాకృష్ణ! అతడు చెప్పింది విన్నావు కదా! లోనికి వెళ్లి మీ అమ్మతోగూడా ఆలోచిద్దాం రా!" అనగా యిద్దరూ లోనికి వెళ్లి మధ్య హాల్లో కూర్చుని జానికమ్మను పిలిచి లక్ష్మణరావు గారు ఆమెతో అతడు చెప్పిన విషయమంతా చెప్పాడు.

అప్పుడు జానికమ్మ బెజవాడలోనూ యిక్కడా జరిగిన దుర్ఘటనలకు వాళ్లే కారకులని తెలుసుకుని విస్తుపోయింది. లక్ష్మణరావు గారితో యిట్లా అంది; "యేనాడు పోయిందో పొలం మాకు ప్రాప్తం లేనందువల్ల పోయింది, దుష్టులకుదూరంగా వుండడం మంచిది. యిప్పటికేయిన్ని తలపెట్టారు; పొలం తీసుకుంటే ఇంకా ఏంచేస్తారో! వక్కగాను ఒక్కబిడ్డ! భగవంతుడు రక్షిస్తే వాడే సంపాయించుకుంటాడు. ఇటువంటివన్నీ మనకెందుకు?" అంది.

"అట్లాకాదు. ఆలోచించదగ్గ విషయమమ్మా! కాస్తా కూస్తా కాదు. లక్ష రూపాయల పైచిలుకు ఆస్తి! మీకు అటువంటి ఉద్దేశం వుంటే ఒకపని చెయ్యవచ్చు. ఎకరం వెయ్యిరూపాయల ధరలో వాళ్ళు అందించుకున్నట్టు అతడు చెప్పాడు. అయితే మొత్తంవాళ్ళకు ఏ పాతిక ముప్పైవేలబాకీ కిందనో పోయివుంటుంది. వాళ్ళబాకీ ఈరోజువరకు, వడ్డీతోసహా యిచ్చివెయ్యండి. తతిమ్మాదే మీకు మిగులుతుంది. మొత్తం పొలం పోతుందనిగదా వాళ్ళి అఘాయిత్యానికి దిగడం! వాళ్ళబాకీ వాళ్ళకు ముట్టజేస్తే వాళ్ళుగూడా చాలా సంతోషిస్తారు" అని చెప్పాడు లక్ష్మణరావుగారు.

"ఇలాచేస్తే బాగుంటుంద"న్నాడు రాధాకృష్ణ.

జానికమ్మ యేమీ మాట్లాడలేదు.

ఆ సాయంత్రం జానికమ్మ, శశి టెంకాయ కర్పూరం పట్టుకుని శివాలయానికి బయలుదేరారు. పెద్దబజారు మలుపుతిరిగి ఓ వీధినే నడుస్తున్నారు. కొన్నిఇళ్ళు దాటాక ఓ గుమ్మంముందు నిలబడి బిచ్చం అడుగుతున్న ముసలివాడినీ, ఓ స్త్రీనీ చూశారు. ముసలివాడు తంబుర మీటుతూ యేదో పాడుతున్నాడు. మధ్య మధ్య వెంటవున్న ఆ స్త్రీ లోపల వున్నవాళ్ళకు వినపడేలాగు బిగ్గరగా 'దిక్కులేని పక్షులం తల్లీ!' అని కేకలువేస్తున్నది. జానికమ్మ, శశి ఆ స్త్రీని గౌరిగా పోల్చుకొని నిర్ఘాంతపొయ్యారు. మాసిన చీర, కృశించిన శరీరం వెనకటి గౌరికీ యిప్పటి గౌరికీ యేమాత్రం పోలికేలేదు. జానికమ్మ యిప్పుడు ఆధ్యాత్మిక చింతనలో కాలం వెళ్ళబుచ్చుతున్నది. గౌరిని చూసేసరికి ఆమె కళ్ళవెంట అశ్రుబిందువులు రాలినవి. 'భగవానుడా! తెలియక అజ్ఞానంతో చేసిన తప్పుకు యింత కఠినశిక్ష విధించేది తండ్రీ!' అని ఖేదపడ్డది.

శశి "ఆపదలోవున్న నన్ను కొన్నాళ్ళు యెంతో ప్రేమతో సాకింది" అంటూ కొంతదూరంలో వున్న గౌరి దగ్గరికి వెళ్ళింది. వీళ్ళను చూసి గౌరి యిక అక్కడ నిలవలేదు. ముసలాయనతోపాటు మలుపు తిరిగి పడివడిగా వాళ్ళనుదాటి వెళ్ళిపోయింది.

అప్పుడు జానికమ్మా, శశీ శివాలయానికి వెళ్ళిపొయ్యారు.

ఆ రాత్రి వంటగదిలో లక్ష్మణరావుగారు భోజనం చేస్తున్నారు. రాజ్యలక్ష్మమ్మగారు వడ్డనచేసి దగ్గరగా కూర్చుంది.

"ఏమిటి? అమ్మాయి పెళ్ళి విషయం! యెవరు వచ్చినా చేసుకోనంటోంది, మరి ఆమె అభిప్రాయం యేమిటో?" అన్నాడు లక్ష్మణరావుగారు.

"మొన్న రాజమండ్రి సంబంధం వచ్చిన రోజున వాళ్ళు వెళ్ళిపోయిన తర్వాత 'నీ ఉద్దేశం!ఏమిటమ్మా, యెవర్ని చేసుకుంటావు'అని మాట సామెతగా అడిగితే యేమీ బదులుచెప్పలేదు" అంది రాజ్యలక్ష్మమ్మగారు.

"నాకో ఆలోచన వోతున్నది. మనకు కావలసిన వరుడు చదువుకున్నవాడు, ఆరోగ్యవంతుడు అయితే చాలు. ఆస్తితో నిమిత్తంలేదు. మనకు కావలసినంత ఆస్తివుంది. యిది నిలబెట్టుకుంటే చాలు. అందుకని రాధాకృష్ణ అన్ని విధాలా నాకు తగినవాడుగా కనిపిస్తున్నాడు. చదువుకున్నవాడు; రూపవంతుడే కాకుండా బుద్ధిమంతుడుగూడా" అన్నాడు.

"మీరన్నమాట నిజమే! ఈ విషయం నేనొకసారి అనుకున్నానండి. మీతో చెపితే మీరేమంటారో అని అనలేదు. దూరపుకొండలు నునుపని యిస్తే కుర్రవాడి గుణం యెటువంటిదో మనం తెలుసుకోలేం గదా! రాధాకృష్ణ అన్ని విధాలా మనకు తెలిసినవాడు" అంది.

"అయితే అమ్మాయి ఉద్దేశమేమిటో తెలుసుకోవాలి!" అన్నాడు.

లక్ష్మణరావుగారు భోజనంచేసి మధ్యహాల్లో కుర్చీలో కూర్చున్నారు. రాజ్యలక్ష్మమ్మగారు దగ్గరగా కుర్చీలో కూర్చుంది. ప్రక్కగదిలో పుస్తకాలు సర్దుకుంటున్న కుమార్తెను పిలవగా "యేమిటి నాన్నా!" అంటూ వచ్చి కళ్యాణి తండ్రి సరసన కుర్చీలో కూర్చుంది.

"నీ పెళ్లి విషయం గురించే మీ అమ్మ, నేనూ ఆలోచిస్తున్నాం. మరి మాకు నచ్చిన వరుడు నీకు నచ్చడంలేదు. నీ అభిప్రాయం ఏమిటమ్మా ?" అని అడిగాడు లక్ష్మణరావుగారు.

కళ్యాణి తలవంచుకుని బదులు చెప్పలేదు.

"చెప్పమ్మా! మా దగ్గర చెప్పడానికి నీకు బిడియ మెందుకు!" అని కుమార్తెను బుజ్జగించాడు లక్ష్మణరావుగారు.

కళ్యాణి మారు పలకలేదు.

అప్పుడు లక్ష్మణరావుగారు "పోనీ, మా యిద్దరి అభిప్రాయం చెపుతాం వినమ్మా! మేము ఆలోచించేది నీ క్షేమాన్ని గురించేగా! రాధాకృష్ణ అన్ని విధాలా మాకు నచ్చాడు. చదువుకున్నవాడు, బుద్ధిమంతుడు. నీ అభిప్రాయం యేమిటి ?" అని అడిగాడు.

అప్పుడు కళ్యాణి చిరునవ్వుతో "మీ అభిప్రాయాన్ని నేను కాదంటానా నాన్నా!" అంది, విద్యుద్దీపపు కాంతికి ఆమె చెవుల రవ్వలలోలకులు తళుక్కున మెరిసినవి.

ఆ మాటకు తల్లి దండ్రుల హృదయాలు ఆనందంతో నిండిపోయినవి.

ఆమర్నాడు ఉదయం కాఫీ తాగాక లక్ష్మణరావుగారు, రాజ్యలక్ష్మమ్మ గారు మధ్యహాల్లో కూర్చుని జానకమ్మను పిలవగా ఆమెవచ్చింది.

"నీతో ఒక విషయం మాట్లాడాలి అలా కూర్చోమ్మా!" అన్నాడు లక్ష్మణరావుగారు.

జానికమ్మ కుర్చీలో కూర్చోడానికి వెరచి కూర్చోలేదు. అప్పుడు రాజ్యలక్ష్మమ్మగారు లేచి ప్రక్కగదిలో వున్న తుంగచాప తెచ్చి పరచగా జానికమ్మ కూర్చుంది, ఆమెతోపాటు రాజ్యలక్ష్మమ్మగారు గూడా చాపమీదనే కూర్చుంది.

అప్పుడు లక్ష్మణరావుగారు మందహాసంతో "మా అమ్మాయిని రాధాకృష్ణకు యిచ్చి వివాహం చెయ్యాలనుకుంటున్నాం; నీ అభిప్రాయం యేమిటమ్మా?" అని అడిగాడు.

ఆ మాటకు జానికమ్మ ఆనందపరవశురాలయింది. "అంతకంటే నేను కోరతగ్గది యేముంది నాయనా; వాణ్ణి మీ బిడ్డలా పెంచారు; ఒక యింటివాణ్ణి గూడా చేస్తామంటే నాకు అంతకంటే సంతోషకరమైంది యేముంది నాయనా!" అంది.

అప్పుడు లక్ష్మణరావుగారు "పెద్దదానివి, నీ చెవున వేశామనుకో; రాధాకృష్ణ అభిప్రాయం ఎలావుందో; ఆతడి అభిప్రాయంగూడా తెలుసుకోడం మంచిది. నేను యెదటవుంటే మాట్లాడేటందుకు భిడియపడతాడుగానీ మీ ఇద్దరూ పిలిచి అతడి అభిప్రాయం యేమిటో అడిగి తెలుసుకోండి;" అని చెప్పి లక్ష్మణరావుగారు లేచి కచేరిహాల్లోకి వెళ్ళిపొయ్యారు.

డాబాపైనవున్న రాధాకృష్ణను పిలవగా వచ్చి కుర్చీలో కూర్చున్నాడు. అప్పుడు జానికమ్మ "యిట్లా కళ్యాణిని నీకిచ్చి వివాహం చేస్తామంటున్నారు. నీ అభిప్రాయంగూడా తెలుసుకోమన్నార"ని చెప్పింది.

రాజ్యలక్ష్మమ్మగారు రాధాకృష్ణ యేమి చెపుతాడా అని యెదురుచూస్తున్నది.

ఆ మాటకు రాధాకృష్ణ "నాకిప్పుడు పెళ్ళిదేనికి! నిలకడచిక్కి యేదైనా ఉద్యోగం సంపాయించుకున్న తర్వాత సంగతి...." అన్నాడు.

అవతల కచేరీహాల్లో వుండి ఆ మాటలు ఆలకిస్తున్న లక్ష్మణరావుగారు లోనికివచ్చి "నువ్వు వేరే ఉద్యోగం చెయ్యవలసిన పనేమిటి? మనకు యింత

ఉందువుగాని. యిదివరకే మాలో కలిసిపోయ్యావు. ఇప్పుడు అమ్మాయిని గూడా యిస్తున్నామంటే కేవలం ఆత్మీయుడవై పోయ్యావు. నీ క్షేమమే మాక్షేమం!" అని చెప్పాడు.

* * *

తర్వాత లక్ష్మణరావుగారు అవతల వాళ్ళతో రాధాకృష్ణ తాలూకు పొలం విషయంలో వ్యవహారం నడపగా వడ్డీతో సహా వాళ్ళ బాకీ పోను యాభై వేల రూపాయల పైచిలుకు మిగిలినవి. కలవల అనంతరం రాధాకృష్ణ పరీక్ష ఫలితాలు తెలిసినవి. బి.ఏ. ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. రాధాకృష్ణకూ, కల్యాణికీ వైభవంగా వివాహంజరిగింది. ఆవివాహానికి జానికమ్మ తాలూకు బంధువులు, కొరిటిపాడునించి రాజమ్మ యింకా యితర వూళ్ళనించి బంధువులంతా కుటుంబ సహితంగా వచ్చి వారంరోజులు మకాంవేశారు. ఆనెలలోనే చంద్రానికీ, భారతికీ వివాహంజరిగింది. ఆవివాహానికి రాధాకృష్ణ పెత్తనం వహించాడు.

వివాహం కాగానే రాధాకృష్ణ పదిహేనువేలు బెట్టి అబజారులోనే డాబా కొని వేరే కాపురంపెట్టాడు. లక్ష్మణరావుగారు వ్యాపారంలో రాధాకృష్ణకు వాటాపెట్టాడు. రాధాకృష్ణ యిపుడు వ్యాపారంలో నిమగ్నుడయ్యాడు.

శశిని రామానికి యిచ్చి చెయ్యడానికి ముహూర్తం నిశ్చయమైంది. పెళ్ళి వారంరోజులు కద్దనంగా జానికమ్మ యింటిముందు నిలుచుని పెళ్ళిలా అవీ వేయిస్తూ వుండగా వెనకనించి "అక్కయ్యా!" అన్న పిలుపు. వినగానే వెనక్కితిరిగి చూసింది. 'భూషణం!' ఆమె సంతోషానికి మేరలేదు. "రా నాయనా! నిన్ను అనుకోని రోజులేదు" అంటూ లోనికి తీసుకువెళ్ళి "అబ్బాయి నిన్ను అరెస్టు చేశారని పత్రికలో చదివాడట; నాతో చెప్పాడు. అప్పటినించీ నా ధ్యానంతా నీ మీదే వుంది. యెప్పుడు విడిచిపెట్టా రేమిటి?" అంది జానికమ్మ.

"వారంరోజు లయింది విడిచిపెట్టి. సాక్ష్యం సరిగా లేనందువల్ల తేలిక లోనే పోయింది. కొరిటిపాడు వెళ్ళితే రాధాకృష్ణ పెళ్ళయి యిక్కడే ఉంటున్నాడని తెలిసింది. ఆపళ్ళ యిక్కడికి వచ్చాను" అన్నాడు భూషణం.

"అబ్బాయిపెళ్ళికి అందుకోకపోయినా అమ్మాయి పెళ్ళికయినా అందుకున్నావు. పెళ్ళి యింకా వారంరోజులే వుంది" అని చెప్పింది జానికమ్మ.

"అట్లాగా, సంతోషం! ఇక చెడ్డరోజులు పోయినవి. నేనుగూడా ఏదైనా కొద్దిపాటి వ్యాపారం పెట్టుకుందామని చూస్తున్నాను" అన్నాడు.

"అయితే యిక్కడే యేదైనా వ్యాపారం పెట్టుకో; కావలిస్తే అబ్బాయితో చెప్పి డబ్బు సహాయం చేయిస్తాను" అంది జానికమ్మ.

తర్వాత శశికీ, రామానికీ వివాహం జరిగిపోయింది.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః!

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
| --- | --- | --- | --- |
| 9 | 8 | నోటా పాటా | నోటా పాశా |
| 10 | 5 | యేమూల | యేమూల కబురు |
| 10 | 10 | వేకువఝామున | వేకువఝామునసంగా |
| 11 | 8 | జీతగాళ్ళ | జతగాళ్ళు |
| 25 | 5 | పట్టణంచివర గ్రామం | పట్టణం చివర |
| 29 | 22 | దేవుని | సేవిని |
| 36 | 29 | ఆఅమ్మ | ఆ అమ్మి |
| 52 | 5 | తల్లిమీదద్యాస | తల్లిమీదికి ధ్యాస |
| 63 | 16 | నీకోడలునీకోసం | నువ్వు నీ కోడలికోసం |
| 70 | 21 | పైలించికల్యాణియక్క డికెళివస్తుందో | పైనించి కల్యాణి వక్క తే నడచివస్తున్నది ఎక్కడికెళ్ళివస్తున్నదో |
| 78 | 10 | నీకేం తెలుసు | ఆడదానికి నీకేం తెలుసు |
| 81 | 1 | కాయలు | కాయలువేళ్ళాడుతూ |
| 86 | 18 | మీవాళ్ళకు | మీ ఆడవాళ్ళకు |
| 90 | 20 | దెబ్బ | దెబ్బలు |
| 94 | 14 | కూడినప్పుడు | కూడినప్పుడల్లా |
| 101 | 2 | వెళ్ళింది | వెళ్ళి |
| 108 | 12 | చెప్పకుండా | భనులుచెప్పకుండా |

| | | | |
|---|---|---|---|
| 114 | 10 | అక్కడేహాల్లో | అక్కడే హోటల్లో |
| 121 | 20 | తిట్టిచేసినకొద్దీ | తిట్టిపోసినకొద్దీ |
| 126 | 21 | రసకుదాయం | రసకందాయం |
| 144 | 1 | భాగాకర్రలు | భాణాకర్రలు |

137వ పేజీలో 6—7 పంక్తులు పొరపాటున పేరాగ్రాఫ్‌వదిలి పెట్టి కొటేషన్స్ యివ్వబడినవి. ఆ రెండు పంక్తులూ కింది పేరాగ్రాఫ్‌లో కలిపి చదువుకోవలెను.